నల్ల నైనకతంబునఁ గృష్ణుం డయ్యె వసుదేవునకు నొక్కెడ జన్మించినకారణం
బున వాసుదేవుం డయ్యె నీపాపనికి గుణరూపకర్మంబు లనేకంబులు గలుగుటం
జేసి నామంబు లనేకంబు లగు నీబాలకునివలన మీరు దుఃఖంబులఁ దరియిం
తు రీయర్భకునిచేత దుర్జనశిక్షణంబును సజ్జనరక్షణంబును నగు నీకుమారుండు
నారాయణసమానుం డని చెప్పి తనగృహమ్మున కమ్మునీశ్వరుండు సనియె
నందుఁడును బరమానందంబున నుండె నంత. 288

శ్రీకృష్ణబలరాముల జలక్రీడాభివర్ణనము.

సీ. జానుభాగముల హ ¦ స్తమ్ములు వీడ్వడ, నిడుచు దిగ్గనఁ బోదు ¦ రింత నంత
నవ్వులపయ్యెద ¦ [1]లంద జవ్వాడుదు, రాలక్రేపులతోఁక ¦ లలమి పట్టి
విడువ నేరక వాని ¦ వెనువెంట జరగుదు, రప్పంకముల దుడు ¦ [2]కడరఁ జొత్తు
రెత్తి చన్నిచ్చుచో ¦ నిరుదెసఁ బాలింత్లు, చేతులఁ బుడుకుచుఁ ¦ జేఁపు గలుగ
తే. దాఁటుదురు గ్రుక్కుగ్రుక్కుకుఁ ¦ దోర మగుదు
రాడుదురు ముద్దుపలుకు ల ¦ వ్యక్తములు గఁ
గరము లంఘ్రులు నల్లార్చి ¦ కదలుపుదురు
రామకృష్ణులు శైశవ ¦ రతులఁ దగిలి. 289

క. తడ వాడిరి బలకృష్ణులు, దడ వాడిరి వారిఁ జూచి ¦ తగ రంభాదుల్
దడవాడి రరులు భయమునఁ, దడ వాడిరి మంతనములఁ ¦ దపసులు వేడ్కన్.

సీ. తల లెత్తి మెల్లన ¦ తడవి యాడెడువేళఁ, బన్నగాధీశుల ¦ పదిగిఁ దాల్తు
రంగసమ్మృష్టపం ¦ కాంగరాగంబుల, నేనుఁగుగున్నల ¦ యొత్తు వత్తు
రసమంబు లైనజ ¦ వాతిరేకమ్ముల, సింగంపుఁగొదమల ¦ సిరి వహింతు
రాననంబులఁ గాంతు ¦ లంతంత కెక్కంగ, బాలార్కచంద్రుల ¦ పగిదిఁ దోఁతు
తే. రెలమిఁ దల్లులచన్నుఁబా ¦ లెల్లఁ ద్రావి, పరమయోగోద్భవామృత ¦ పానలీల
సోలియెఱుఁగనియోగుల ¦ సొంపు గందు, రాకుమారులు జనమనో ¦ హారు లగుచు.

వ. అందు. 292

క. చూడనివారల నెప్పుడుఁ, జూడక లోకములు మూఁడు ¦ చూపులఁ దిరుగం
జూడఁగ నేర్చినబాలక, చూడామణి జనుల నెఱిఁగి ¦ చూడఁగ నేర్చెన్. 293

క. నగవుల నవిద్యపోఁడిమి, నగుఁబాటుగఁ జేయ నేర్చు ¦ నగవరి యంతన్
నగుమొగముతోడ మెల్లన, నగుమొగములసతులఁ జూచి ¦ నగ నేర్చె నృపా.

క. అవ్వల నెఱుఁగక మువ్వుర, యవ్వల వెలుఁగొందుపరముఁ ¦ డర్భకుఁ డై యా
యవ్వలకు సంతసంబుగ, నవ్వా యవ్వా యనంగ ¦ నల్లన నేర్చెన్. 295

క. అడుగులు వే గలిగియు రెం, డడుగులనే మన్ను మిన్ను ¦ నలమిన బాలుం
డడుగిడ దొరఁకొనె శాత్రవు, లడుగులు [3]నడుగులును వదలి ¦ యడుగ గవనిఁ బడన్.

1. లంటి. 2. కసువఁ జొత్తు. 3. వడుగులును – నుడుగులును.

వ. మఱియును. 297

సీ. తనువున నంటిన ధరణీపరాగంబు, పూసిన[1] నెఱిభూతి పూఁత గాఁగ
ముందఱ వెలుఁగొందు ముక్తాలలామంబు, తొగలసంగడికాని తునుక గాఁగ
ఫాలభాగంబుపైఁ బరఁగు[2] కావిరిబొట్టు, కాముని గెల్చిన కన్ను గాఁగఁ
గంఠమాలికలోని ఘననీలరత్నంబు, కమనీయ మగు మెడకప్పు గాఁగ

ఆ. హారవల్లు లురగహారవల్లులు గాఁగ, బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివునిపగిది నొప్పె శివునికిఁ దనకును, వేఱు లేమిఁ దెల్ప వెలయునట్లు. 298

క. ఆపాపలవిహరణములు, దీపులు పుట్టింప మరగి తేఁకువ లేకా
గోపాలసతులు మక్కువ, నేపనులును మఱచి యుండి రీక్షణపరలై. 299

వ. ఆ సమయంబున బాలకులతల్లులు గోరుగోఱగొమ్ములు గలజంతువులవలన నేమఱక జలదహనకంటకాదులయెడ మోసపోక బాలసంరక్షణంబు సేయుచు నుల్లంబుల మొల్లంబు లైనప్రేమంబు లభిరామంబులుగా విహరించుచుండి రంత.

క. తనయీడుగోపబాలురు, దనుఁ గొలువఁగ రామఁ గూడి తనువు గలుగుచుం
దనుగమనంబునఁ గృష్ణుఁడు, తనుమధ్యలు మెచ్చ నీల తనురుచిఁ దనరెన్. 301

వ. మఱియు నాకుమారుండు దినదినంబునకు సంచారసంభాషణదక్షుండై. 302

ఉ. చప్పుడు సేయ కుండు మని జంకె యొనర్చిన నల్గి పోవఁగా
నప్పుడు బార సాఁచి తను నప్పలు విందులు వచ్చి రంచు న
వ్వొప్పఁగఁ జీరుతల్లి దెస కొత్తిలి కృష్ణుఁడు రంతు సేయుచు
న్నెప్పటి వచ్చి చన్గుడుచు నిం పొలయన్ మొలగంట మ్రోయఁగన్ 303

క. వల్లవగృహనవనీతము, లెల్లను భక్షించి వచ్చి యెఱుఁగనిభంగిం
దల్లి గదిసి[3] చిట్టాడుచు, నల్లన చనుఁబువ్వఁ బెట్టు మవ్వా యనుచున్. 304

వ. మఱియు గోపకుమారులం గూడికొని కృష్ణుండు. 305

సీ. గోవల్లభుఁడ నేను గోవులు మీ రని, వడి ఱంకె వైచుచు వంగి యాడు
రాజ నే భటులు మీరలు రం డని, ప్రాభవంబునఁ బెక్కు పనులు వనుచు
నేఁ దస్కరుండ మీ రింటివా రని నిద్ర, వుచ్చి సొమ్ములు గొని పోయి డాఁగు
నే సూత్రధారి మీ రిందఱు బహురూపు, లని చెలఁగుచు నాట లాడఁబెట్టు

తే. మూల లుఱుకును డాఁగురు మూఁత లాడు
నుయ్యెలల నూఁగుఁ జేబంతు లొనర వైచుఁ
జాఱిజీరలఁ జిఱుతల సాటి నిగుడు
శౌరి బాలురతో నాఁడు సమయమందు. 306

వ. మఱియు నాకుమారశేఖరుండు కపటశైశవంబున దొంగజాడలం గ్రీడింప గోపిక లోపికలు లేక యశోదకడకు వచ్చి యిట్లనిరి. 307

1. 'నెఱపూఁతభూతి గాఁగ'. 2. 'కావలి బొట్టు' వ్రా. ప్ర. 3. జట్టాడుచు.

గోపికలు శ్రీకృష్ణునిదుడుకుఁజేఁతల యశోదాదేవితోఁ జెప్పుట.

క. బాలురకుఁ బాలు లేవని, బాలెంతలు మొఱలు వెట్టఁ § బకపక నగి యీ
బాలుం డాలము సేయుచు, నాలకుఁ గ్రేపులను విడిచె § నంభోజాక్షీ. 308

క. పడఁతీ నీబిడ్డఁడు మా, కడవలలో నున్నమంచి § కాఁగినపాలా
పడుచులకుఁ బోసి చిక్కన, కడవలఁ బోనడిచె నాజ్ఞ § గలదో లేదో. 309

క. మీపాపఁడు మాగృహముల, నాపోవఁగఁ బాలు ద్రావ § నగపడ కున్నం
గోపించి పిన్నపడుచుల, వాపోవఁగఁ జిమ్ముకొనుచు § వచ్చెం దల్లీ. 310

*మత్తకోకిలము. పుట్టి పుట్టఁడు నేఁడు దొంగిలఁ § బోయి మాయిలు సొచ్చి తా
నుట్టి యందక ఱోళ్లఁ బీఁటలు § నొక్క ప్రోవిడి యెక్కి చే
వెట్టఁ జాలక కుండ క్రిం దొక § పెద్దతూఁ టొనరించి మీ
పట్టి మీఁగడ పాలు చేరలఁ § బట్టి త్రావెఁ దలోదరీ. 311

క. ఆడం జని వీరలపెరుఁ, గోడక నీసుతుఁడు ద్రావి § యొకయించుక తాఁ
గోడలిమూఁతిం దుడిచినఁ, గోడలు మ్రుచ్చనుచు నత్త § గొట్టె లతాంగీ. 312

క. వారిల్లు సొచ్చి కడవలఁ, దోరం బగునెయ్యి ద్రావి § తుది నాకడవల్
వీరింట నీసుతుం డిడ, వారికి వీరికిని దొడ్డ § వాదయ్యె సతీ. 313

క. వేలుపు లఱె నాకంఱెను, వేలుపు మఱి యెవ్వ రనుచు § వికవిక నగి మా
వేలుపులగోడ్లపై నో, హేలావతి నీతనూజుఁ § డెంగిలిఁ జేసెన్. 314

క. వెన్నఁ దినఁగఁ బొడగని మా, పిన్నది యడ్డంబు వచ్చి § పిఱిఁదికిఁ ద్రోవం
జ న్నొడిసి పట్టి చీరెను, జిన్నికుమారుండె యితఁడు § శీతాంశుముఖీ. 315

క. ఇమ్ముగువ దన్ను వాకిటఁ, గ్రుమ్మరుచోఁ జీరి నిలిపి § కొని పేరడుగం
గెమ్మోవిఁ గఱచి వడిఁ జనె, నమ్మా యీముద్దుఁగుఱ్ఱఁ § డల్పుఁడె చెప్పుమా. 316

క. చేబంతి దప్పి పడె నని, ప్రాబల్యముతోడ వచ్చి § భవనము వెనుకన్
మాబిడ్డ జలక మాడఁగ, నీబిడ్డఁడు వలువ దెచ్చె § నెలఁతుక తగునే. 317

క. ఇచ్చెలువఁ జూచి మ్రుచ్చిలి, యచ్చుగ నుఱికించుకొనుచు § నరిగెద నాతో
వచ్చెదవా యని యన్నాఁ, డిచ్చిఱుతఁడు సుదతి చిత్ర § మిట్టిది గలదే. 318

క. కొడుకులు లే రని యొకసతి, గడు వగవఁగఁ దన్ను మగనిఁ § గాఁ గైకొనినం
గొడుకులు గలిగెద రని పై, పడినాఁడది రవ్వ శిశువు § పనులే తల్లీ. 319

క. తలఁగినదానం దల మనఁ, దలఁగక యోచెలికి నాన § తలయెత్తఁగ నీ
తలఁగినచో బెయ్యది యని, తల యూఁచెన్ నీసుతుండు § దగవె మృగాక్షీ. 320

క. వ్రాలఁగ వచ్చిన నీసతి, చూలాలం దలఁగు మనుడుఁ § జూ లగుటకు నే
మూలంబు సెప్పు మనె నీ, బాలుఁడు సెప్పుదు రె సతులు § పర్వేందుముఖీ. 321

క. మగువా నీకొమరుఁడు మా, మగవా రటు వోవఁ జూచి § మంతనమునకుం
దగఁ జీరి పొందు నడిగెను, జగముల ము న్నిట్టిశిశువు § సదువంబడెనే. 322

ఆ. నమ్మి నిదురవోవ । నాపట్టిచుంచు మా, లేఁగతోఁకతోడ । లీలఁ గట్టి
వీథులందుఁ దోలె । వెలఁది నీకొమరుండు, రాచబిడ్డఁ డైన । నవ్వ మేలె. 323

క. నాపట్టిపొట్ట నిండఁగఁ, బైపడి నీపట్టి వెన్న । బానెం డిడినాఁ
డూపిరి వెడలదు వానిం, జూపెద నే మైన నీవ । చుమ్ము లతాంగీ. 324

క. తెఱవ యొకతె నిద్రింపఁగ, [1]నెఱిగట్టినవలువ వీడ్చి । నే టగు తేలుం
గఱపించి నీకుమారుఁడు, వెఱచుచు నది [2]పఱవ నగియె । విహితమె సాధ్వీ. 325

క. నాకొడుకును నాకోడలు, నేకతమున బెనఁగఁ బాము । నీతఁడు వైవం
గోక లెఱుంగక పాఱినఁ, గూఁక లిడెన్ నీసుతుండు । గుణమె గుణాఢ్యా. 326

ఆ. తరుణియొకతె పెరుఁగు । ద్రచ్చుచోఁ దుదివంగి, వెన్నఁ బుచ్చునొడిఁగి । వెనుకఁ గదిసి
మగువ నీసుతుండు । మగపోఁడుములు సేయఁ, జాఁగినాఁడు తగదె । చక్కఁ జేయ.

సీ. కలకంఠి మావాడ । గరితల మెల్ల నీ, పట్టి రాఁ గలఁ డని । పాలుపెరుఁగు
లిండ్లలోపల నిడి । యే మెల్లఁ దనత్రోవఁ, జూచుచో నెప్పుడు । సొచ్చినాఁడొ
తలుపులముద్రలుఁ । దాళంబులును బెట్టి, యున్న చందంబున । నున్న వరయ
నొకయింటిలోనాఁడు । నొకయింటిలోఁ బాడు, నొకయింటిలో నవ్వు । నొకటఁ దిట్టు

ఆ. నొకట వెక్కిరించు । నొక్కొక్కచో మృగ, పక్షి ఘోషణములు । పరఁగఁ జేయు
నిట్లు సేసి వెనుక । నెక్కడఁ బోవునో, కానరాఁడు రిత్త । కడవ లుండు. 328

క. కడులచ్చి గలిగె నేనిం, గుడుతురు గట్టుదురు గాక । కొడుకుల నగుచున్
బడుగులవాడలపైఁ బడ, విడుతురె రాకాంత లెందు । విమలేందుముఖీ. 329

క. ఓయమ్మ నీకుమారుఁడు, మాయిండ్లను బాలుఁ బెరుగు । మన నీఁ డమ్మా
పోయెద మెక్కడి కైనను, మాయన్నలసురభులాన । మంజులవాణీ. 330

వ. అని మఱియు ననేకవిధంబు లైనబాలకృష్ణునివినోదంబులు దమయుంపుఁ జేయు ప్రసాదంబు లని యెఱుంగక దూఱుచున్నగోపికలకు యశోద యిట్లనియె. 331

క. చన్ను విడిచి యిట్టటు చనఁ, డెన్నఁడుఁ బొరుగిండ్లత్రోవ । లెఱుఁగఁడు నేఁడుం
గన్నులు దెఱవనిమాయీ, చిన్నికుమారకుని నవ్వ । సేయుం దగునే. 332

తే. అన్య మెఱుఁగఁడు తనయంత । నాడుచుండు, మంచివాఁ డితఁ డెగ్గులు । మానరమ్మ
రామలార త్రిలోకాభి । రామలార, తల్లులార గుణవతీమ । తల్లులార. 333

వ. అని వారల నొడంబఱిచి పంపి కొడుకుం గోపింపం జాలక యుండె నిట్లు. 334

మృద్భక్షణవిశ్వరూపప్రదర్శనాద్యభివర్ణనము.

ఉ. కాంతలు దల్లితోఁ దనవి । కారము లెల్ల గణింప భీతుఁ డై
శాంతునిసొంపునం బరమ । సాధునిపెంపున గోలమాడ్కి వి
భ్రాంతుని కైవడిన్ జడుని । భంగిఁ గుమారకుఁ డూరకుండె నే

1. నెఱిఁ గట్టినవలువ. 2. యఱవ.

వింతయు లేక తల్లికుచ § [1]వేదిక నొదల మోపి యాడుచున్. 335

వ. అంత నొక్కనాఁడు బలభద్రప్రముఖు లైనగోపకుమారులు వెన్నుండు మన్ను దినె నని చెప్పిన యశోద బాలుని కేలు వట్టికొని యి ట్లనియె. 336

క. మ న్నేటికి భక్షించెదు, మన్నియమము లేల నీవు § మన్నింపవు మీ యన్నయు సఖులును జెప్పెద, రన్నా మ న్నేల మఱి ప § దార్థము లేదే. 337

వ. అని పలికిన ముగుదతల్లికి [2]నెఱవాదిదంట యైనకొడు కి ట్లనియె. 338

శా. అమ్మా మన్ను దినంగ నే శిశువనో § యాఁకొంటినో వెఱ్ఱినో
నమ్మం జూడకు వీరిమాటలు మదిన్ § స న్నీవు గొట్టంగఁ దా
రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కా § దేనిన్ మదీయాస్యగం
ధ మ్మాఘ్రాణము సేసి నావచనముల్ § దప్పైన దండింపవే. 339

వ. అని పలికి నెయ్యంబున నయ్యవ్వ నియ్యకొలిపి క్రీడామనుజబాలకుం డైన యీశ్వరుండు తననోరు దెఱచి ముఖంబుఁ జూపిన. 340

క. ఆ లలితాంగి గనుంగొనె, బాలునిముఖమందు జలధి § పర్వతవనభూ
గోళ శిఖి తరణి శశి ది,క్పాలాది కరండ మైన § బ్రహ్మాండంబున్. 341

వ. కనుంగొని. 342

మ. కలయో వైష్ణవమాయయో యితరసం § కల్పార్థమో సత్యమో
తలఁపన్ నేరక యున్నదాననొ యశో § దాదేవిఁ గానో పర
స్థలమో బాలకుఁ డెంత యీతనిముఖ § స్థం బై యజాండంబు ప్ర
జ్వల మై యుండుట కేమి హేతువొ మహా § శ్చర్యంబు చింతింపఁగన్. 343

ఆ. బాలమాత్రుఁ [3]డైన § బాలునిముఖమందు, విశ్వ మెల్ల నెట్లు § వెలసియుండు
బాలుభంగి నితఁడు § భాసిల్లుఁ గాని స,ర్వాత్ముఁ డాదివిష్ణుఁ § డగుట నిజము.

వ. అని నిశ్చయించి. 345

ఆ. ఏ మహాత్మువలన § నీవిశ్వ మంతయుఁ, గానఁబడిన బుద్ధి § కంప మయ్యె
నా మహాత్ము నితని § నఖిలలోకాధారు, నార్తు లెల్లఁ బాయ § నాశ్రయింతు.

క. నామగఁడు నేను గోవులు, నీమందయు గోపజనులు § నిబ్బాలుని నె
మ్మోమున నున్నవిధము గని, యేమఱితిమి గాని యీశుఁ § డీతఁడు మాకున్.

వ. అని తన్నుఁ బరమేశ్వరుం డని తలంచుచున్నయశోదయందు నాకృష్ణుండు వైష్ణవమాయం బొందించిన. 348

క. జడనుపడి యెఱుక సెడి యా, పడఁతుక సర్వాత్ముఁ డనుచుఁ § బలుకక యతనిం
గొడు కని తొడపై నిడుకొని, కడువేడుకతోడ మమత § గావించె నృపా. 349

వ. అనిన విని రాజి ట్లనియె. 350

1. పీఠిక. 2. నెఱదంట. 3. 'డగుసలీలుని' అ. ప్ర. 4. నీమందల సఖులుఁ బతులు.

ఆ. జగదధీశ్వరునకుఁ [1]జన్నిచ్చుతల్లిగా, నేమి నోము నోఁచె నీయశోద
పుత్త్రుఁ డనుచు నతనిఁ బోషించుతండ్రిగా, నందుఁ డేమి సేసె నందితాత్మ.

క. ప్రబ్బినభక్తిని హరిపైఁ, గబ్బంబులు సెప్పి కవులు కైవల్యశ్రీ
గబ్బుదు రట హరిపోషణ, మబ్బినతలిదండ్రు లెచటి కబ్బుదురో తుదిన్.

వ. అనిన విని రాజయోగికి శుకయోగి యిట్లనియె. 353

నందయశోదలపూర్వజన్మవృత్తాంతము.

సీ. అవనీశ విను ద్రోణుఁ డనువాఁడు వసువుల, యందు ముఖ్యుఁడు ధర యతనిభార్య
వారి నిద్దఱ బ్రహ్మ వసుధపై జన్మింపుఁ, డంచుఁ బంచిన వార లతనిఁ జూచి
విశ్వేశ్వరుం డైన విష్ణుసేవారతి, మా కిచ్చి తేనియు మహి జనింతు
మనవుడు నట్ల కా కనియె వేల్పులపెద్ద, యాద్రోణుఁ డీనందుఁ డై జనించె

ఆ. ధర యశోద యయ్యె దనుజేంద్రవైరియుఁ, గమలగర్భుమాట గారవించి
తల్లిదండ్రు లనుచుఁ దగ వారి మన్నించె, నధికభక్తి వారు నలరి రిట్లు.

వ. అంత నొక్కనాఁడు దనయింటిపాప లందఱు నయ్యోపనులందుఁ బంపువడి పోయిన నందసుందరి సంరంభంబునం దరికంబంబుకడకుదురున నొక్కదధికుంభంబు వెట్టి మిసిమి గలమీఁగడపెరుఁగు గూడం బోసి పీఁక నాఁకత్రాడు కవ్వంబున నలవరించి.

యశోద దధిభాండవికలనాదులు సేసినకృష్ణునిఁ బట్టుకొనుట.

సీ. కరకమలారుణ కాంతిఁ గవ్వపుఁద్రాఁడు, పవడంపునునుఁదీవ పగిది మెఱయఁ
గ్రమముతో రజ్జు వా కర్షింపఁ బాలిండ్లు, వీడ్వడి యొండొంటి వీక నొత్తఁ
గుచకుంభములమీఁది కొంగు జాఱఁగఁ జిక్కు, వడుచు హారావళి బయలుపడఁగఁ
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము, మంచు పైపడినప ద్మంబుఁ దెగడఁ

తే. గౌను నులియంగఁ గంకణ క్వణన మెసఁగఁ
దుఱుము బిగ వీడఁ గర్ణికా ద్యుతులు మెఱయ
బాలు నంకించి పాడెడి పాటవలనఁ
దఱువు లిగు రొత్తఁ బెరుఁ గింతి దరువఁ జొచ్చె. 356

వ. ఆ సమయంబున. 357

క. సుడియుచు వ్రాలుచుఁ గెదుకుచుఁ, సడి గొట్టుచు నమ్మ రమ్మ చన్నిమ్మనుచున్
వెడవెడగంతులు వైచుచుఁ, గడవఁ గదిసి బాలకుండు కవ్వముఁ బట్టెన్.

క. కవ్వముఁ బట్టిన ప్రియసుతు, నవ్వనరుహనేత్ర దిగిచి యంకతలమునన్
నవ్వుచు నిడుకొని కూఁకటి, దువ్వుచుఁ జన్నిచ్చె నతఁడు దూఁటుచుఁ గుడిచెన్.

మ. కడుపారం జనుఁబాలు ద్రావనిసుతుం గంజాక్షి పీఠంబుపై
నిడి పొంగారెడిపాలు డించుటకు [2]నై యేఁగంగఁ దద్బాలుఁ డె

1. జనియించుతల్లిగా. 2. బోయెం జూచి.

క్కడుఁగోపంబున వాఁడిఱాత దధిమ । త్కుంభంబు వోఁ గొట్టి తెం
పడరం గుంభములోనివెన్నఁ దినె మి । థ్యాసంకులద్బాష్పుఁ డై. 360

వ. అంత నాలోలలోచన పాలు డించి వచ్చి వికలంబు లయినదధికుంభశకలం
బులఁ బొడగని తుంటకొడుకు వెన్న దింట యెఱింగి నగుచు [1]నాగలబికానిం
గానక చని చని. 361

ఆ. వికచకమలనేత్ర । వే ఱోకయింటిలో, వెలయ ఱోలు దిరుగ । వేసి యెక్కి
యుట్టిమీఁదివెన్న । నులుకుచు నొకక్రోఁతి, పాలు సేయుచున్న । బాలుఁ గనియె.

మ. కని చేతన్ సెలగోల వట్టికొనుచుం । గా నిమ్ము గా నిమ్ము రా
తనయా యెవ్వరియందుఁ జిక్కవడ నే । దండంబునుం గాన నే
వినివారంబునఁ బొంద నేవెఱపు నే । విభ్రాంతియుం జెంద ము
న్ననియో నీ విటు నన్నుఁ గైకొనమి నేఁ । డారీతి సిద్ధించునే. 303

వ. అని [2]యదలించుచుఁ గొడుకునడవడిం దలంచి తనమనంబున. 364

సీ. బాలుఁ డీతం డని । భావింతు నందునా, యేపెద్దలును నేర । రీక్రమంబు
వెఱ పెఱుంగుటకునై । వెఱపింతు నందునా, కలిగి లే డొక్కఁడు । గాని లేఁడు
వెఱపుతో నాబుద్ధి । వినిపింతు నందునా, తనఁ దాన యై [3]బుద్ధిఁ । దప్ప కుండు
నొం డెఱుంగక యింట । నుండెడి నందునా, చొచ్చిచూడని దొక । చోటు లేదు

ఆ. తన్ను నెవ్వరైనఁ । దలపోయఁ బాఱెడి, యోజ లేదు భీతి । యొకటి యెఱుఁగఁ
డెలమి నూరకుండఁ । డెక్కసక్కము లాడుఁ, బట్టి శాస్తిసేయు । భంగి యెట్లు.

వ. అని వితర్కించి. 366

క. లాలనమున బహుదోషము, లోలిం బ్రాపించుఁ దాడ । నోపాయములం
జాల గుణంబులు గలుగును, బాలురకును దాడనంబ । పథ్యం బరయన్. 367

వ. అని నిశ్చయించి కేల నున్నకోల జళిపించి బాలా నిలు నిలు మని బగ్గుబగ్గున
నదల్చుచుఁ దల్లి దగ్గఱిన బెగ్గడిలినచందంబున నగ్గలిక సెడి ఱోలు డిగ్గ నుఱికి.

క. గజ్జెలు గల్లని మ్రోయఁగ, నజ్జలు ద్రొక్కుటలు మాని । యతిజవమున యో
షిజ్జనములు నగఁ దల్లియుఁ, బజ్జం జనుదేర నతఁడు । పరు విడె నధిపా. 369

వ. అప్పుడు. 370

మ. స్తనభారంబున డస్సి క్రుస్సి [4]యసదై । జవ్వాడుమధ్యంబుతో
జనితస్వేదముతోఁ జలత్కబరితో । స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణ గూడఁబాఱి యెయిదెన్ । వారించుచున్ వాకిటన్
ఘనయోగీంద్రమనంబులున్ వెనుకొనం । గా లేనిలీలారతున్. 371

వ. ఇట్లు గూడం జని. 372

సీ. స్తంభాదికంబులు । దనకు నడ్డం బైన, నిట్టట్టు సని పట్ట । సీనివాసి

1. నాకలభి_నాకలభ_కాని. 2. మందలించుచు_మూదలించుచు. 3. తుది. 4, యసు దె.

నీతప్పు సైరింపు ✽ మింక దొంగిలఁ బోవ, నే నని మునుముట్ట ✽ నేర్చువానిఁ
గాటుక నెఱయంగఁ ✽ గన్నులు నులుముచు, వెడలుకన్నీటితో ✽ వెగచువాని
నేదెస వచ్చునో ✽ యిదియని పలుమాఱు, [1]సురుఁగుచక్కటిఁ బాఱఁ ✽ జూచువానిఁ

ఆ. కూడఁ బాఱి పట్టు ✽ కొని వెఱపించుచుఁ, జిన్నివెన్నదొంగ ✽ చిక్కెననుచు
నలిగి కొట్టఁ జేతు ✽ లాడక పూఁబోఁడి, కరుణతోడ బాలుఁ ✽ గట్టఁ దలఁచి. 374

వ. ఇట్లనియె.

క. మీ రెవ్వరు శ్రీకృష్ణులు, గారా యెన్నఁడును వెన్న ✽ గానరఁట కదా
చోరత్వం బించుకయును, నేరరఁట ధరిత్రి నిట్టి ✽ నియతులు గలరే. 375

క. [2]పట్టాసపడక నిన్నుం, బట్టెద మని చలముగొనినఁ ✽ బట్టుట పెట్టే
పట్టువడ వండ్రు పట్టీ, పట్టుకొనన్ నాకుఁ గాక ✽ పరులకు వశమే 376

క. ఎక్కడనైనను దిరిగెద, వొక్కయెడన్ గుణము గలిగి ✽ యుండవు నియమం
బెక్కడిది నీకు మఱచినఁ, జక్కనఁ బోయెదవు పెక్కు ✽ జాడలఁ బుత్త్రా. 377

సీ. తోయంబు లివి యని ✽ తొలఁగవు చొచ్చెదు, తలఁచెదు గట్టైనఁ ✽ దరల నెత్త
మంటితో నాటలు ✽ మానవు కోరాడె, దున్నత స్తంభంబు ✽ లూఁపఁ బోయె
దన్యుల నల్పంబు ✽ లడుగంగఁ బాఱెదు, రాచవేటలఁ జాల ✽ అవ్వదెచ్చె
దలయవు నీళ్లకు ✽ నడ్డంబు గట్టెదు, ముసలివై హరివృత్తి ✽ మొనయఁ జూచె

ఆ. దంబరంబు మొలకు ✽ నడుగవు తిరిగెద, వింకఁ గల్కితనము ✽ లేల పుత్త్ర
నిన్ను వంప వ్రాల్ప ✽ నే నేర ననియె నీ, విట్లు క్రిందు మీఁదు ✽ నెఱుఁగకునికి.

ఉలూఖలబంధనయమళార్జునభంజనాద్యభివర్ణనము.

వ. అని మర్మంబు లెత్తి పలికి. 379

క. ఆలలన గట్టె ఱోలన్, లీలన్ నవనీతచౌర్య ✽ లీలుం బ్రియవా
గ్జాలుం బరివిస్మితగో, పాలున్ ముక్తాలలామ ✽ ఫాలున్ బాలున్. 380

క. ఱోలను గట్టువడియు న, బ్బాలుఁడు విలసిల్లె భక్త ✽ పరతంత్రుం డై
యాలానసన్నిబద్ధవి, శాలమదేభేంద్రకలభ ✽ సమరుచి నధిపా. 381

క. వెలిలోను మొదలుతుదినడు, ములు లేక జగంబుతుదియు ✽ మొదలున్ నడుమున్
వెలియును లోనగు నీశ్వరు, నలవడునే కట్టఁ బ్రణతు ✽ రాలి గాకున్నన్. 382

ఆ. పట్టి యెల్లఁబోఁటి ✽ పట్టి యీతం డని, కట్టి తలఁపుతోడఁ ✽ గట్టెఁ గాక
పట్టికడుపు పెక్కు ✽ బ్రహ్మాండములు పట్టు, నెఱిఁగెనేనిఁ దల్లి ✽ యేలకట్టు. 383

క. చిక్కఁడు సిరికౌఁగిటిలోఁ, జిక్కఁడు సనకాదియోగి ✽ చిత్తాబ్జములం
జిక్కఁడు శ్రుతిలతికావలిఁ, జిక్కె నతఁడు లీలఁ దల్లి ✽ చేతన్ ఱోలన్. 384

వ. ఇట్లు గ్రద్దన నాముద్దియ ముద్దులకొడుకని యుదరంబు గట్టఁ జదురం బని

1. సొలయుచు చక్కటిఁ 'సురుఁగుచుఁ గ్రేఁగంటఁ' అ. ప్ర. 2. 'పట్టినఁ బట్టువడనినినుఁ' అ. ప్ర.

చక్క నొక్కత్రాడు సుట్టిన నది రెండంగుళంబులు గడమపడియె మఱియు నొక్కబంధనంబు సంధించి వలగొనిన నంతియ కొఱంత యయ్యె వెండియు నొక్కపాశంబు గూర్చి పరివేష్టించిన వెల్తి సూపె నిట్లు. 385

క. తజ్జనని లోఁగిటం గల, రజ్జుపరంపరలఁ గ్రమ్మఱ సుతుఁ గట్టన్
బొజ్జ దిరిగి రా దయ్యె జ, గజ్జాలము లున్నబొజ్జఁ గట్టన్ వశమే. 386

వ. అప్పు డాయవ్వయు గోపికలును వెఱంగుపడిరి తదనంతరంబ. 387

ఆ. ఒడలఁ జెమట లెగయ నుత్తరీయము జాఱ, వీడియున్నతుఱుము విరులు రాలఁ
గట్ట రానితన్నుఁ గట్టెద నని చింతఁ, గట్టుకొనినతల్లిఁ గరుణఁ జేసి. 388

క. బంధవిమోచనుఁ డీశుఁడు, బాధింపఁ బెనంగుజననిఁ బాలార్చి సుహృ
ద్బంధుఁడు గావున జననీ, బంధంబునఁ గట్టువడియెఁ బాటింప నృపా. 389

క. సంగడిఁ దిరిగెడుశంభుఁడు, సంగాశ్రయ మైనసిరియు నాత్మజుఁడై యు
ప్పొంగెడిపద్మజుఁడును గో, పాంగనక్రియఁ గరుణ వడయ రఖిలేశ్వరుచేన్. 390

క. జ్ఞానులచే మానులచే, దానులచే యోగసంవిధానులచేతం
బూని నిబద్ధుం డగునే, శ్రీనాథుఁడు భక్తియుతుల చేతంబోలెన్. 391

వ. అంత నయ్యశోద యింటికడం బనులవెంటం దిరుగఁ గృష్ణుండు దొల్లి నారదు శాపంబున నిరుమద్దులై యున్ననలకూబరమణిగ్రీవులను గుహ్యకుల నిద్దఱంగని ఱోలీడ్చుకొని చనియె నని చెప్పిన శుకయోగివరునకు భూవరుం డి ట్లనియె. 392

క. నారదుఁ డేల శపించెను, వా రావృక్షత్వమునకు వచ్చినపనికిం
గారణ మెయ్యది యోగికు, లారాధ్య యెఱుంగఁ జెప్పు మయ్య వినియెదన్.

వ. అనిన శుకుం డి ట్లనియె మున్ను కుబేరునికొడుకు లిరువురు శంకరకింకరు లై యహంకరించి వెండికొండమీఁద విరులతోఁటలం బాడెడిచేడియలం గూడి కొని కరేణుసంగతంబు లైనయేనుంగులభంగి సురంగంబు లైనమందాకినీ తరంగంబులం గ్రీడింప నారదుండు వచ్చిన నచ్చెలువలు సెచ్చెర వలువలు ధరియించిరి మదిరాపానపరవశులు గావున వార లిరువురు వివస్త్రు లై మెలంగుచున్న నా మునీశ్వరుండు చూచి శపియించువాఁ డై ప్రతీతంబుగా నొక్క గీతంబువాడె వినుము. 394

శా. సంపన్నుం డొరుఁ గాన లేఁడు తనువున్ సంసారమున్ నమ్మి హిం
సింపం జూచు దరిద్రుఁ డెత్తువడి శుష్కీభూతుఁ డై యుక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సములుగాఁ జింతించు నట్లౌటఁ ద
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపఁగన్. 395

వ. అని గీతంబు వాడి తనమనంబున. 396

క. కలవానిసుతుల మనుచును, గలకంఠులతోడఁ గూడి కానరు పరులం
గలలో నైనను వీరికిఁ, గలక్రొవ్వడఁగించి బుధులఁ గలుపుట యొప్పున్. 397

వ. అని చింతించి విజ్ఞానవిశారదుం డగునారదుండు నలకూబరమణిగ్రీవులం జూచి మీరలు శ్రీమదాంధులరు గావున భూలోకంబున నర్జునతరువు లై నూఱుదివ్య వర్షంబు లుండుం డటమీఁద గోవిందచరణారవింద పరిస్పందంబున. 398

క. ముక్తుల రై నారాయణ, భక్తుల రై పరమసాధు ♦ భావశ్రీసం
సక్తుల రై సురలోక, వ్యక్తుల రయ్యెదరు నాదు ♦ వాక్యముకతనన్. 399

వ. అని యిట్లు వలికి నారదుండు నారాయణాశ్రమంబునకుం జనియె వారిరువురును సంగడిమద్దు లైరి పరమభాగవతుం డైననారదుమాటలు వీటింబుచ్చక పాటించి.

క. ముద్దులతక్కరిబిడ్డఁడు, మద్దులఁ గూల్పంగఁ దలఁచి ♦ మసలక త్రా నా
మద్దికవ యున్నచోటికి, గ్రద్దన ఱో లీడ్చుకొనుచుఁ ♦ గడఁకం జనియెన్. 401

వ. చని [1]యాయూర్జితమహాబలుండు నిజోదరదామ సమాకృష్యమాణతిర్యగ్భవదులూఖలుం డై యారెండుమ్రాఁకులనడుమం జొచ్చి ముందటికి నిగుడుచు. 402

క. బాలుఁడు ఱో లడ్డము దివ, మూలంబులు వెకలి విటప ♦ ములు విఱిగి మహా
భీలధ్వనిఁ గూలెను శా, పాలస్యవివర్జనములు ♦ యమళార్జునముల్. 403

వ. ఇట్లు నిర్మూలంబు లయి పడినసాలంబులలోనుండి కీలికీలలు వెల్వడుపోలికి నెక్కుడుతేజంబున దిక్కులు పిక్కటిల్లం బ్రసిద్ధు లైనసిద్ధు లిద్దఱు వెడలి వచ్చి ప్రబుద్ధు లై భక్తలోకపాలకుం డైనబాలకునకు మ్రొక్కి లేచి కరకమలంబులు మొగిచి యి ట్లనిరి. 404

క. బాలుఁడవె నీవు పరుఁడ వ, నాలంబుఁడ వధిక యోగి ♦ వాద్యుఁడవు తను
స్థూలాకృతి యగువిశ్వము, నీలీలారూప మండ్రు ♦ నిపుణులు కృష్ణా. 405

సీ. ఎల్లభూతంబుల ♦ కింద్రియాహంకృతి, ప్రాణంబులకు నధి ♦ పతివి నీవ
ప్రకృతియుఁ బ్రకృతిసం ♦ భవమహత్తును నీవ, వీని కన్నిటికిని ♦ విభుఁడ వీవ
ప్రాకృతగుణవికా ♦ రములఁ బొందక పూర్వ, సిద్ధుఁడ వగునిన్నుఁ ♦ జింత సేయ
గుణవృతుం డోపునే ♦ గుణహీన నీయంద, కలగుణంబుల నీవ ♦ కప్పఁబడుదు

తే. మొదల నెవ్వనియవతారకములు శరీరు, లందు సరిదొడ్డు లేనివీర్యములఁ దనువు
లడర జన్మించి వారలయందుఁ జిక్క, వట్టిపరమేశ మ్రొక్కెద ♦ మయ్య నీకు.

క. భువనములు సేయఁ గావఁగ, నవతీర్ణుఁడ వైతి కాదె ♦ యఖిలేశ్వర యో
గివరేణ్య విశ్వమంగళ, కవిసన్నుత వాసుదేవ ♦ కల్యాణనిధీ. 407

ఉపేంద్రవజ్రము. తపస్వివాక్యంబులు ♦ దప్ప వయ్యెన్
నెపంబునం గంటిమి ♦ నిన్నుఁ జూడం
దపంబు లొప్పెన్ మముఁ ♦ దావకీయ
ప్రపన్నులం జేయుము ♦ భక్తమిత్రా. 408

నీపద్యావళు లాలకించుచెవులున్ ♦ నిన్నాడువాక్యంబులున్

1. యాభిజితమహా.

నీపేరం బనిసేయుహస్తయుగముల్ § నీమూర్తిపైఁ జూపులున్
నీపాదంబులపొంత మ్రొక్కుశిరముల్ § నీసేవపైఁ జిత్తముల్
నీపైబుద్ధులు మాకు నిమ్ము కరుణన్ § నీరేజపత్త్రేక్షణా. 409

వ. అని యిట్లు కీర్తించి నమస్కరించినగుహ్యకులం జూచి నగుచు నులూఖలబద్ధుండైనహరి యిట్లనియె. 410

క. తమతమధర్మము దప్పక, సము లై నను నమ్మి తిరుగు § సభ్యులకును బంధము ననుఁజూచిన విరియును, గమలాప్తుఁడుఁ బొడమ విరియు§ఘనతమము క్రియన్.

క. కారుణ్యమానసుం డగు, నారదువచనమునఁ జేసి § ననుఁ బొడగనుటన్
మీరు ప్రబుద్ధుల రైతిరి, చేరున్ నామీఁదితలఁపు § సిద్ధము మీకున్. 412

వ. అని యీశ్వరుండు మీరు మీనెలవులకుం బొం డని యాన తిచ్చిన మహాప్రసాదం బని వలగొని పెక్కు మ్రొక్కు లిడి వీడుకొని నలకూబరమణిగ్రీవు లుత్తరభాగంబున కరిగి రంత నందాదు లయినగోపాలకులు నిర్మూలంబు లయి పడినసాలంబులచప్పుడు పిడుగుచప్పు డని శంకించి వచ్చి చూచి. 413

క. ఈ పాదపములు గూలఁగ, నీపాపఁ డులూఖలమున § నిటు బద్ధుం డై
యేపగిది బ్రదికెఁ గంటిరె, వాపోవఁడు వెఱవఁ డెట్టి § వాఁడో యితఁడున్. 414

ఆ. పిడుగు వడుట గాదు § పెనుగాలి విసరదు, ఖండితంబు లగుట § గానరాదు
బాలుఁ డితఁడు వట్టి § పడఁ ద్రోవఁ జాలఁడుఁ, దరువు లేల కూలె § ధరణిమీఁద.

వ. అని పెక్కండ్రు పెక్కువిధంబుల నుత్పాతంబులు గావలయు నని శంకింప నక్కడ నున్న బాలకు లిట్లనిరి. 416

క. నందునికొమరుఁడు వినుఁ డీ,సందున మును దూఱి ఱోలు § సరి నడ్డముగా
ముందటికీడ్చిన మద్దులు, గ్రందుకొనం గూలె జనులఁ § గంటి మిరువురన్. 417

వ. అని యిట్లు వలికిన బాలకాలాపంబులు విని (కొందఱు) మిథ్యారూపంబు లని (రి) కొందఱు (నానావిధంబుల) సందేహించి రంత నందుండు వికసితముఖారవిందుం డగుచుఁ బట్టికట్టు విడిచె నట్టియెడఁ దన తెఱం గెవ్వరు నెఱుంగ కుండవలె నని తవరకుమారుండు. 418

ఉ. పాడున్ మందునిభంగి గోపవనితల్ § పాణిధ్వనుల్ సేయఁగా
నాడున్ జంత్రముకైవడిం బరవశుం § డై హస్తముల్ ద్రిప్పుచుం
జూడన్ నేరనివానిభంగి [1]జనులం § జూచున్ నగున్ బాలురం
గూడుం బెద్ద''పంపు సేయఁ జనుఁ డాఁ § గున్ [2]మట్టెఁ జిట్టాడుచున్. 419

క. చుం చెదుగుఁ బాలు [3]పుడిసెఁ డు,దంచితముగఁ ద్రావు మనుచుఁ§ద్రావి జననితోఁ
జుం చెదుగ దనుచు లీలా,చుంచుం డై యతఁడు చుంచుఁ § జూపు నరేంద్రా.

క. నెలగోల వట్టుకొని జల, కలశములో నీడఁ జూచి § కలశగతుం డై

1. నడచుం. 2. దూఁగుఁ జిట్టాడుచున్. 3. గుడిపెఁ డు.

సెలగోలఁ బాపఁ డొకఁ డదె, తలఁచెఁ ననుఁ గొట్ట ననుచుఁ ‡ దల్లికిఁ జెప్పెన్.

క. భిక్షులు వచ్చెద రేడ్చిన, భిక్షాపాత్రమున వైచి ‡ [1]బెగడించి నినున్
శిక్షించెద రని చెప్పిన, భిక్షులఁ గని తల్లి నొదిఁగి ‡ భీతిల్లు నృపా. 422

నందాదులు బృందావనంబునకు నరుగుదెంచుట.

వ. ఇట్లు కృష్ణుండు బహువిధంబులఁ గపటబాలలీలల వినోదింప బృహద్వనంబున నందాదు లైనగోపవృద్ధులు మహోత్పాతంబు లగుటయు వానివలన బాలుం డుత్తరించుటయుఁ జూచి యేకాంతంబున నొక్కనాఁడు విచారింప నుపనందుం డను వృద్ధగోపకుండు దనయెఱుక మెఱసి యి ట్లనియె. 423

ఉ. ఇక్కడ నుండు రే మనుజు ‡ లీమనకృష్ణున కెగ్గు సేయఁ గా
[2]రక్కసురాలు చన్నొసఁగె ‡ రాలపయిన్ సుడిగాలి వైచెఁ బైఁ
గ్రిక్కిఱియం దరుల్ వడియెఁ ‡ గేశవుసత్కృపఁ దప్పెఁ జాలు నేఁ
డెక్కడ కైనఁ బోవలయు ‡ నిం కిట గోపకులార వింటిరే. 424

క. కసవు గల దిరవు పసులకు, లసదద్రినదీమహీజ ‡ లతికావలిపెం
పెసఁగును గాఁపురమునకును, బొసఁగును బృందావనంబు ‡ పోదఁ డచ్చటికిన్.

వ. అని పలుకునుపనందునిపలుకుల కార్యు లైనగోపకు లిదియ కార్యంబుమందల యని కొందలమందక యాలమందల నమంద గమనంబున ముందర నడవం బనిచి పిఱుందం గ్రందుకొన కుండ బాలవృద్ధనారు లెక్కిన తేరులు సాగించి తారు తను త్రాణతూణబాణధరు లై విండ్లఁ బట్టుకొని నడవ బండ్లవెనుకం గొమ్ము లిమ్ములం బూరించుచు నవార్యంబు లగుతూర్యరవంబుల నాగ్యపురోహితసమేతు లై వేడుకలు కొనలు నిగుడ మొన లేర్పఱచుకొని పావనం బగుబృందావనంబునకుం జని రప్పుడు. 426

తరలము. పసుపులాడి యురోజకుంకుమ ‡ పంకశోభిత లై లస
ద్వసన లై కచభారచంపక ‡ దామ లై సులలామ లై
పసిఁడిమాడలకాంతు లుబ్బులఁ ‡ బర్వఁ దేరులమీఁదఁ బెం
పెసఁగఁ బాడిరి వ్రేత లాహరి ‡ హేల లిం పగునేలలన్. 427

వ. అప్పుడు రోహిణీయశోద లేకరథంబునఁ బరిపూర్ణమనోరథ లై రామకృష్ణుల ముందట నిడుకొని వారలవినోదంబులకుఁ బ్రమోదంబు నొందుచుం జని రిట్లు గోపకులు బృందావనంబు సొచ్చి యం దర్ధచంద్రాకారంబుగ శకటసందోహంబు నిలిపి మందల విడియించి వసియించిరి. 428

క. చెందిరి బలమాధవు లభినందించుచుఁ బరమపావ ‡ న ముదంచితకా
ళిందీసంజీవనమున్, బృందావనమున్ మునీంద్ర ‡ బృందావనమున్. 489

వ. ఇట్లు బృందావనంబుఁ జెంది యందుఁ గొంతకాలంబునకు రామకృష్ణులు సమాన

1. భిగియించి, 2. రక్కసరాలు,

వయస్కులైన గోపబాలకులం గూడికొని వేడుక లాడుకొన దూడలఁ
గాచుచు ననేకక్రీడలకుం జొచ్చి. 430

సీ. వేణువు లూఁదుచు వివిధరూపములతో, గంతులు వైతురు కౌతుకమున
గురుకంబళాదుల గోవృషంబులఁ బన్ని, పరవృషభము లని ప్రతిఘటింతు
రల్లులు దట్టించి యంఘ్రులగజ్జెలు, మొరయఁ దన్నుదు రోలి ముమ్మరముగఁ
బన్నిదంబులు వైచి ఫలమంజరులు గూల్చి, ప్రేటులాడుదురు ప్రావీణ్య మొప్ప
తే. వన్యజంతుచయంబుల వానివాని, పదురు వదరుచు వంచించి పట్టఁ బోదు
రంబుజాకరములఁ జల్లులాడఁ జనుదు, రాకుమారులు బాల్యవిహారు లగుచు.

క. పోరుదురు గికురు వొడుచుచుఁ, దూఱుదురు భయంబు లేక తోరపుటిరవుల్
జాఱుదురు ఘనశిలాతటి, మీఱుదు రెన్నంగ రాని మెలఁకువల నృపా. 432

వ. అంత నొక్కనాఁడు యమునాతీరంబున నాకుమారులు గోపకుమారులుం దారుఁ
గ్రేపుల మేప నొక్కరక్కసుండు క్రేపురూపున వచ్చి వారల హింసింపందలంచి.

వత్సాసురబకాసురులవధము

క. క్రేపులయఱ్ఱులు నాకుచుఁ, గ్రేపులలో నిదియె మంచి క్రే పనఁగఁ గడుం
జూపట్టి భక్తసంగతిఁ, గ్రేపై చనువానిమ్రోలఁ గ్రేపై తిరిగెన్. 434

వ. వాని నెఱింగి కృష్ణుండు రామునకుం జెప్పి. 435

చ. ఇది యొకమంచిలేఁగ వినుఁ డెంతయు నొప్పెడి నంచు దాని త
త్పదములుఁ దోఁకయుం బిగియఁ బట్టి చెలంగి వెలంగమ్రానితోఁ
జదియఁగ నొక్కపెట్టు గొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం
గుదులుకొనంగ బాలకులు గో యని యార్వ నఖర్వలీలతోన్. 436

వ. ఇట్లు రక్కసుండు ప్రేటువడి విశాలం బగుసాలంబుతో నేలం గూలె నప్పుడు.

క. గొంగడు లెగురఁగ వైచుచుఁ, జంగున దాఁటుచును జెలఁగి చప్పట లిడుచుం
బొంగుచుఁ గృష్ణునిఁ బొగడుచుఁ, ద్రుంగినరక్కసునిఁ జూచి తుళ్ళిరి కొమరుల్.

వ. ఆ సమయంబున వేలుపులు విరులవానలు గురియించి రిట్లు. 439

క. వత్సములపగిది జగముల, వత్సలతం బనుపఁ జూచు వాఁడై యుంటన్
వత్సముల మేపు చుండియు, వత్సాసురుఁ జంపె భక్తవత్సలుఁ డధిపా. 440

వ. మఱియు నొక్కనాఁడు రేపకడ గోపకుమారులు క్రేపులం గొంచు నడవికిం
జని యెండం బడి మెండుకొనినదప్పిని బెండువడినతమతమ లేఁగకదుపుల నేర్ప
రించి (నిలువరించుకొని) కలంకంబు లేనియొక్కకొలంకున నీరు ద్రావించి
తారును జలపానంబు సేసి వచ్చునెడ నందు. 441

క. అకలంకులు బాలురు గని, రకుటిలదంభోళిహతసితాద్రిశిఖరరూ
పకమున్ హరిహింసారంభకమున్ బకమున్ విశాల భయదాంబకమున్.

వ. కని దానియొడలిపొడవునకు వెఱఁగుపడి చూచు చుండ. 443

ఆ. ఎల్ల పనులు మాని ♦ యేకాగ్రచిత్తుఁ డై, మౌనివృత్తి నితర ♦ మమత విడిచి
వనములోన నిలిచి ♦ వనజాక్షుపై దృష్టిఁ, జేర్చి బకుఁడు దపసి ♦ చెలువుఁ దాల్చె.

వ. ఇవ్విధంబున నొదుఁగు వెట్టుకొనియుండి. 445

ఉ. చంచువు దీటి పక్షములు ♦ జల్లున విచ్చి పదంబు లెత్తి కు
ప్పించి నభంబుపై కెగసి ♦ భీషణఘోషణవక్త్రుఁ డై విజృం
భించి గరుత్సమీరమున ♦ భిన్నము లై తరు లొలిఁ గూలఁగా
మించి బకాసురుం డొడిసి ♦ మ్రింగె సహిష్ణునిఁ జిన్ని కృష్ణునిన్. 446

క. సంగడి లోకము లన్నియు, మ్రింగుచుఁ గ్రక్కుచును బయల ♦ మెలఁగించుచు ను
ప్పొంగెడు వేడుక కాఁడటు, మ్రింగుడు వడె బకునిచేత ♦ మీఁద దెఱిఁగి నృపా.

క. దనుజుఁడు మ్రింగినఁ గృష్ణునిఁ, గనలేక బలాదిబాల ♦ క ప్రముఖులు చే
తను లై వెఱఁ గందిరి చ,య్యనఁ బ్రాణము లేనియింద్రి ♦ యంబులభంగిన్. 448

వ. ఇట్లు మ్రింగుడు వడి లోనికిం జనక. 449

శా. కంఠోపాంతము దొడలన్ మెఱుముచుం ♦ గాలాగ్ని చందంబునం
గుంఠీభూతుఁడు గాక వేండ్ర మగునా ♦ గోపాలబాలున్ జయో
త్కంఠున్ బ్రహ్మగురున్ మహామహిముఁ జ ♦ క్కన్ మ్రింగ రాదంచు [1]సొ
ల్లుంఠం బాడుచు వాఁడు గ్రక్క వెడలన్ ♦ లోకం బశోకంబు గన్. 450

క. క్రక్కి మహాఘోషముతోఁ, జక్కనఁ దనుఁబొడువరాఁగఁ ♦ జంచులు రెండున్
స్రుక్కఁగఁబట్టి తృణము క్రియ, గ్రక్కునవారిసీరెబకునిఁ ♦ గలహోత్సుకునిన్.

వ. అప్పు డానందనందనునిమీఁద వేలుపులు సాలుపులుగా నందనమల్లికాది కుసుమవర్షంబులు హర్షంబునం గురియించిరి దేవవాద్యంబులు మొరసె రామాది గోపకుమారులు ప్రాణంబులతోఁ గూడినయింద్రియంబులుంబోలె గ్రమ్మఱఁ గృష్ణునిం గని రమ్మని కౌఁగిలించుకొని కృష్ణసహితు లయి లేఁగదాఁటుల మరల దాఁటించుకొని మందగమనంబున మంద కరిగిరి వారలచేత నావృత్తాంతం బంతయు విని వెఱఁగుపడి గోపగోపికాజనంబులు. 452

క. ఆపదలమీఁద నాపద, లీపాపనిఁ జెంది తొలఁగె ♦ నీయర్భకునిం
బైపడినఖలులు దహనునిఁ, బైపడుశలభములపగిదిఁ ♦ బడిరి ధరిత్రిన్. 453

వ. అని పలికిరి మఱియు నారామకృష్ణులు క్రేపులం గాచుతఱి. 454

సీ. కపుల మై జలరాశిఁ ♦ గట్టుదమా యని, కట్టుదు రడ్డంబు ♦ గాలువలకు
మునులు మై తపములు ♦ మొనయుదమా యని, మౌనులై యుండుదురు ♦ మాటలేక
గంధర్వవరుల మై ♦ గానవిద్యలు మీఱఁ, బాడుదమా యని ♦ పాడఁ జొత్తు
రప్సరోజనుల మై ♦ యాడుదమా యని, యాఁడురూపులఁ దాల్చి ♦ యాడఁ జనుదు

ఆ. రమరదైత్యవరుల ♦ మై యబ్ధిఁ ద్రత్తమా, యని సరోవరముల ♦ యందు హస్త

1. 'సోల్లుంఠం' అనియే వ్రా. ప్ర.

దండచయముఁ ద్రిప్పితగుతురు తమయీడు,కొమరు లనుచరింపఁగ గోమరుమిగిలి.

శ్రీకృష్ణుఁడు గోపకులతో బంతిచల్దులు గుడువ వనమున కేఁగుట.

వ. అంత నొక్కనాఁడు రామకృష్ణులు గాంతారంబున బంతిచలుదులు గుడువ నుద్యోగించి ప్రొద్దున లేచి గ్రద్దనం దమయింటిలేఁగకదుపులఁ గదలించి సురంగంబు లగుశృంగంబులు పూరించిన విని మేలుకని సంరంభంబున గోపడింభకులు చలిది కావడులు మూఁపుల వహించి సజ్జంబు లగుకజ్జంబులు గట్టికొని పదత్రాణవేత్రదండధరు లై లెక్కలకు వెక్కసం బైనతమతమక్రేపుకదుపులం జప్పుడించి రొప్పుకొనుచుఁ గాననంబు సొచ్చి కాంచనమణిపుంజగుంజాదిభూషణభూషితు లయ్యును ఫలకుసుమకోరకపల్లవవల్లరులు దొడవులుగా సడికొని కొమ్ము లిమ్ముగ మ్రోయించుచు వేణువులు పూరించుచుఁ దుమ్మెదలం గూడి పాడుచు మయూరంబులతోడం గూడి యాడుచుఁ బికంబులం గలసి కూయుచు శుకంబులఁ జేరి రొదలుసేయుచుఁ బులుఁగులనీడం బాఱుచుఁ బొదరిండ్లం దూఱుచు సరాళంబు లగువాఁగులు గడచుచు మరాళంబులచెంత నడచుచు బకమ్ములం గని నిలుచుచు [1]సారసంబులం జోపి యలంచుచు నదీజలంబులం దోఁగుచుఁ దీవయుయ్యేలల నూఁగుచుఁ బల్లంబులన్ డాఁగుచు దూరంబుల కేఁగుచుఁ గపులసంగడిఁ దరువు లెక్కుచు ఫలంబుల మెక్కుచు రసంబులకుఁ జొక్కుచు నింగికి నిక్కుచు నీడలు సూచి నవ్వుచుఁ గయ్యంబులకుం గాలు ద్రవ్వుచుఁ జెలంగుచు మెలంగుచు వ్రాలుచు సోలుచు బహుప్రకారంబుల శరీరవికారంబులు సేయుచు మఱియును. 456

క. ఒకనొకని చల్దికావడి, నొకఁడొకఁ డడకించి దాఁచు నొకఁడొకఁ డది వే
ఱొకనొకని మొఱఁగికొని చన, నొకఁడొకఁ డది దెచ్చి యిచ్చు నుర్వీనాథా.

క. ఒక్కఁడు ము న్నేమఱి చన, నొక్కఁడు బలుబొబ్బ వెట్టు నులికిపడన్ వే
ఱొక్కఁడు మిట్టితటాలున, నొక్కనికనుదోయి మూయు నొక్కఁడు నగఁగన్.

క. తీపు గలకజ్జ మన్యుఁడు, గోపింపఁగ నోడిసి పుచ్చు కొని పో వాఁడుం
బైపడి యడుగఁగ నొక్కఁడు, క్రేపులలో నిట్టు నట్టుఁ గికురించు నృపా. 459

క. వనజాక్షుఁడు ము న్నరిగిన, మునుపడ నే నేనె యతని ముట్టెద ననుచుం
జని మును ముట్టనివానిన్, మును ముట్టినవాఁడు నవ్వు మొనసి నరేంద్రా. 460

వ. ఇవ్విధంబున. 461

ఉ. ఎన్నఁడు నైన యోగివిభు లెవ్వనిపాదపరాగ మింతయుం
గన్నులఁ గాన రట్టిహరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్టఁ బట్టుచుం
దన్నుచు గ్రుద్దుచున్ నగుచుఁ దద్దయుఁ బైపడి కూడి యాడుచున్
మన్నన సేయు వల్లవకుమారులభాగ్యము లింత యొప్పునే. 462

---

1. గాసారంబులం జొచ్చి కలంచుచు.

క. విందులకును బ్రహ్మసుఖా,నందం బై భక్తగణము నకు దైవత మై
మందులకు బాలుఁ డగుహరి,పొందుఁ గనిరి గొల్ల లిట్టి పుణ్యులు గలరే. 463

వ. అని పలికి (శుకయోగీంద్రుండు మఱియు ని ట్లనియె.) 464

క. అమరు లమృతపానంబున, నమరినవా రయ్యు నేని శాటునిపంచ
త్వముసకు నెదుళ్లుసూతురు, తము నమ్మక యట్టియఘుఁడు దర్పోద్ధతుఁడై. 465

క. బకునికిఁ దమ్ముఁడు గావున, బకమరణము దెలిసి కంసు పంపున గోపా
లకబాలురతోఁ గూడను, బకవైరిని ద్రుంతు ననుచుఁ బటురోషమునన్. 466

క. బాలురప్రాణంబులు గో,పాలురకు మదగ్రజాతు ప్రాణము మా ఱీ
బాలురఁ జంపిన నంతియ, చాలును గోపాలు రెల్ల సమసినవారల్. 467

వ. అని నిశ్చయించి యోజనంబునిడుపును మహాపర్వతంబుపొడవును గొండతుదల మీఱినకోఱలును మిన్ను దన్ని పన్నిననల్లమొగిళ్లపెల్లు గలపెదవులును బిలంబులకు నగ్గలం బైనయిగుళ్లసందులును నంధకారబంధురం బైనవదనాంతరాళంబును దావానలజ్వాలాభీలం బైనదృష్టిజాలంబును వేఁడిమికి నివాసంబు లైన (యుచ్ఛ్వాస)నిశ్వాసంబులును మెఱయ నేల నాలుకలు వఱుచుకొని ఘోరం బగునజగరాకారంబున. 468

క. జాపిరము లేక యిప్పుడు, గ్రేపుల గోపాలసుతులఁ గృష్ణుని [1]తోడన్
గీపెట్టఁగ మ్రింగెద నని, పాపపురక్కసుఁడు త్రోవఁ బడి యుండె నృపా. 469

వ. ఆ సమయంబున. 470

మ. ఒకవన్యాజగరేంద్ర మల్లదె గిరీంద్రోత్సేధ మై దావపా
వకకీలాపరుషప్రచండతరనిశ్వాసంబుతో ఘోర వ
హ్నికరాళాతతజిహ్వతోడ మనలన్ హింసింప నీక్షించుచున్
వికటం బై పడి చాఁగి యున్నది పురోవీథిం గనుంగొంటిరే. 471

వ. అని యొండొరులకుం జూపుచు. 472

మ. బకునిం జంపినకృష్ణుఁ డుండ మనకుం బా మంచుఁ [2]జింతింప నే
టికి రా పోదము దాఁటి కాక యది కౌటిల్యంబుతో మ్రింగుడున్
బకువెంటం జనుఁ గృష్ణుచేత ననుచుం బద్మాక్షు నీక్షించి యు
త్సుకు లై చేతులు వ్రేసికొంచు నగుచున్ దుర్వారు లై పోవఁగన్. 473

వ. వారలం జూచి హరి దనమనంబున. 474

ఉ. అర్భకు లెల్లఁ బాము దివిజాంతకుఁ డౌట యెఱుంగ రక్కటా
నిర్భయు లై యెదుర్కొనిరి నేఁ గల నంచు విమూఢు లంచు నా
విర్భవదాగ్రహాత్మమున వెన్దగులం దమలేఁగపిండుతో
దుర్భరఘోరసర్పఘనతుండబిలాంతముఁ జొచ్చి రందఱున్. 475

---

1, తొడరం, 2, శంకింప.

వ. అయ్యవసరంబున. 476

శా. వేల్పుల్ సూచి భయంబు నొంద గ్రసనా § వేశంబుతో నుజ్జ్వల
త్కల్పాంతోజ్జ్వలమానజిహ్వాదహనా § కారంబుతో మ్రింగె న
స్వల్పాహీంద్రము మాధవార్పితమనో § వ్యాపారసంచారుల
నల్పాకారుల శిక్యభారులఁ గుమా § రాభీరులన్ ధీరులన్. 477

వ. ఇట్లు పెనుఁబాముచేత మ్రింగుడువడుసంగడికాండ్రగమిం జూచి కృష్ణుండు. 478

ఉ. పసులు లేఁగలుం గలసి § పైకొని వత్తురు తొల్లి కృష్ణ మా
కొడుకు లదేల రా రనుచు § గోపిక లెల్లను బల్క నేక్రియన్
నోడివెద నేఁడు పన్నగము § నోరికి వీరికి నొక్కలంకెగా
నోడఁబడ నేల చేసె విధి § యోడక సేయుఁ గదయ్య క్రౌర్యముల్. 479

వ. అని తలపోసి నిఖిలలోచనుండును నిజాశ్రితనిగ్రహమోచనుండును నైనతమ్మికంటిమింటితెరువరులు మొఱలిడరక్కసు లుక్కు మిగుల వెక్కసం బగునజగరం (బయి యున్నయన్నరభోజను) కుత్తుకకుఁ [1]బొత్తుగొని మొత్తంబు వెంటనంటం జని తమ్మునందఱిఁ జిందఱవందఱసేసి మ్రింగనగ్గలించునజగరంబుకంఠద్వారంబున సమీరంబు వెడలకుండఁ దనశరీరంబు వెంచి గ్రద్దన మిద్దె సఱిచిన ట్లుండ. 480

క. ఊపిరి వెడలక కడుపున, వా పొదవినఁ బాముప్రాణ § వాతంబులు సం
తాపించి శిరము వ్రక్కలు, వాపికొనుచు వెడలి చనియెఁ § బటుఘోషముతోన్.

శా. క్రూరవ్యాళవిశాలకుక్షిగతులన్ § గోవత్ససంఘంబుతోఁ
గారుణ్యామృత[2]వృష్టిచేత బ్రదుకం § గాఁ జూచి వత్సంబులన్
వారుం దాను దదాస్యవీధి మగుడన్ § వచ్చెన్ ఘనోన్ముక్తుఁడై
తారానీకముతోడ నొప్పెసఁగునా § తారేశుచందంబునన్. 482

ఆ. అమరవరులకొఱకుఁ § గమలజాండం బెల్ల, బలిఁ దిరస్కరించి § బలియువడుగు
గోపసుతులకొఱకుఁ § బాపపుఁబెనుఁబాము, గళము దూఁటుగట్ట § బలియకున్నె.

ఉ. ఆ పెనుఁబాముమేన నొక § యద్భుతమైనవెలుంగు దిక్తటో
ద్దీపకమై వడిన్ వెడలి § దేవపథంబునఁ దేజరిల్లుచుం
గ్రేపులు బాలురున్ బెదరఁ § గృష్ణునిదేహము వచ్చి చొచ్చె నా
పాపఁడు సొచ్చి ప్రాణములఁ § బాసినయంతన శుద్ధసత్త్వమై. 484

క. తనరూపాకమూటయినను, మనమున నిడికొనినఁ బాప § మయుఁ దనగతికిన్
గొని చను హరి దనుఁ మ్రింగినఁ దనుజునిఁ గొనిపోవకున్నె § తనలోపలికిన్. 485

వ. తదవసరంబున సురలు గుసుమవర్షంబులు గురియించిరి మునులు హర్షించిరి రంభాదు లాడిరి గంధర్వులు పాడిరి మేఘంబులు మృదంగంబులభంగి ఘోషించె సిద్ధగణంబులు జయజయభాషణంబుల భాషించె నంత. 486

---

1. బొత్తుగాని. 2. దృష్టిచేత.

శా. ఆ వాద్యంబులు నా మహాజయరవం బా పాట లా యాటలుం
దేవజ్యేష్ఠుఁడు పద్మజుండు విని ప్రీతిన్ భూమి కేతెంచి నేఁ
డీ వత్సార్భకులన్ భుజంగము వడిన్ హింసింప నీబాలకుం
డే వెంటన్ బ్రదికించె మే లనుచు నూహించెం గడున్ నివ్వెఱన్. 487

వ. అంత నయ్యజగరచర్మంబు గొన్నిదినంబుల కెండి పెద్దగాలంబు గోపాలబాలురకుం గేళీబిలం బై యుండె నిట్లు కౌమారవిహారంబున నైదవయేఁటఁ గృష్ణుం డఘాసురునిం దెగఁజూచుటయుఁ దమ్ముం గాచుటయు నాఱవయేఁటి (దైన పౌగండ) వృత్తాంతం బని చిత్తంబుల గోపకుమారులు దలంచుచుండు రని చెప్పిన నప్పుడమిఱేఁ డప్పరమయోగీంద్రున కిట్లనియె. 488

సీ. అయిదేండ్లు కౌమార మటమీఁద నైదేండ్లు, పౌగండమనియెడు ప్రాయమందు
నయిదేండ్లవాఁ డైన యబ్జాక్షుచరితంబు, పౌగండ మని గోప బాలు రెల్లఁ
దలఁతు రంటివి యెట్లు దలఁతురు వారలు, నిరుడు సేసినపని నేఁటి దనుక
వచ్చునే యిది నాకు వరుసతో నెఱిఁగింపు, [1]మనవుఁడు యతిచంద్రుఁ డైనశుకుఁడు

ఆ. యోగదృష్టిఁ జూచి యొక్కింత భావించి, వినుము రాజవర్య వినయధుర్య
పరమగుహ్య మనుచుఁ బలుకుదు రార్యులు, శిష్యజనుల కీవు సేయుతలఁపు.

క. ప్రియురాలివలనివార్తలు, ప్రియజనులకు నెల్లప్రొద్దుఁ బ్రియ మగుభంగిం
బ్రియుఁ డగుహరిచరితంబులు, ప్రియభక్తుల కెల్లయెడలఁ బ్రియములు గావే.

వ. అని పలికి యోగీంద్రుండు రాజేంద్రున కిట్లనియె నట్లఘాసురుముఖంబువలనం గడచనినలేఁగకాపరులన్ బ్రదకించి వారును దానునుం జని చని. 491

మ. కనియెం గృష్ణుఁడు సాధునీరము మహాగంభీరముం బద్మకో
కనదాస్వాదవినోదమోదమదభృంగద్వంద్వఝంకారముక్
ఘనకల్లోలలతావితానవిహరత్కాదంబకోలాహల
స్వనవిస్ఫారము మందవాయుజకణాసారంబుఁ గాసారమున్. 492

గోపాలబాలురు కృష్ణునితోఁ గూడి చల్దు లారగించుట.

వ. కని తమ్మికంటి తమ్ములయింటిసొబగునకు నిచ్చ మెచ్చుచుఁ జెచ్చెర గాలి నోలిం గదలెడుకరళ్లతుంపురులజల్లు పెల్లున నొడళ్లు గగురుపొడువఁ గోలంకుఁగెలంకులఁ గాయపండులగెలలవ్రేఁగున వీఁగి పట్టుగలచెట్టుఁదుటుముసీడల నొప్పుచున్న యిసుకతిప్పలవిప్పు సూచి వేడుక పిచ్చలింప నెచ్చెలుల కిట్లనియె. 493

శా. ఎండన్ మ్రగ్గితి రాఁకటం బడితి రింకేలా విలంబింపఁగా
రం డో బాలకులార చల్దిఁ గుడువన్ రమ్యస్థలం బిక్కడీ
దండన్ లేఁగలు నీరు ద్రావి యిరవం దం బచ్చికల్ మేయుచుం
దండం బై విహరించుచుండఁగ సమం దప్రీతి [2]భక్షింతమే. 494

1. మనుడు నతీంద్రియుఁ డైన. 2. 'భుంజింతమే' వ్రా. ప్ర.

వ. అనిన నగుఁగాక యని వత్సంబుల నుత్సాహంబున నిర్మలంబు లగుజలంబులు ద్రావించి పచ్చికల మొల్లంబులుగల పల్లంబుల నిలిపి చొక్కంబు లగుచల్దుల చిక్కంబుల నక్కడించి. 495

మ. జలజాంతస్స్థితకర్ణికం దిరిగి రా § సంఘంబు లై యున్నతే
కులచందంబునఁ గృష్ణునిం దిరిగి రాఁ § గూర్చుండి వీక్షించుచున్
శిలలుం బల్లవముల్ దృణంబులు లతల్ § చిక్కంబులుం బువ్వు లా
కులు కంచంబులు గా భుజించి రచటన్ § గోపార్భకుల్ భూవరా. 496

సీ. మాటిమాటికి వ్రేలు § మడిచి యూరించుచు
నూరుఁగాయలు దిను § చుండు నొక్కఁ
డొకనికంచములోని § దోడిసి చయ్యన మ్రింగి
చూడు లే దని నోరు § సూపు నొక్కఁ
డేగు రార్గురచల్దు § లెలమిఁ బన్నిద మాడి
కూర్కొని కూర్కొని § కుడుచు నొక్కఁ
[1]డిన్నియఁ దగఁ బంచి § యిడుట నెచ్చెలితన
మనుచు బంతెనగుండు § లాడు నొక్కఁడు

ఆ. కృష్ణుఁ జూడు మనుచుఁ § గికురించి పరువ్రాల
మేలిభక్ష్యరాశి § మెసఁగు నొక్కఁడు
నవ్వు నొక్కఁడు సఖుల § నవ్వించు నొక్కఁడు
ముచ్చటాడు నొక్కఁడు § మురియు నొక్కఁడు. 497

వ. అయ్యవసరంబున. 498

సీ. కడుపున దిండుగాఁ § గట్టినవలువలోఁ, లాలితవంశనా § ళంబుఁ జొనిపి
విమలశృంగంబును § వేత్రదండంబును, జాఱి రానీక డా § చంక నిఱికి
మీఁగడ పెరుఁగున § మేళవించినచల్ది, ముద్దడాపలిచేత § మొనయ నునిచి
చెలరేఁగి కొసరి తె § చ్చినయూరుఁగాయలు, వ్రేళ్లసందుల నెల్ల § వెలయ నిఱికి

ఆ. సంగడీలనడుమఁ § జక్కనఁ గూర్చుండి, నర్మభాషణముల § నగవు నెఱపి
యాగభోక్త కృష్ణుఁ § డమరులు వెఱఁగంద, శైశవంబు నెఱపి § చల్ది గుడిచె.

వ. ఇట్లు కృష్ణసహితు లయినగోపకుమారులు చల్దులు గుడుచునెడఁ గ్రేపులు మేపు అకుం జొచ్చి పచ్చనిగఱికి జొంపంబులగుంపుల కఱికి లంపులు మేయుచుఘోరం బగునరణ్యంబునడుమఁ దూరం బగుదూరంబు చనిన వానిం గానక వెఱచుచున్న గోపడింభకులకు నంభోజనయనుం డి ట్లనియె. 500

మ. వినుఁ డో బాలకులార క్రేపు లటవీ § వీథిన్ మహాదూరముం
జనియెం గోమల ఘాస ఖాదన రతో § త్సాహంబుతో నెందుఁ బో

1. డిన్నియు బొమ్మంచు లిడుట.

మెన్నో యేమయ్యెనో క్రూరజంతువులచే నేయాపదం బొందెనో
కని తెత్తుం గుడువుండు చల్దిఁ గొఱంతల్ గాకుండ మీరందఱున్. 501

వ. అని చెప్పి. 502

బ్రహ్మ గోవత్సములను గోపబాలకుల నంతర్ధానంబు సేయుట.

శా. కర్ణాలంబితకాకపక్షములతోఁ గ్రైవేయహారాళితో
స్వర్ణాభాసితవేత్రదండకముతోఁ సత్పింఛదామంబుతోఁ
బూర్ణోత్సాహముతో ధృతాన్నకబళోత్ఫుల్లాబ్జహస్తంబుతోఁ
దూర్ణత్వంబున నేఁగె లేఁగలకునై దూరాటవీవీథికిన్. 503

వ. ఇట్లేఁగుచు. 504

క. ఇచ్చోఁ బచ్చిక మేసిన, విచ్చోఁ ద్రావినవి తోయ మేఁగిన విచ్చో
నిచ్చోట మంద గొన్నవి, యిచ్చోఁ బాసినవి జాడ యిదె యదె యనుచున్. 505

క. కంజదళాక్షుఁడు వెదకెను, గొంజక లేఁగల నపారగురుతృణవనికా
పుంజంబుల భీకరమృగకుంజంబులఁ దరుల గిరులఁ గొలఁకుల నదులన్. 506

వ. అంత. 507

శా. బాలుం డై యితఁ డాయఘాసురుని ద్రుంపన్ బాలురం గ్రేపుల
న్నేలీలన్ బ్రదికించె నొక్కొ భువి నూహింపం గడుం జోద్య మం
చాలో నంబుజసంభవుండు సని మాయాబాలు శుంభద్బలం
బాలోకింపఁ దలంచి డాఁచె నొకచో నాలేఁగలన్ బాలురన్. 508

వ. ఆ సమయంబున దూడలు వోయినజాడ యెఱుంగక తప్పి యప్పద్మలోచనుం డెప్పటికొలంకుకడకు వచ్చి యచ్చోట నెచ్చెలులం గానక వారిం జీరి లేకుండుట నిశ్చయించి గోవిందుండు విశ్వవిదుండు గావున నిది విరించిమొఱం గని యెఱింగి తిరిగి పోవుచు. 509

శా. వంచింపం బని లేదు బ్రహ్మకిచటన్ వత్సంబులన్ బాలురన్
వంచించెన్ గనుఁ బ్రామి తన్ను మరలన్ వంచించు టాశ్చర్యమే
వంచింపన్ [1]మన కేల తెచ్చుటకునై వర్ధించు బ్రహ్మాండము
ల్వంచింపన్ మరలింప నేర్చుహరి లీలన్ మందహాసాస్యుఁ డై. 510

క. గోపాలసుతులు లే రని, గోపికలకుఁ జెప్ప నేల గోపాలకులన్
గోపికలు నలర బాలుర, క్రేపులరూపముల నేఁ జరించెద ననుచున్. 511

మ. కరముల్ పాదములున్ శిరంబు లవలగ్నంబుల్ ముఖంబుల్ భుజాం
తరముల్ ముక్కులుఁ గన్నులున్ శ్రవణముల్ దంతాదులున్ దండకాం
బరస్రగ్వేణువిషాణభూషణవయోభాషాగుణాఖ్యానత
త్పరతల్ వీడ్వడ కుండఁ దాల్చె విభుఁ డా వత్సార్భకాకారముల్. 512

1. జన దింకఁ [illegible] యగున్.

క. రూపంబు లెల్ల నగుచును, రూపకుఁ డిటు బాలవత్స § రూపంబులతో
నే పారు టేమి చోద్యము, రూపింపఁగ నతని కితర § రూపము గలదే. 513

క. మరలుపు మనియెడు కర్తయు, మరలించుకుమూఁకలును § మరలెడిక్రేపుల్
పరికింపఁ దాన యై హరి, మరలం జనె లీలతోడ § మందకు నధిపా. 514

వ. ఇట్లు బాలవత్సరూపంబుల విహరించుచు మందకు వచ్చి వారివారిదొడ్ల నయ్యై వత్సంబుల నుందఱికందువల నిలిపి తత్తద్బాలరూపంబుల నందఱిగృహంబులం బ్రవేశించి వేణునాదంబులు సేసిన. 515

చ. కొడుకుల వేణునాదములు § గొబ్బున వీనులకుం బ్రియంబు లై
ముడివడ లేచి యెత్తికొని § మూర్కొని తల్లులు కౌఁగిలించుచుం
జడిగొనఁ జేఁపు వచ్చి తమ § చన్నులయందు సుధాసమంబు లై
వెడలెడిపాలు నిండుకొను § వేడుక నిచ్చిరి తత్సుతాళికిన్. 516

వ. మఱియుఁ దల్లులుల్లంబులఁ బెల్లుగ వెల్లిగొనినవేడుకలం దమనందనులకు నలుంగు లిడి మజ్జనంబులు గావించి గంధంబు లలంది తొడవులు దొడిగి నిటలఫలకంబుల రక్షాతిలకంబులు వెట్టి సకలపదార్థసంపన్నంబు లయినయన్నంబు లొసంగి సన్నములు గానిమన్ననలు సేసిరి 517

క. ఏతల్లుల కేబాలకు, లేతెఱఁగునఁ దిరిగి ప్రీతి § నెసఁగింతురు ము
న్నాతల్లుల కాబాలకు, లాతెఱఁగునఁ బ్రీతిఁ జేసి § రవనీనాథా. 518

వ. ఆ సమయంబున. 519

ఉ. పాయనివేడ్కతో నునికి § పట్టులకుం జని గోవు లెల్ల నం
భా యని చీరి హుమ్మనుచుఁ § బైకొని మూర్కొని పంచితిల్లి పె
ల్లైయతిరేకమైపొదుఁగు § లం దెడ లేక స్రవించు చున్నపా
లాయెడ నాకుచున్ సుముఖ § లై యొసఁగెన్ నిజవత్సకోటికిన్. 520

క. వ్రేతలకును గోవులకును, మాతృత్వము సాలఁ గలిగె § మఱి మాధవుపై
మాత లని హరియు నిర్మల,కౌతూహల మొప్పఁ దిరిగెఁ § గడుబాల్యమునన్.

ఆ. ఘోషజనుల కెల్లఁ § గుఱ్ఱలపై వేడ్క, ప్రూఁటప్రూఁట కెలమిఁ § బొటకరించె
నిచ్చ క్రొత్త యగుచు § నీరజాక్షునిమీఁద, వేడ్కదమకుఁ దొల్లి § వెలసినట్లు.

వ. ఇట్లు కృష్ణుండు బాలవత్సరూపంబులు దాల్చి తన్నుఁ దాన రక్షించుకొనుచు మందను వనంబున నమందమహిమంబున నొక్క యేఁడు క్రీడించె నాయేఁటికి నైదాఱుదివసంబులు కడమపడి యుండ నం దొక్కనాఁడు బలభద్రుండును దానును వనంబునకుం జని మందచేరువ లేఁగల మేప నతిదూరంబునం గోవర్ధనశైలశిఖరంబున ఘాసంబులు గ్రాసంబులు గొను చున్నగోవు లాలేఁగలం గని. 523

చ. ముదమున హుంకరించుచును § మూఁపులపై మెడ లెత్తి [1]చాఁచుచుం

---

1. వ్రేచుచుం ; వచ్చుచుం.

బదములు నాల్గు రెండయిన | బాగునఁ గూడఁగఁ బెట్టి దాఁటుచుం
వదనములం విశాలతర | వాలములం వడి నెత్తి పాఱి యా
మొదవులు సన్నులం గుడిపె | మూఁతుల మ్రింగెడిభంగి నాకుచున్. 524

వ. అంత నాగోపకులు గోవుల వారింప నలవి గాక దిగ్గన నలుకతోడిసిగ్గు లగ్గలంబుగ దుర్గమమార్గంబున వానివెంట నంటి వచ్చి లేఁగల మేపు చున్నకొడుకులం గని. 525

ఉ. అయ్యలఁ గంటి మంచుఁ బుల | కాంకురముల్ వెలయంగఁ గుఱ్ఱలం
జయ్యన డాసి యెత్తుకొని | సంతస మందుచుఁ గౌఁగిలించి తా
రయ్యెడ నౌదలల్ మనము | లారఁగ మూర్కొని ముద్దుసేయుచుం
దయ్య మెఱుంగు గోపకులు | దద్దయు నుబ్బిరి నిబ్బరంబునన్. 526

వ. ఇట్లు బాలకాలింగనంబుల నానందబాష్పపూరితనయను లై గోపకులు గోవుల వెలుచుకొని తలంగి చన వారలం జూచి బలభద్రుండు దనలో నిట్లని తలంచె.

సీ. చన్ను మానినయట్టి | శాబకశ్రేణిపై, గోగణంబులకును | గోపకులకు
నిబ్బంగి వాత్సల్య | మెబ్బంగి నుదయించె, హరిఁ దొల్లి మన్నించు | నట్లు వీరు
మన్నించుచున్నారు | మమతఁ జేయుచుఁ బ్రీతి, నంబుజాక్షునిఁ గన్న | యట్లనాకుఁ
బ్రేమ మయ్యెడిడింభ | సబృందంబుఁ గనుఁగొన్న,నిది మహాద్భుత మొందు | నెఱుఁగ [రాదు

తే. మనుజదైవతదానవ | మాయ యొక్కొ
కాక నాభ ర్త యగు చున్న | కమలనయను
మాయయో కాక యితరుల | మాయ నన్నుఁ
గలఁప నోపదు విభుమాయ | గాఁగ నోపు. 528

క. అని మున్ను ముగ్ధుఁ డయ్యును, దనయంచులదివ్యదృష్టిఁ | దప్పక బుద్ధిం
దనచెలికాండ్రను క్రేపుల, వనజాక్షుం డనుచుఁ జూచె | వసుధాధీశా. 529

వ. ఇట్లు విజ్ఞానదృష్టిం జూచి యెఱింగియు నమ్మక (బలదేవుండు గొందలంపడుచుఁ) గృష్ణుం జూచి మహాత్మా తొల్లి యెల్లక్రేపులును ఋషులయంశం బనియును గోపబాలకులు వేల్పులయంశంబు లనియును దోఁచు (చుండు) నిపుడు వత్సబాలకసందోహంబు సందేహంబు లేక నీవ యని తోఁచు చున్న దిది యేమి యని యడిగిన నన్నకు నున్నరూపు వెన్నుండు మన్ననసేసి క్రన్నన యెఱిగించె నతండు నెఱింగె నివ్విధంబున హరి బాలవత్సంబులు దాన యై సంచరించినయేఁడు విరించికిఁ దనమానంబున నొక్కత్రుటిమాత్రం బయిన విరించి చనుదెంచి వత్సబాలకుం డైనకృష్ణబాలకుం జూచి వెఱంగుపడి యిట్లని వితర్కించె. 530

శా. మందం గల్గుసవత్సబాలకులు నా | మాయాగుహాసుప్తు లై
యెందుం బోవ[illegible]లేవ రిప్పుడును వే | ఱే చేయ నా కన్యు లెం

డెందుర్ లేరు విధాత నేఁ బరులు వీ ♦ రెవ్వార లెట్లైరొకో
యెం దేతెంచిరొ కృష్ణుతో మెలఁగువా ♦ రేఁ డయ్యెఁడిన్ నేఁటికిన్. 531

మత్తకోకిలము. బ్రహ్మపంపునఁ గాని పుట్టదు ♦ ప్రాణిసంతతి యెప్పుడున్
బ్రహ్మ నొక్కఁడఁ గాని వే ఱొక ♦ బ్రహ్మ లేఁడు సృజింపఁగా
బ్రహ్మ నేను సృజింప నొండొక ♦ బాలవత్సకదంబ మే
బ్రహ్మమందు జనించె [1]నొక్కట ♦ బ్రహ్మ మా నది చూడఁగాన్. 532

వ. అని యిట్లు సకలంబును సుకరంబుగ నెఱ వెఱింగెడి నెఱవాదిముదుక యెఱుక గలపోఁడ వెఱంగుపడి గ్రద్దనఁ బెద్దప్రొద్దు దద్దయుం దలపోసి కర్జంబుమందల యెఱుంగక కొండలంపముచు నాందోళనంబున 533

క. మోహము లేక జగంబుల, మోహింపఁగఁ జేయ నేర్చి ♦ మొనసినవిష్ణున్
మోహింపించెద ననియెడు, మోహమున విధాత దాన ♦ మోహితుఁ డయ్యెన్.

తే. పగలు ఖద్యోతరుచి చెడు♦పగిది రాత్రి, మంచు చీఁకటి లీనమై♦మాయమాడ్కి
విష్ణుపై నన్యమాయలు ♦ విశద మగునె, చెడి నిజేశులగరిమంబుఁ♦జెఱుచుఁగాక.

వ. మఱియును. 536

క. పుట్టితి బుద్ధి యెఱింగితిఁ బుట్టించితి జగము సగము ♦ వోయెం బ్రాయం
బిట్టివి నూతనసృష్టులు, పుట్టుట లే దార యిట్టి ♦ బూమెలు భూమిన్. 537

వ. అని యిట్లు దలవాకిట వాణి గలపోఁడిమి వాఁడిమి కెక్కిన నలుమొగంబులత క్కరిగొంటుపెనుదంట పలువెంట లయినమనంబున వితర్కించి విచారించు నెడ నతండు గనుంగొను చుండ నబ్బాలకులు మేఘశ్యాములును హారకుండల కేయూరకిరీటవనమాలికాభిరాములును శ్రీవత్స మంగళాంగద నూపుర కనక కటక కంకణ కటిఘటిత కాంచీగుణోద్దాములును నాపాదమస్తకతులసీదళదాము లును విలసదంగుళీయకస్తోములును శంకచక్రగదాకమలహస్తులును జతుర్భుజ ప్రశస్తులును బీతకౌశేయవాసులును జంద్రికాధవళహాసులును గరుణాకటాక్ష వీక్షణవిలాసులును రవికోటిభాసులును ననంతసచ్చిదానందరూపమహితులును (నణిమాదిగుణోపేతులును) విజాతీయసంభేదరహితులును (శ్రీమన్నారాయణ ప్రతిమానవిగ్రహస్వరూపులును) నయి తమకుఁ బరతంత్రు లగుచు నృత్తగీతాది సేవావిశేషంబులకుం జొచ్చి మెలంగుచు మూర్తిమంతంబు లయిన బ్రహ్మాది చరాచరంబులు నణిమాదిసిద్ధులును మాయాప్రముఖంబు లైనశక్తులును మహ దాదిచతుర్వింశతితత్త్వంబులును గుణక్షోభకాలపరిణామహేతుసంస్కారకామ కర్మగుణంబులును సేవింప వేదాంతవిమల కైన నెఱుంగ రాని తెఱంగున మెఱ యుచుఁ గానంబడిన వారలం గనుంగొని. 538

1. నొకడు బ్రహ్మ మైనది చూడఁగాన్.

ఉ. బాలురఁ గంటి నామదికిఁ । బాసినవారిని మున్ను వారి నేఁ
బోలఁగఁ జూచునంతటన । భూరిసిరగ్ళదుర్గమప్రభా
జాలముతోడఁ జూపులకుఁ । జాలమిఁ దెప్పుచు నున్నవార లే
మూలమొ మార్గ మెయ్యదియొ । మోసము వచ్చెఁ గదే విధాతకున్. 539

వ. అని సకలేంద్రియంబులకు వెక్కసం బయిన స్రుక్కి. 540

ఉ. ఏ పరమేశు తేజమున । నీ సచరాచర మైనలోకము
దీపిత మయ్యె నట్టివిభు । తేజముఁ గన్నులఁ జక్కఁ జూడఁగా
నోపక పారవశ్యమును । నొందుచు సంస్తిమితాఖిలేంద్రియుం
డై పరమేష్ఠి మైమఱచె । నప్పుడు చిత్రపురూపుకైవడిన్. 541

వ. ఇట్లు మాయాతీతుండును వేదాంతవిజ్ఞానదుర్లభుండును స్వప్రకాశానందుండును నైనతనబాహుళ్యంబుఁ జూపి నివ్వెఱపడినబ్రహ్మం గని యీశ్వరుండు. 542

శా. బాలుం డై చతురాననుండు తనయీ । బ్రహ్మాభిమానంబునన్
లోలుం డై మతి దప్పి నామహిమ యా । లోకింప నేతెంచెఁ దా
నాలోకింపఁగ నెంతవాఁ డనుచు మా । యాజాలమున్ విప్పి త
ల్లీలారూపము లెల్లఁ దాఁచె నటఁ గే । ళీ చాతురీ ధుర్యుఁ డై. 543

వ. అంతలోన నజీవుండు సజీవుం డైన తెఱంగున నెనిమిదికన్నులు గలవేలుపుగమికాఁడు తేఱి తెప్పిఱి కాలుఁ గేలుఁ గదలించి చెచ్చెరం గన్నులు విచ్చి చూడ సమర్థుం డై ముందటఁ గని వెనుకఁ జూచి దివి విలోకించి దిక్కులు వీక్షించి యెల్లయెడలం గలయ దర్శించి తనపురోభాగంబున హరి సంచరించుటం జేసి జాతివైరంబులు లేనినరపక్షిమృగాదులకు నాటపట్టయి సిరి గలిగి కామక్రోధాదిరహితులకు జీవనం బైనబృందావనంబుం బొడగాంచి యందు. 544

సీ. తన కన్యములు లేక । తన రారి యమ్మూర్తి, విభుఁ డయ్యుఁ గ్రేపుల । వెదకువాని
నఖిలజ్ఞుఁ డై యొక్కఁ । డయ్యు నజ్ఞాకృతిఁ, జెలికాండ్రఁ బెక్కండ్రఁ । జీరువాని
బహిరంతరాద్యంత । భావశూన్యుం డయ్యు, నంతంత నడుగుచొ । ప్పరయువాని
గురుగభీరుం డయ్యు । గురువులు వాఱుచు, నట్టిట్టుఁ గొత్తర । లాడువాని

ఆ. జాతిరహితుఁ డయ్యుఁ । జతురగోపార్భక, భావ మెల్ల నచ్చు । పడినమేటి
చెలువువాని హస్త । శీతాన్నకబళంబు, వానిఁ గాంచె నపుడు । వాణిమగఁడు. 545

వ. కని సంభ్రమించి విరించి రాయంచ డిగ్గ నుఱికి కనకదండసుకుమారం బైనశరీరంబుతోడ నేలం జాఁగిలంబడి మణిగణసుప్రకాశంబు లైనతనకిరీటశిఖరప్రదేశంబు లాకుమారుని పాదపద్మంబులు మోవ మ్రొక్కి తోరంబు లగునానందబాష్పజలపూరంబుల నడుగులు గడిగి మఱియును. 546

క. అడుగులపైఁ బడుఁ లేచుం, బడుఁ గ్రమ్మఱ లేచు నిట్లు । భక్తిన్ మును తాఁ
బొడఁగనిన పెంపుఁ దలఁచుచు, దుడుకనిమహిమాబ్ధి నజుఁడు । దుముకడిచె న్నృపా.

వ. అంత మెల్లన లేచి నిలుచుండి నయనారవిందంబులు దెఱచి గోవిందుని సందర్శించి చతుర్ముఖుండు ముఖంబులు వంచి కృతాంజలి యై దిగ్గన డగ్గుత్తిక యిడుచు నేకచిత్తంబునఁ (జతుర్ముఖంబుల) నిట్లని స్తుతియించె. 548

సీ. శంపాలతికతోడి జలదంబు కైవడి, మెఱుఁగుటొల్లియతోడి మేనివానిఁ
గమనీయమృదులాన్న కబళవేత్రవిషాణ, వేణుచిహ్నంబుల వెలయువానిఁ
గుంజావినిర్మిత కుండలంబులవాని, శిఖిపింఛవేష్టిత శిరమువాని
వనపుష్పమాలికా వ్రాతకంఠమువాని, నలినకోమలచర ణములవానిఁ

ఆ. కరుణ గడలుకొనిన కడగంటివాని గో, పాలబాలుభంగిఁ బరఁగువాని
నగుమొగంబువాని ననుఁ గన్నతండ్రిని, నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష.

మ. నను మన్నించి భవజ్జనంబులకు నా నందంబు నిండించునీ
తనురూపం బిదె నా మనంబున కచింత్యం బయ్యె నీయుల్లస
ద్ఘనవిశ్వాకృతి నెవ్వఁ డోపు నెఱుఁగం గైవల్య మై యొప్పు నా
త్మనివేద్యం బగు నీదువైభవము చందం బెట్టిదో యీశ్వరా. 550

క. విజ్ఞానవిధము లెఱుఁగక, తజ్జ్ఞులు నీవార్తఁ జెప్పఁ దనువాఙ్మనముల్
యజ్ఞేశ నీకు నిచ్చిన, యజ్ఞులు నినుఁ బట్టి గెలుతు రజితుఁడ వైనన్. 551

క. శ్రేయములు గురియుభక్తిని, జేయక కేవలము బోధ సిద్ధికిఁ దపముం
జేయుట విఫలము [1]పొల్లున, నాయము సేకుఱునె తలఁప నధికం బైనన్. 552

క. నిజముగ నిన్నెఱుఁగఁగ మును, నిజవాంఛలు నిన్నుఁ జేర్చి నీకథ వినుచున్
నిజకర్మలబ్ధభక్తిన్, సుజనులు నీమొదలిటెంకిఁ జొచ్చి రధీశా. 553

సీ. విక్రియాశూన్య మై విషయత్వమును లేని, దగుచు నాత్మాకార మై తనర్చు
[2]నంతఃకరణ మొక్క యధికసాక్షాత్కార, విజ్ఞానమునఁ బట్టి వే ఱొరులకు
నెఱుఁగంగ రాని దై యే పారి యుండుటఁ, జేసి నీ నిర్గుణ శ్రీవిభూతి
బహిరంగవీథులఁ బాఱక తిరము లై, యమలంబు లగు నింద్రియములచేత

ఆ. నెట్టకేల కైన నెఱుఁగంగ నగుఁ గాక, గుణవిలాసి వగుచుఁ గొమరు మిగులు
నీగుణవ్రజంబు నేర రా దెఱుఁగంగ, నొక్కమితము లేక యుంట నీశ. 554

క. తారాతుషారశీకర, భూరజముల కైన లెక్క బుధు లిడుదురు భూ
భారావతీర్ణకరుఁ డగు, నీరమ్యగుణంబు లెన్న నేర రగణ్యా. 555

శా. ఏవేళం గృపఁ జూచు నెన్నఁడొ హరి న్వీక్షింతు నం చాత్ముఁ డై
నీవెంటం బడి తొంటికర్మచయముల్ నిర్మూలముం జేయుచున్
నీవాఁ డై తనువాఙ్మనోగతుల ని న్సేవించువిన్నాణి యో
కైవల్యాధిప లక్ష్మి నుద్దవడిఁ దాఁ గైకొన్నవాఁ డీశ్వరా. 556

---

1. బొల్లం దాయము. 2. నంతఃకరణ మొక్కఁ డధిక.

ఉ. మాయలు కల్గువారలను § మాయలఁ బెట్టెడి ప్రోడ నిన్ను నా
మాయఁ గలంచి నీమహిమ § మానముఁ జూచెద నంచు నేరమిం
జేయఁగఁ బూనితిం గరుణ § సేయుము కావుము యోగిరాజవా
గ్గేయ దవాగ్నిఁ దజ్జనిత § కీలము గెల్చి వెలుంగ నేర్చునే. 557

సీ. సర్వేశ నే రజో § జనితుండ మూఢుండ, ప్రభుఁడ నే నని వెఱ్ఱి § ప్రల్లదమున
గర్వించినాఁడను § గర్వాంధకారాంధ, నయనుండఁ గృపఁ జూచు § ననుఁ బ్రధాన
మహదహంకృతినభో § మరుదగ్నిజలభూమి, పరివేష్టితాండకుం § భంబులోన
నేడుజేనలమేన § నెనయు నే నెక్కడ, నీదృగ్విధాండంబు § లేరి కైన

తే. సంఖ్యచేయంగరానివి § సంతతంబు, నోలిఁ బరమాణువుల భంగి § నొడలిరోమ
వివరములయందు వర్తించు § విపులభాతి, నెనయుచున్న నీ వెక్కడ § నెంత కెంత.

తరలము. కడుపులోపల నున్నపాపఁడు § కాలఁ దన్నినఁ గిన్కతో
నడువఁ బోలునె క్రాఁగి తల్లికి § నాది సన్నము దొడ్డ నై
యడఁగి కారణకార్యరూపము § నైనయీసకలంబు నీ
కడుపులోనిది గాదె పాపఁడఁ § గాక యే మఱి యెవ్వఁడన్. 559

క. భూరిలయజలధినిద్రిత, నారాయణనాభికమల § నాళమున నజుం
డారయఁ బుట్టె ననుట నిజ, మో రాజీవాక్ష పుట్టె § నోటు తలంపన్. 560

సీ. నళినాక్ష నీ వాది § నారాయణుండవు, జలము నారము జీవ § చయము నార
మందు నీ వుంట నీ § యందు దవి యుంటను, నారాయణుం డను § నామ మయ్యె
సకలభూతములకు § సాక్షి వధీశుండ, వబ్ధి నిద్రించు నా § రాయణుండ
నీమూర్తి యది నీకు § నిజమూర్తి యనరాదు, నలిననాళముత్రోవ § నడచిమున్ను

తే. కడఁగి నూఱేండ్లు వెదకి నేఁ § గాన నయితి, నేకదేశస్థుఁడవు గావ § నేకరుచివి
జగములోనుందు నీలోన § జగములుండు, నరుదు నీమాయ నెట్లైన § నగుచునుండు.

మ. విను మాయీశ్వర వెల్పలన్ వెలుఁగు నీ § విశ్వంబు నీమాయ గా
క నిజం బైన యశోద యెట్లు గనియెం § గన్నార నీకుక్షిలోఁ
గనెఁ బో క్రమ్మఱఁ గాంచెనే భవదపాం § గశ్రీఁ బ్రపంచంబు చ
క్కన లో నా వెలి [1]యాను లోను వెలియుం § గాదేఁ దదన్యం బగున్. 562

మ. ఒకఁడై యుంటివి బాలవత్సములలో § నొప్పారితీ వంతటన్
సకలోపాసితు లౌ చతుర్భుజులు నై § సంప్రీతి నేఁ గొల్వఁగాఁ
బ్రకటశ్రీ గలవాఁడ వైతివి మఱిన్ § బ్రహ్మాండముల్ సూపి యొ
ల్లక యిట్లొక్కఁడ వైతి నీవివిధలీ § లత్వంబుఁ గంటిం గదే. 563

క. ఎఱిఁగినవారికిఁ దోఁతువు, నెఱిఁ బ్రకృతిం జేరి జగము § నిర్మింపఁగ నా
తెఱఁగున రక్షింపఁగ నీ, తెఱఁగునఁ బ్రహరింప రుద్రు § తెఱఁగున నీశా. 564

1. యాఁ గదా తలఁప నిక్కంబే తదన్యం బగున్.

వ. అదియునుం గాక. 565

క. జలచరమృగసురమునినర, కులముల జన్మించి తీవు । కుజనులఁ జెఱుపం
జెలిమిని సుజనుల మనుపను, దలపోయఁగ రాదు నీవి । ధంబు లనంతా. 566

ఆ [1]మ్రబ్బుగొలిపి యోగ । మాయ [2]నిద్రించిన, యోపరాత్మభూమ । యోగిరాజ
యే తెఱంగు లెన్ని । యెంత యెచ్చోట నీ, హేల లెవ్వఁ డెఱుఁగు । నీశ్వరేశ.

సీ. అది గాన నిజరూప । మనరాదు కలవంటి, దై బహువిధదుఃఖ । మై విహీన
సంజ్ఞాన మై యున్న । జగము సత్సుఖబోధ,తనుఁడ వై తుది లేక । తనరు నీదు
మాయచేఁ బుట్టుచు । మనుచు లేకుండుచు, నున్నచందంబున । నుండుచుండు
నొకఁడ వాత్ముఁడ విత । రోపాధిశూన్యుండ, వాద్యుండ నమృతుండ।వక్షరుండ

ఆ. వద్వయుండవును స్వ।యంజ్యోతి వాపూర్ణుఁ,డవు పురాణపురుషుఁ।డవు నితాంత
సౌఖ్యనిధివి నిత్య।సత్యమూర్తివి నిరం,జనుఁడ వీవు దలఁప।జనునె నిన్ను. 568

వ. దేవా యిట్టినీవు జీవాత్మస్వరూపుండవును సకలాత్మలకు నాత్మయైనపరమాత్మ
స్వరూపకుఁడవు నని యెవ్వ రెఱుంగుదురు వారు గదా గురు వనియెడుదినకరుని
వలనఁ బ్రాప్తం బైనయుపనిషదర్థజ్ఞానం బను సునేత్రంబునం జేసి సంసారమిథ్యా
సాగరంబుఁ దరించినచందంబున నుండుదురు రజ్జువందు రజ్జు వని యెఱింగెడి
యెఱుక లేకుండ నయ్యెఱుంగమి నది సర్పరూపం బయి తోఁచినపిదప నెఱింగిన
వారివలన రజ్జువు రజ్జువని యెఱుంగు చుండ సర్పరూపంబు లేకుండుకైవడి నాత్మ
యప్పరమాత్మ యని యెవ్వ రెఱుంగరు వారి కయ్యెఱుంగమివలన సకలప్రపం
చంబు గలిగి తోఁచు నాత్మ యప్పరమాత్మ యని యెవ్వ రెఱుంగుదురు వారి
కయ్యెఱుకవలనఁ బ్రపంచంబు లేకుండు నజ్ఞానసంభావితనామకంబు లైనసంసార
బంధమోక్షంబులు జ్ఞానవిజ్ఞానంబులలోనివి గావు కావున సవిత్రున కహో
రాత్రంబులు లేనితెఱంగునఁ బరిపూర్ణజ్ఞానమూర్తియగు నాత్మయందు నజ్ఞానంబు
లేమిని బంధంబును సుజ్ఞానంబు లేమిని మోక్షంబును లేవాత్మవైన నిన్ను
దేహాదికం బని తలంచియు దేహాదికంబు నిన్నుఁగాఁ దలంచియు నాత్మ వెలి
నుండునంచు మూఢులు మూఢత్వంబున వెదకు చుందురు వారిమూఢత్వంబుఁ
జెప్పనేల బుద్ధిమంతు లై పరతత్త్వంబు గానిజడంబును నిషేధించు చున్న
సత్పురుషులు తమ తమ శరీరంబులయందు నిన్నరయు చుందు రది గావున. 569

శా. దేవా నీచరణప్రసాదకణల । బ్ధిం గాక లే కున్న నొం
డేవెంటం జను నీమహామహిమ నూ । హింపంగ నెవ్వారికిన్
నీవారై చనువారిలో నొకఁడ నై । నిన్ గొల్చు భాగ్యంబు నా
కీవే యిప్పటిజన్మమం దయిన నొం । డెం దైన నోయీశ్వరా. 570

తరలము. క్రతుశతంబులఁ బూర్ణకుక్షివి । కానినీ విటు క్రేపులన్

---

1. మంపు. 2. గ్రీడింప దయో పరా.

సుతులునై చనుఁబాలు ద్రావుచుఁ జొక్కి యాడుచుఁ గౌతుక
స్థితిఁ జరింపఁగఁ దల్లులై విల సిల్లుగోవుల గోపికా
సతులధన్యత లెట్లు సెప్పఁగఁ జాలువాఁడఁ గృపానిధీ. 571

క. పరిపూర్ణంబుఁ బురాణముఁ, బరమానందంబు నైన బ్రహ్మమె చెలికాఁ
డరు దరుదు నంద ఘోష, స్థిరజనములభాగ్యరేఖ చింతింపంగన్. 572

సీ. ఏకాదశేంద్రియా ధీశులు చంద్రాదు, లేను ఫాలాక్షుండు నిట్లు గూడఁ
బదుమువ్వురము నెడపడక నింద్రియపాత్రముల నీపదాంభోజముల మరంద
మమృతంబుగాఁద్రావి యమరనైకేంద్రియాభిమానుల మయ్యు నతికృతార్థ
భావుల మైతిమి పరఁగ సర్వేంద్రియవ్యాప్తులు నీమీఁద వ్రాల్చి తిరుగు

తే. గోపగోపికాజనముల గురువిశిష్టభాగ్యసంపదఁ దలపోయఁ బ్రస్తుతింప
నలవి గా దెవ్వరికి నైన నంబుజాక్ష, భక్తవత్సలసర్వేశ పరమపురుష. 573

శా. ఏలా బ్రహ్మపదంబు వేదములకున్ వీక్షింపఁగా రానిని
న్నీలోకంబున నీవనాంతరమునం దీమందలోఁ గృష్ణ యం
చాలాపాదిసమస్తభావములు నీ యందే సమర్పించునీ
త్రేలం దొక్కనిపాదరేణువులు పై వేష్టించినం జాలదే. 574

మ. నిను హింసించినపూతనాదులకు మున్ నీమేటిసంకేత మి
చ్చిననీకుం బురదారపుత్రగృహగో స్త్రీప్రాణదేహాదు లె
ల్లను వంచింపక యిచ్చుగోపకులకున్ లక్షింప నేమిచ్చెదో
యని సందేహము దోఁచు చున్నది ప్రప న్నానీకరక్షామణీ. 575

క. దేహము కారాగేహము, మోహము నిగళంబు రాగ ముఖరములు రిపు
వ్యూహములు భక్తితో ని, న్నూహింపనియంతదడవు నోకమలాక్షా. 576

ఆ. ఆశ్రయించుజనుల కానందసందోహ, మీఁదలంచి వివిధ హేలతోడ
నప్రపంచకుండవయ్యుఁ బ్రపంచంబు, వెలయఁజేయు దీవువిశ్వమూర్తి. 577

క. ఎఱిఁగినవారియెఱుంగమి, యెఱుఁగమె బహుభాష లేల యీశ్వర నీపెం
పెఱుఁగ మనోవాక్కులకున్, గుఱిసేయం గొలఁది గాదు గుణరత్ననిధీ. 578

క. సర్వము నీవ యెఱుంగుదు, సర్వవిలోకనుఁడ వీవ జగదధిపతివిన్
సర్వాపరాధు నను నో, సర్వేశ యనుగ్రహింపు చనియెద నింకన్. 579

క. జిష్ణు నిశాటవిపాటన, వృష్ణికులాంభోజసూర్య విప్రామరగో
వైష్ణవసాగరహిమకర, తృష్ణా పాషండధర్మ గృహదావాగ్నీ. 580

వ. దేవా నీకుఁ గల్పపర్యంతంబు నమస్కరించెద నని యివ్విధంబున సంస్తుతించి ముమ్మాఱు వలగొని పాదంబులపైఁ బడి వీడ్కొని బ్రహ్మ దననెలవునకుం జనియె నతని మన్నించి భగవంతుఁ డైనహరి తొల్లి చెడి తిరిగి వచ్చినవత్సబాలకులం గ్రమ్మఱం గైకొని పులినంబుకడఁ జేర్చె నిట్లు. 581

క. క్రించుఁదనంబున విధి, దము, వంచించినయేఁడు గోప ✽ వరనందను లొ
క్కించుక కాలంబు గ నీ,క్షించిరి రాజేంద్ర బాల ✽ కృష్ణునిమాయన్. 582

ఆ. ఏమహాత్మమాయ ✽ నీవిశ్వ మంతయు, మోహితాత్మక మయి ✽ మునిఁగియుండు
నట్టివిష్ణుమాయ ✽ నర్భకు లొక్కయేఁ, డెఱుఁగ కుండి రనుట ✽ యేమివెఱఁగు.

వ. అప్పుడు. 584

మ. చెలికాఁడా చనుదెంచితే యిచటికిన్ ✽ సేమంబునం గ్రేపులన్
నెలవుల్ సేరె నరణ్యభూమివలనన్ ✽ నీవచ్చునందాఁకఁ జ
ల్దులు పేరించుక యెవ్వరుం గుడువ రా ✽ లోకింపు ర మ్మంచు నా
జలజాక్షుండు నగన్ భుజించి రచటన్ ✽ సంభాషలన్ డింభకుల్. 585

వ. ఇట్లు బాలకులతోడఁ జల్ది గుడిచి వారలకు నజగరచర్మంబు సూపుచు వనంబున నుండి తిరిగి. 586

పంచచామరము. ప్రసూనపింఛమాలికాప్ర ✽ భావిచిత్రితాంగుఁడుం
బ్రసిద్ధశృంగవేణునాద ✽ పాశబద్ధ[1]లోకుఁడుం
బ్రసన్నగోపబాలగీత ✽ బాహువీర్యుఁ డయ్యు ను
ల్లసించి యేఁగె [2]గోపకుల్ సె ✽ లంగి చూడ మందకున్. 587

వ. ఆ సమయంబున. 588

క. పెనుఁబాము దమ్ము మ్రింగిన, మననందసుతుండు పాము ✽ మర్దించి మమున్
మనిచె నరణ్యములోపల, నని ఘోషించిరి కుమారు ✽ లాఘోషములోన్. 589

వ. అనిన విని నరేంద్రుం డిట్లనియె. 590

క. కని మనిచి యెత్తి పెంచిన, తనుజన్ములకంటె నంద ✽ తనయుం డాఘో
షనివాసులకు మనోరం,జనుఁ డెట్లయ్యెను బుధేంద్ర ✽ చను నెఱిఁగింపన్. 591

వ. అనిన శుకుం డిట్లనియె. 592

సీ. అఖిలజంతువులకు ✽ నాత్మ [3]వల్లభుఁ డైన,భంగి బిడ్డలు నిండ్లుఁ ✽ బసిఁడి మొదలు
వస్తువు లెవ్వియు ✽ వల్లభంబులు గావు, సకలాత్మకుం డైన ✽ జలజనేత్రుఁ
డఖిలజంతువులకు ✽ నాత్మ గావున ఘోష,వాసుల కెల్లను ✽ వల్లభత్వ
మున మిక్కిలొప్పెను ✽ మూఁడులోకములకు; హితముసేయఁగ జల ✽ జేక్షణుండు

ఆ. మాయతోడమూర్తి ✽ మంతుఁడై యొప్పారుఁ, గలఁ డతండు నిఖిల ✽ గణములందు
భవతిధాతు వెట్లు ✽ భావార్థమై సర్వ, ధాతుగణమునందుఁ ✽ దనరు నట్లు.

క. శ్రీపతిపద మనునావను, బ్రాపించి భవాబ్ధి వత్స ✽ పదముగ ధీరుల్
రూపించి దాఁటి చేరుదు, రాపత్పదరహితు లగుచు ✽ నమృతపదంబున్. 594

ఆ. అఘునిఁ జంపి కృష్ణుఁ ✽ డాప్తులుఁ దానును, జల్ది గుడిచి జలజ ✽ సంభవునకుఁ
జిద్విలాస మైన ✽ చెలువు సూపినకథఁ, జదువ వినినఁ గోర్కి ✽ సంభవించు. 595

1. లోలుఁడుం. 2. గోపికల్. 3. వల్లభ మైన.

వ. అని చెప్పి మఱియు వ్యాసనందనుం డి ట్లనియె. 596

క. రాగంబున బలకృష్ణులు, పౌగండవయస్కు లగుచుఁ § బశుపాలకతా
యోగంబున బృందావన,భాగంబునఁ గాచి రంతఁ § బశువుల నధిపా. 597

వ. అయ్యెడఁ గృష్ణుం డొక్కనాఁడు రేపకడ లేచి వేణువు పూరించి బలభద్రసహితుండై గోపకుమారులు దన్ను బహువారంబులు గైవారంబులు సేయ మ్రోల నాలకదుపుల నిడికొని నిరంతర ఫలకిసలయకుసుమంబులను గుసుమమకరందనిష్యందపానానందదిందిందిరకదంబంబును గదంబాదినానాతరులతాగుల్మసంకులంబును గులవిరోధరహితమృగపక్షిభరితంబును భరితసరస్సరోరుహపరిమళమిళితపవనంబును నయినవనంబుఁ గని యందు వేడుకం గ్రీడింప నిచ్ఛయించి వెన్నుం డన్న కి ట్లనియె. 598

శా. శాఖాపుష్పఫలప్రభారనత లై § చర్చించి యో దేవ మా
శాఖిత్వంబు హరింపు మంచు శుకభా § షన్ నీ కెఱింగించుచున్
శాఖాహస్తములం బ్రసూనఫలముల్ § సక్కన్ సమర్పించుచున్
శాఖిశ్రేణులు నీపదాబ్జముల కో § జన్ మ్రొక్కెడిం జూచితే. 599

సీ. నిఖిలపావన మైన § నీకీర్తిఁ బాడుచు, నీతుమ్మెదలు వెంట § నేఁగుదెంచె
నడవిలో గూఢుండ § వైన యీశుఁడ, వని ముసరి కొల్వఁగ వచ్చె § మునిగణంబు
నీలాంబరముతోడి § నీవు జీమూతమ; వని నీలకంఠంబు § లాడఁ దొడఁగెఁ
బ్రియముతోఁ జూచుగోపికలచందంబున, నినుఁ జూచె నదె హరి § ణీచయంబు

ఆ. నీవు విందు వనుచు § నిర్మలసూక్తులు, వలుకు చున్న విచటఁ § బరభృతములు
నేఁడు విపినచరులు § నీవు విచ్చేసిన, ధన్యు లైరి గాదె § తలఁచి చూడ. 600

సీ. నీపాదములు సోఁకి § నేఁడు వీరుత్తృణ,పుంజంబుతో భూమి § పుణ్య యయ్యె
నీనఖంబులు దాఁకి § నేఁడు నానాలతా,తరుసంఘములు కృతా § ర్థంబు లయ్యె
నీకృపాదృష్టిచే § నేఁడు నదీశైల, ఖగమృగంబులు దివ్య § కాంతిఁ జెందె
నీపెన్నురము మోవ § నేఁడు గోపాంగనా,జనములపుట్టువు § సఫల మయ్యె

ఆ. నని యరణ్యభూమి § నంకించి పసులను, మిత్రజనులుఁ దాను § మేపుచుండి
నలినలోచనుండు § నదులందు గిరులందు, సంతసంబు మెఱయ § సంచరించె.

వ. మఱియు నయ్యీశ్వరుండు. 602

సీ. ఒకచోట మత్తాళి § యూథంబు జుమ్మని, మ్రోయంగ జుమ్మని § మ్రోయుచుండు
నొకచోటఁ గలహంస § యూథంబుఁ గూడి కేం,కృతులు సేయంగఁ గేం § కృతులు సేయు
నొకచోట మదకేకి § యూథంబు లాడంగ, హస్తాబ్జములు ద్రిప్పి § యాడఁ దొడఁగు
నొకచోట వనగజ § యూథంబు నడవంగ, నయముతో మెల్లన § నడవఁ జొచ్చు

ఆ. గ్రౌంచచక్రముఖర § ఖగము లొక్కచోటఁ, బలుక వానియట్ల § పలుకుఁ గదిసి
పులులసింహములను § బొడగని యొక్కచోఁ, బఱచుమృగములందుఁ § బఱచుఁ గూడి.

వ. మఱియును. 604

సీ. రా పూర్ణచంద్రిక ♦ రా గౌతమీ గంగ, రమ్ము భగీరథ ♦ రాజతనయ
రా సుధాజలరాశి ♦ రా మేఘమాలిక, రమ్ము చింతామణి ♦ రమ్ము సురభి
రా మనోహారిణి ♦ రా సర్వమంగళ, రా భారతీదేవి ♦ రా ధరిత్రి
రా శ్రీ మహాలక్ష్మి ♦ రా మందమారుతి, రమ్ము మందాకిని ♦ రా శుభాంగి.

ఆ. యనుచు మఱియుఁ గలుగు ♦ నాఖ్యలు గలగోవు, లడవిలోన దూర ♦ మందు మేయ
ఘనగభీరభామఁ ♦ గడు నొప్పఁ జీరు నా, భీరజనులు వొగడఁ ♦ బెంపు నెగడ. 605

క. కాంతారవిహారమ్ముల, శ్రాంతుండై గోపకాంక ♦ [1]శయుఁ డగునన్నన్
సంతుష్టిఁ బొందఁ జేయు ని, రంతరకరచరణమర్ద ♦ నాదుల నధిపా. 606

క. పాడుచు నాడుచు మందట, లాడుచు నొండొరులఁ దాఁటు ♦ నాప్తులఁ గని [2]బి
ట్టాడుచుఁ జేతులు వ్రేయుచుఁ, గ్రీడింతురు నగుచు బలుఁడుఁ ♦ గృష్ణుఁడు నొకచోన్.

వ. ఇవ్విధంబున. 608

సీ. వేదాంతవీథుల ♦ విహరించువిన్నాణి, విహరించుఁ గాంతార ♦ వీథులందు
ఫణిరాజశయ్యపైఁ ♦ బవళించుసుఖభోగి, పల్లవశయ్యలఁ ♦ బవ్వళించు
గురుయోగిమానస ♦ గుహలఁ గ్రుమ్మరుమేటి, గ్రుమ్మరు నద్రీంద్ర ♦ గుహలలోనఁ
గమలతోడఁ బెనంగి ♦ కడు డయ్యుచతురుఁ డా, భీరజనులతోడఁ ♦ బెనఁగి డయ్యు

ఆ. నఖిలలోకములకు ♦ నాశ్రయుం డగుధీరుఁ, డలసి తరులనీడ ♦ నాశ్రయించు
యాగభాగచయము ♦ లాహరించుమహాత్ముఁ, డడవిలోనిఫలము ♦ లాహరించు.

వ. ఆ సమయంబున. 610

సీ. అలసినచోఁ గొంద ♦ ఱతిమోదమున వీఁపు, లెక్కించుకొని పోదు ♦ రేపు మెఱసి
సొలసి నిద్రించిన ♦ చో నూరుతల్పంబు, లిడుదురు కొందఱు ♦ హితవు గలిగి
చెమరించియున్నచోఁ ♦ జిగురుటాకులఁ గొంద, ఱొయ్యన విసదురు ♦ రుత్సహించి
దవ్వేఁగి నిలుచుచోఁ ♦ దడయక కొందఱు, పదము లొత్తుదు రతి ♦ బాంధవమున

ఆ. గోపవరులు మఱియుఁ ♦ గొందఱు ప్రియమున, మాధవునకుఁ బెక్కు ♦ మార్గములను
బనులు సేసి రెల్ల ♦ భవములఁ జేసిన, పాపసంచయములు ♦ భస్మములుగ. 611

వ. అయ్యవసరంబున శ్రీదామనామధేయుం డైనగోపాలకుండు రామకేశవులం
జూచి యిట్లనియె. 612

గార్దభాకారుం డైనధేనుకాసురుని బలభద్రుఁడు వధించుట.

క. దూరంబునఁ దాలతరు, స్ఫారం బగువనము గలదు ♦ పతితానుపత
ద్భూరిఫలసహిత మది యే, ధీరులు సొర వెఱతు రందు ♦ ధేనుకుఁ డుంటన్. 613

వ. ఆ ధేనుకాసురుండు మహాశూరుండును ఖరాకారుండును నై సమానసత్త్వసమే
తు లైనజ్ఞాతులుం దానును మనుష్యులం బట్టి భక్షించుచుండు నయ్యెడఁ బరి

1. శయనుం డగుచున్. 2. చిట్టాడుచు,

మహోపేతంబు లైననూతనఫలవ్రాతంబు లసంఖ్యాతంబులు గలవు వినుఁడు. 614

క. ఫలగంధము నాసాపుట, ములవెంటం జొచ్చి చిత్త | ములఁ గొనిపోయెన్
ఫలముల నమలింపుఁడు మము, బలియురకును మీకు దైత్య | భటు లడ్డంబే. 615

వ. అని పలికిన చెలికానిపలుకులాదరించి విని నగి వారునుం దారును మహోత్తాలం బగుతాలవనంబునకుం జని యందు. 616

క. తత్తటమున బలభద్రుఁడు, తత్తాలానోకహములఁ | దన భుజబలసం
పత్తిఁ గదల్చుచు గ్రక్కున, మత్తేభముభంగిఁ బండ్లు | మహిపై రాల్చెన్. 617

వ. అప్పుడు పండ్లు రాల్చినచప్పుడు సెవులకు దెప్పరం బయిన నదిరిపడి రిపుమర్దనకుతుకంబున గార్దభాసురుండు. 618

మ. పదవిక్షేపములన్ సవృక్షధరణీ | భాగంబు గంపింపఁ గా
రదముల్ దీడుచుఁ గ్రిత్తిరించినచెవుల్ | రాజిల్ల వాలంబు భీ
తిద మై [1]తూల ఖరారవంబున సము | ద్దీపించి గోపాలకుల్
బెదరన్ రామునిఱొమ్ముఁ దన్నె వెనుకై | బీరంబు దోరంబు గన్. 619

క. మఱియును దనుజుఁడు రామునిఁ, గఱవఁగ గమకించి తెఱపి | గానక యతనిం
జుఱచుఱఁజూచుచుఁ [2]శౌర్యము, పఱివోవఁగ నింత నంతఁ | బదములఁ దన్నెన్.

వ. అంత బలభద్రుండు రౌద్రాకారంబున గర్దభాసురుపదంబులు నాలుగు నొక్కకేల నంటం బట్టి బెట్టు దట్టించి త్రిప్పి విగతజీవునిం జేసి. 621

మ. ఒకతాలాగ్రముఁ దాఁక వైవ నది కం | పోద్రిక్తమై త్రెవ్వి వే
ఱొకతాలాగ్రముపైఁ బడ న్నదియు న | య్యుగ్రాహతిన్ నిల్వకొం
డొకతాలాగ్రముపైఁ బడన్ విఱిగి యి | ట్లొండొంటిపైఁ దాలవృ
క్షకముల్ గూలెఁ బ్రచండమారుతము దాఁ | కం గూలుచందంబునన్. 622

ఉ. తంతువులందుఁ జేలమువి | ధంబున నేపరమేశుమూర్తి యం
దింతయుఁ బుట్టు నట్టిజగ | దీశుఁ డనంతుఁడు దైత్యమాత్రు ని
ట్లంతము సేయు టెంతపని | యద్భుతమే విను మంతలోన వాఁ
డంతముఁ బొందు టెల్లఁ గని | యాతనిబంధులు గార్దభంబు లై. 623

క. బలకృష్ణులపైఁ గవిసిన, బలయుర ఖరదైత్యభటులఁ | బశ్చిమపాదం
బులు వట్టి తాలశిఖరం, బుల కెగురఁగ వైచి వారు | పొరిగొని రధిపా. 624

వ. అప్పుడు. 625

క. ఆలమున నోలిఁ గూలిన, తాలద్రుమఖండదైత్య | తనుఖండములన్
గీలిత మై ధర జలధర,మాలావృత మైనమింటి | మాడ్కిన్ వెలిఁగెన్. 626

క. ధేనుకవనమున నమలిరి, మానవు లావేళఁ దాటి | మ్రాఁకులఫలముల్
ధేనువులు మేసెఁ గసవులు, ధేనుకహారభర్తృకామ | ధేనువుగలుగన్. 627

1. తూలఁగఁ గాపరంబున. 2. గార్యము.

వ. ఆ సమయంబున సురలు విరులవానలు గురియించి దుందుభులు మొరయించి రంతఁ గమలలోచనుండు గోపజనజేగీయమానవర్తనుండై యన్నయుం దానును గోగణంబుల వెలుచుకొని మందకుం జనియె నయ్యెడ. 628

ఉ. గోపదరేణుసంకలిత § కుంతలబద్ధమయూరపింఛు న
ద్దీపితమందహాసశుభ § దృష్టిలసన్ముఖు వన్యపుష్పమా
లాపరిపూర్ణు గోపజన § లాలితవేణురవాభిరాము నా
గోపకుమారునిం గనిరి § గోపసతుల్ నయనోత్సవంబు గన్. 629

ఆ. కమలనయనువదన § కమలమరందంబుఁ, దవిలి నయనషట్ప § దములవలనఁ
ద్రావి దినవియోగ § తాపంబు మానిరి, గోపకాంతలెల్లఁ § గోర్కు లలర. 630

వ. ఇట్లు గోపికలు సాదరంబునం జూడ వ్రీడాహాసవినయంబులం జూచుచుఁ గ్రీడాగరిష్ఠుం డయిన ప్రోడ గోష్ఠంబు ప్రవేశించె నంత రోహిణీయశోదలు గుఱ్ఱల వలనిమచ్చికలు పిచ్చలింప నిచ్చకు వచ్చిన ట్లయ్యైవేళల దీవించిరి వారును మజ్జనోన్మర్దనాదు లంగీకరించి సురభికుసుమగంధంబులు గైకొని రుచిరచేలంబులు గట్టుకొని రసోపపన్నంబు లయినయన్నంబులు గుడిచి తృప్తులై మంజులశయ్యల సుప్తు లయి యుండి రందు.

## శ్రీకృష్ణుఁడు కాళియమర్దనము గావించుట.

సీ. ఒకనాఁడు బలభద్రుఁ § డొక్కఁడు రాకుండ, గోపాలకులుఁ దానుఁ § గూడి కృష్ణుఁ
డడవికిఁ జని యెండ § నాగోవులను గోపకులు నీరువట్టునఁ § గుంది డస్సి
కాళిందిలో విష § కలితతోయముఁ ద్రావి, ప్రాణానిలంబులు § వాసి పడిన
యోగీశ్వరేశుండు § యోగివంద్యుఁడు గృష్ణుఁ, డీక్షణామృతధార § లెలమిఁ గురిసి

ఆ. పసుల గోపకులను § బ్రతికించె మలరంగ, వారు తమకుఁ గృష్ణుఁ § వలన మరల
బ్రతుకు గలిగె నంచు § భావించి సంతుష్టమానసములఁ జసిరి మానవేంద్ర.

క. కాళియఫణిదూషిత యగు, గాళిందిఁ బవిత్రఁ జేయఁ § గా నుత్సుకుఁడై
కాళిందీజలవర్ణుఁడు, కాళియు వెడలంగ నడిచెఁ § గౌరవముఖ్యా. 633

వ. అనిన నయ్యగాధజలంబువలన మాధవుం డెట్టినేర్పున సర్పంబుదర్పంబు మాపి వెడలించె నందుఁ బెద్దకాలం బావ్యాళం బేల యుండె నెఱింగింపుము. 634

క. తొఱ్ఱులఁ గాచిన నందుని, కుఱ్ఱనిచరితామృతంబు § గొనకొని చెవులన్
జుఱ్ఱంగఁ దనివి గల్గునె, వెఱ్ఱుల కయినను దలంప § విప్రవరేణ్యా. 635

వ. అనిన శుకుం డిట్లనియె. 636

సీ. మానవేశ్వర యొక్క § మడుఁగు కాళిందిలోఁ, గల దది యెప్పుడుఁ § గాళియాహి
విషవహ్నిశిఖలచే § వేఁచుచుండును మీఁదఁ, బఱి తెంచినంతన § పక్షులైనఁ
బడి మ్రగ్గు నందుఁ ద § ద్భంగశీకరయుక్త, పవనంబు సోఁకినఁ § బ్రాణులెవ్వి
యైన నప్పుడ చచ్చు § నట్టియామడుఁగులోఁ, నుదకంబు పొంగుచు § నుడుకుచుండఁ

తే. జూచి వెఱఁ గంది కుజనులఁ ‡ స్రుక్కఁ జేయ
నవతరించినబలువీరుఁ ‡ డాగ్రహించి
భుజగవిషవహ్నిదోషంబు ‡ వాలియఁ జేసి
సుజలఁ గావించి యానదిఁ ‡ జూతు ననుచు. 637

వ. కృతనిశ్చయుండై పూర్వజన్మభాగ్యంబునం దనచరణసంస్పర్శంబునకు యోగ్యం బైతత్సమీపంబున విశాలవిటపశాఖాకదంబంబుతో నున్నకదంబభూజంబు నెక్కి.

మ. [1]కటిచేలంబు బిగించి పింఛమునఁ జ ‡ క్కం గొప్పు [2]బంధించి దో
స్తటసంస్ఫాలన మాచరించి చరణ ‡ ద్వంద్వంబుఁ గీలించి త
త్కటశాఖాగ్రముమీఁద నుండి యుఱికెన్ ‡ గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుభగుభ ‡ ధ్వానం బనూనంబుగన్. 639

ఉ. భూరిమహాప్రతాపపరి ‡ పూర్ణభయంకరగోపబాలకం
ఠీరవపాత వేగవిక ‡ టీకృతదుర్విషభీషణోర్మిసం
పూరిత మై వడిం గలఁగి ‡ పొంగి ధనుశ్శతమాత్రభాగవి
స్తారము వొంగె నమ్మడుఁగు ‡ తప్తపయఃకణబుద్బుదోగ్ర మై. 640

శా. పాఠీనాకృతిఁ దోయరాశినడుమన్ ‡ భాసిల్లి మున్నాద్యుఁ డై
కాఠిన్యక్రియ నీఁదునేర్పు దనకుం ‡ గల్మిన్ భుజంగేంద్రహృ
త్పీఠాగ్రంబున రోమహర్షు లెగయన్ ‡ భీమంబుగా నీఁదె ను
ల్లోలోత్తుంగతరంగ మై మడుఁగు దు ‡ ర్లోక్యంబు గా బాహులన్. 641

వ. ఆ సమయంబున. 642

శా. బాలుం డొక్కఁడు వీఁడు నామడుఁగు వి ‡ భ్రాంతోచ్చలత్కర్ణక
ల్లోలం బై కలఁగం జరించె నిట నే ‡ లో నుంటఁ జూడండు మ
త్కీలాభీలవిశాలదుస్సహవిషా ‡ గ్ని జ్వాలలన్ భస్మ మై
కూలం జేసెద నేఁడు లోకులకు నా ‡ కోపంబు దీపింపఁగన్. 643

వ. అని తలంచి విజృంభించి. 644

ఉ. ఘోరవిషానల ప్రభలు ‡ గొబ్బునఁ గ్రమ్మఁగ సర్పసైన్యవి
స్ఫారుఁడు గాళియోరగుఁడు ‡ వాఱి వడిం గఱచెం బయోధరా
కారుఁ బయోవిహారు భయ ‡ కంపవిదూరు మహాగభీరు నా
భీరకుమారు వీరు నవ ‡ పీతశుభాంబరధారు ధీరునిన్. 645

క. కఱచి పిఱుతివక మఱియును, వెఱవక నిజవదనజనిత ‡ విషదహనశిఖల్
మెఱయఁ దననిడుదయొడలను, నెఱిహరిఁ బెనఁగొనియె భుజగ‡నివహాపతివడిన్.

వ. ఇట్లు భోగిభోగపరివేష్టితుం డై చేష్టలు లేనివాని తెఱంగునఁ గానంబడుచున్న ప్రాణసఖునిం గనుంగొని తత్ప్రభావంబు లెఱుంగక తత్సమర్పితధనదారమనో

1. కటికసూత్రంబు. 2. సంధించి.

రథమానసులు గావున. 647

చ. అదె మనకృష్ణునిం గఱచి ✽ యంతటఁ బోక భుజంగమంబు దు
ర్మదమున మేనఁ జుట్టికొని ✽ మానక యున్నది యింక నేమి సే
యుద మెటఁ జొత్తు మేపురుషు ✽ లోపుదు రీయహిఁ నడ్డపెట్ట నె
య్యది సదుపాయ మంచుఁ బడి ✽ రార్తరవంబులఁ దూలి గోపకుల్. 648

క. గోపకుమారకశేఖరు, నేపున సర్పంబు గఱచు ✽ టీక్షించి వగన్
మేపులకుఁ దొలఁగి గోవులు, వాపోవుచు నుండె వృషభ ✽ వత్సంబులతోన్. 649

క. భూతలము వడఁకె నుల్కా, పాతంబులు మింటఁ గానఁ ✽ బడె ఘోషములో
వ్రేతలకును గోపకసం, ఘాతముల[1]కు నదరెఁ గీడు ✽ కన్ను లిలేశా. 650

వ. అంత నాదుర్నిమిత్తంబులు వొడగని బెగడు గదిరినచిత్తంబుల నుత్తలపడుచు మంద నున్ననందయశోదాదు లైనగోపగోపికాజనంబులు హారిదళసరి యెఱుం గక గోపాలగోగణపరివృతుం డైనకృష్ణుం డెక్కడ నైనం జిక్కనోపు నని పో క్కుచుం బెక్కువ లయినమక్కువలు చెక్కు లొత్త నొక్కపెట్ట బాలవృద్ధ సమేతు లై మహాఘోషంబున నాఘోషంబు వెలువడి. 651

క. వారిబ్భంగి నెఱుంగని, వారై హరిఁ జూడఁ బోవ ✽ వడిగొని నగుచున్
వారింపఁ డయ్యె రాముఁడు, వారిని హరిలా వెఱుంగు ✽ వాఁడయ్యు నృపా.

వ. అంతలోన వారునుం దానును గాంతారమార్గంబు వట్టి పోవుచు నెడనెడ గోప గోష్పదంబులసందుల నింత నంత నక్కడక్కడ యవాంకుశహలకమలకులిశ చక్రచాపకేతనాదిరేఖాలంకృతంబు లై మార్గాభరణంబు లైన హరిచరణంబుల జూడఁ గని చొప్పు దప్పక చని దుర్ఘటం బయినయమునాతటంబు సేరి వారి మధ్యంబున నితరుల కసాధ్యం బయినసర్పంబుచేతఁ గాటువడి దర్పంబు సూపక భోగిభోగపరివృతుం డైనకృష్ణునిఁ గృష్ణకృష్ణేతివిలాపంబులఁ దాపంబులం బొం దుచుఁ [2]దత్కాలంబునం బ్రతికూలం బయ్యె ననుచు దైవంబు దిట్టు గోపకు లును గోపకులం గలిసి మేఁత లుడిగి తెప్ప లిడక కృష్ణునిం దప్పక చూచుచు నొరలుచున్నగోవులనుం గని రందు గోపికలు యశోదం బట్టుకొని విలపించుచుఁ గృష్ణు నుద్దేశించి యి ట్లనిరి. 653

సీ. ఎదురువచ్చినఁ జాల ✽ నెదురుగాఁ జనుదెంతు, వెదురువచ్చిన నేఁ డ✽దేల రావు
చూచినఁ గృపతోడఁ ✽ జూచుచుందువు నీవు, సూచినఁ గను విచ్చి ✽ చూడ వేల
డాసిన నఱలేక ✽ డాయంగ వత్తువు, డాసిన నేటికి ✽ డాయ విచటఁ
జీరిన నో యని ✽ చెల రేఁగి పలుకుదు, విది యేమి సీరిన ✽ నెఱుఁగ కుంట

ఆ. తలఁపు సేయునంతఁ ✽ దలపోయు చుందువు, తలఁపు సేయ నేఁడు ✽ దలఁప వకట
యనుచు భక్తివివశ ✽ లాడెడికైవడి, వ్రేత లెల్ల నాడి ✽ వివశ లైరి. 654

1. 'కదరె వలవడ' అ. ప్ర. 2. దత్కాలంబున.

వ. ఆ సమయంబున నందయశోదాదులు హరిం జూచి యధికం బైనశోకంబున
నిట్లనిరి. 655

క. విషకుచయుగ యగురక్కసి, విషకుచదుగ్ధంబు ద్రావి § విషవిజయుఁడ వై
విషరుహలోచన యద్భుత, విషయుం డగునీకు సర్ప § విష మెక్కెఁగదే. 656

క. కట్టా క్రూరభుజంగము, గట్టలుకన్ నిన్నుఁ గఱవఁ § గరిపించితివో
తిట్టితివో పాపపువిధిఁ, బట్టి మముం దలఁచి కాఁకఁ § బలవించితివో. 657

క. పన్నగము మమ్ముఁ గఱవక, ని న్నేటికిఁ గఱచెఁ గుఱ్ఱ § నెమ్మి గలిగి నీ
వున్నను మము రక్షింతువు, నిన్నున్ రక్షింప నేము § నేరము తండ్రీ. 658

ఉ. చూడ వదేమి గారవపుఁ § జూపుల మమ్ము సఖాలితోడ మా
టాడ వదేమి నర్మముగ § నందెలు పాదములందు మ్రోయ నేఁ
డాడ వదేమి నర్తనము § లవ్వల మ్రోలను గోపికావళిం
గూడ వదేమి నవ్వులకు § గోపకుమారవరేణ్య చెప్పుమా. 659

సీ. శ్రవణరంధ్రంబులు § సఫలతఁ బొందంగ, నెలమి భాషించువా § రెవ్వ రింకఁ
గరచరణాదుల § కలిమి ధన్యత నొంద, నెగిరి పైఁ బ్రాఁకు § వా రెవ్వ రింక
నయనయుగ్మంబు లు § న్నతిఁ గృతార్థములుగా, నవ్వులు సూపువా § రెవ్వ రింక
జిహ్వలు గౌరవ § శ్రీఁ జేరఁ బాటల, నెడఁ [1]బలికించువా § రెవ్వ రింకఁ
ఆ. దండ్రి నీవు సర్ప § దష్టుండ వై యున్న, నిచట మాకుఁ బ్రభువు § లెవ్వ రింక
మరగి పాయ లేము § మాకు నీతోడిద, లోక మీవు లేని § లోక మేల. 660

వ. అని యొండొరులం బట్టుకొని విలపించుచుం గృష్ణునితోడన మడుఁగుఁ జొత్తము
చత్త మనుచుఁ గృష్ణవిరహవేదనానలభారతప్తులై మడుఁగుఁ జొరఁ బాఱుచున్న
వారలఁ గనుంగొని భగవంతుం డైన బలభద్రుండు మీరు మీఁదెఱుంగరు
ధైర్యంబు విడుచుట కార్యంబు గాదు సహించి చూడుం డని వారిని వారించె.

క. తనుఁ గూర్చి యివ్విధంబున, వనితలు బిడ్డలును దారు § వాపోయెడి ఘో
షనివాసులఁ గని కృష్ణుఁడు, మనుజునిక్రియ నొకముహూర్తమాత్రము జరపెన్.

శా. అంతం గృష్ణుఁడు మేను వెంప భుజగుం § [2]డావృత్తులం బాసి తా
సంతప్తాయతభోగుఁ డై కఱచుటల్ § సాలించి నిట్టూర్పుతో
శ్రాంతుం డై తల లెత్తి దుర్విషము నా § సావీథులం గ్రమ్మ దు
శ్చింతన్ దిక్కులు సూచుచున్ దలఁగి ని § ల్చెన్ ధూమకాష్ఠాకృతిన్. 663

చ. వెఱ [3]మెర లేనియట్టిబలు § వీరుఁడు కృష్ణకుమారుఁ డొక్కచేఁ
జఱచి ఖగేంద్రుచందమునఁ జక్కన దాడలు వట్టి కన్నులం
జొఱచొఱ దుర్విషానలము § [4]జొబ్బిలు చుండఁగ నెత్తి లీలతో
జిఱజిఱఁ ద్రిప్పి వైచెఁ బరి § శేషితదర్పముఁ గ్రూరసర్పమున్. 664

1. 'బలికించు. 2. డావృత్తతం. 3. మఱ. 4. 'స్రుక్కనుబ్బ-వధింపక-స్రవింపఁగ' వ్రా.ప్ర.

వ. ఇట్లు వేగంబున నాగంబు వీచి వైచి జగజెట్టి యైనసందునిపట్టి రెట్టించినసంభ్రమంబున. 665

సీ. ఘనయమునానదీ ✽ కల్లోలఘోషంబు సరసమృదంగ ఘో ✽ షంబు గాఁగ
సాధుబృందావన ✽ చరచంచరీకగా, నంబు గాయకసుగా ✽ నంబు గాఁగఁ
గలహంససారస ✽ కమనీయమంజుళశ, బ్దంబులు దాళశ ✽ బ్దములు గాఁగఁ
దివి నుండి వీక్షించు ✽ దివిజగంధర్వాది, జనులు సభాసీన ✽ జనులు గాఁగఁ
తే. బద్ధరాగాదిరత్నప్ర ✽ భాసమాన, మహితకాళియఫణిఫణా ✽ మండపమున
నళినలోచనవిఖ్యాతనర్తకుండు, నిత్యనైపుణ్యమునఁ జేర్చి ✽ నృత్య మాడె. 666

శా. కుక్షిం లోకము లున్నగౌరవముతో ✽ గోపాకృతి న్నున్నయా
రక్షోహంత వడిం మహాఫణిఫణా ✽ రంగ ప్రదేశంబుపై
సక్షీణోద్ధతి నాడుఁబాడుఁ జెలఁగుం ✽ హాసంబుతోడం బద
ప్రక్షేపంబుల సేయుఁ గేళిగతులం ✽ బ్రాణైక శేషంబు గన్. 667

క. ఘనతరసుమిరానంద, స్వనములతో సిద్ధసాధ్య ✽ చారణగంధ
ర్వనిలింపమునిసతులు చ, య్యనఁ గురిసిరి విరులవాన ✽ లాడెడుహరిపై. 668

వ. ఇట్లు దుష్టజనదండధరావతారుం డైనహరి వడి గలిగినపడగలమీఁదఁ దాండవంబు సలుప బెండువడి యొండొండ ముఖంబుల రక్తమాంసంబు లుమియుచుఁ గన్నుల విషంబు గ్రక్కుచు నుక్కు సెడి చిక్కి దిక్కులు సూచుచుం గంఠగతప్రాణుం డై ఫణీంద్రుండు తనమనంబున. 669

ఉ. వేలుపు లైన లావు సెడి ✽ వేదనఁ బొందుచు నావిషానల
జ్వాలలు సోఁకినంతటన ✽ చత్తురు నేఁ డిది యేమిచోద్య మా
భీలవిషాగ్ని హేతిచయ ✽ పీడకు నోర్చియుఁ గ్రమ్మఱంగ నీ
బాలుఁడు మత్ఫణాశతము ✽ భగ్నముగా వెసఁ ద్రొక్కి యాడెడిన్. 670

క. ఈతఁడు సర్వచరాచర, భూతేశుం డైన పరమ ✽ పురుషుఁడు సేవా
ప్రీతుఁడు హరి గాఁ దగు నని, భీతిం శరణంబు నొందె ✽ బిట్టలసి నృపా. 671

కాళియునిభార్యలైన నాగాంగనలు శ్రీకృష్ణుని నుతించుట.

వ. ఇట్లు క్రూరంబు లైనహరిచరణ ప్రహారంబులం బడగ లెడసి నొచ్చి చచ్చిన క్రియం బడి యున్నపతిం జూచి నాగకాంతలు దురంతం బైనచింతాభరంబున నివ్వటిల్లెడునెవ్వగల నొల్లంబోయి పల్లటిల్లిన యుల్లంబుల. 672

మ. కచబంధంబులు వీడ భూషణము లా ✽ కంపింపఁ గౌఁదీఁగలుం
గుచయుగ్మంబుల వ్రేఁగునం గదలఁ బై ✽ కొంగుల్ వడిం జీరఁగాఁ
బ్రచురభ్రాంతిఁ గలంగి ముందట రుద ✽ ద్బాలావలిం గొంచు స్రు
క్కుచు భక్తిం జని కాంచి రాగుణమణిం ✽ గోపాలచూడామణిన్. 673

వ. కని దండప్రణామంబు లాచరించి నిటలతటఘటితకరకమలలై యి ట్లనిరి. 674

క. క్రూరాత్ముల దండింపఁగ, ధారుణిపై నవతరించి § తనరెడినీ కీ
క్రూరాత్ముని దడించుట, క్రూరత్వము గాదు సాధు § గుణము గుణాఢ్యా. 675

క. పగవారిసుతులయందును, బగ యించుక లేక సమతఁ § బరఁగెడినీకుం
బగ గలదె ఖలుల నడఁచుట, జగదవనముకొఱకుఁ గాక § జగదాధారా. 676

క. నిగ్రహమె మము విషాస్యుల, నుగ్రుల శిక్షించు టెల్ల § నూహింప మహా
నుగ్రహము గాక మా కీ, నిగ్రహము విషాస్యభావ § నిర్గతిఁ జేసెన్. 677

ఉ. ఎట్టితపంబు సేసె నొకొ § యెట్టిసుకర్మము లాచరించెనో
యెట్టినిజంబు వల్కె నొకొ § యీఫణి పూర్వభవంబునందు ము
న్నెట్టిమహానుభావులకు § నెన్నఁడుఁ జేరువ గానినీవు నేఁ
డిట్టివినోదలీలఁ దల § లెక్కి నటించెద వీఫణీంద్రుపై. 678

మ. బహుకాలంబు దపంబు సేసి వ్రతముల్ § పాటించి కామించి నీ
మహనీయోజ్జ్వలపాద రేణుకణసం § ప్రాప్త్యాధికారంబు శ్రీ
మహిళారత్నము దొల్లి కాంచె నిదె నే § మం బేమియుఁ లేక యీ
యహి నీపాదయుగాహతిం బడసె నేఁ § డత్యద్భుతం బీశ్వరా. 679

ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద § మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా
నొల్లరు చక్రవర్తిపద § మొల్లరు సర్వరసాధిపత్యము
నొల్లరు యోగసిద్ధి మఱి § యొండుభవంబుల నొందనీనినీ
సల్లలితాంఘ్రిరేణువుల § సంగతి నొందినధన్యు లెప్పుడున్. 680

క. ఘనసంసారాహతు లగు, జను లాకాంక్షింపఁ గడు స § శక్యం బగుశో
భనము సమక్షంబున నహి, గనియెం దామసుఁడు రోష § కలితుం డయ్యున్. 681

వ. దేవా సకలపురుషాంతర్యామిరూపత్వంబువలనఁ బరమపురుషుండ వయ్యును నప
రిచ్ఛిన్నత్వంబువలన మహాత్ముండ వయ్యును నాకాశాదిభూతసమాశ్రయత్వంబు
వలన భూతావాసుండ వయ్యును భూతమయత్వంబువలన భూతశబ్దవాచ్యుండ
వయ్యును గారణాతీతత్వంబువలనఁ బరమాత్ముండ వయ్యును జ్ఞానవిజ్ఞానపరిపూర్ణ
త్వంబు గలిగి నిర్గుణత్వనిర్వికారత్వంబులవలన బ్రహ్మంబ వయ్యును బ్రకృతిప్రవర్త
కత్వంబువలన ననంతశక్తి వై యప్రాకృతుండ వయ్యును గాలచక్రప్రవర్తకత్వం
బువలనఁ గాలుండ వయ్యును గాలశక్తిసమాశ్రయత్వంబువలనం గాలనాభుండ
వయ్యును సృష్టిజీవనసంహారాదిదర్శిత్వంబువలనం గాలావయవసాక్షి వయ్యును
నొప్పునీకు నమస్కరించెద మఱియును. 682

సీ. విశ్వంబు నీవ యై § విశ్వంబుఁ జూచుచు, విశ్వంబు సేయుచు § విశ్వమునకు
హేతువ వై పంచ § భూతమాత్రేంద్రియ, ములకు మనఃప్రాణ § బుద్ధిచిత్త
ములకెల్ల నాత్మ వై § మొనసి గుణంబుల, నావృత మగుచు ని § జాంశభూత

మగునాత్మచయమున । ననుభూతి సేయుచు, మూఁడహంకృతులచేఁ । [1]ముసుఁగువడక
తే. నెఱి ననంతుఁడ వై దర్శ । నీయరుచివి, గాక సూక్ష్ముఁడ వై నిర్వి । కారమహిమఁ
దనరి కూటస్థుఁడన సమ । స్తంబు నెఱుఁగు, నీకు మ్రొక్కెద మాలింపు । నిర్మలాత్మ.

వ. మఱియుఁ గలండు లేఁడు సర్వంబు నెఱుంగు నించుక యెఱుంగు బద్ధుండు
విముక్తుం డొకండ నేకుండు ననునివి మొదలుగాఁ గలవాదంబులు మాయవలన
ననురోధింపుదురు గావున నానావాదానురోధకుండ వయ్యును నభిధానాభిధేయ
శక్తిభేదంబులవలన బహుప్రభావప్రతీతుండ వయ్యును జక్షురాది రూపంబుల
వలనఁ బ్రమాణరూపకుండ వయ్యును నిరపేక్షజ్ఞానంబు కలిమిం గవి వయ్యును
వేదమయనిశ్శ్వాసత్వంబువలన శాస్త్రయోని వయ్యును సంకర్షణవాసుదేవ
ప్రద్యుమ్నానిరుద్ధరూపంబులవలనఁ జతుర్మూర్తి వయ్యును భక్తజనపాలకుండ
వయ్యును నంతఃకరణ ప్రకాశకత్వంబు గలిగి సేవకజన ఫలప్రదానంబుకొఱకు
గుణాచ్ఛాదకుండ వయ్యును జిత్తాదివర్తనంబులఁ గానం దగినగుణంబులకు
సాక్షి వై యొరుల కెఱుంగరామి నగోచరుండ వయ్యును దర్కింప రానిపెంపు
వలన నవ్యాహతవిహారుండ వయ్యును సకలకార్యహేతు వయ్యు నంతఃకరణ
ప్రవర్తకత్వంబువలన హృషీకేశుండ వయ్యును సాధనవశంబు గాని యాత్మారా
మత్వంబువలన ముని వయ్యును స్థూలసూక్ష్మగతుల నెఱుంగుచు నెందుం
జెందక నీవు విశ్వంబు గాకయు విశ్వంబు నీవ యయ్యును విశ్వభావాభావసంద
ర్శనంబు సేయుచు విద్యావిద్యలకు హేతు వయిననీకుం బ్రణామంబు లాచరిం
చెద మవధరింపుము. 684

క. లోకజనిస్థితిలయములు, గైకొని చేయుదువు త్రిగుణ । కలితుఁడ వై శా
లాకారమున నమోఘు, శ్రీకలితుఁడ వగుచు నిచ్చ । సెందక యీశా. 685

క. నీశాంతలు గానితనువు, లీశా యీ మూఢజాతు । లీసజ్జాతుల్
నీ శాంతతనువు లందుఁ బ్ర, కాశింతువు ధర్మహితము । గా సుజనులలోన్. 686

ఉ. నేరము లెన్న నెక్కడివి । నేము దలంచుతలంపులోపలన్
నేరుపు లున్నవే సుతుల । నేరమిఁ దండ్రులు త్రోచి పుచ్చరే
నేరము సేయువారి ధర । ణీపతు లొక్కొకమాటు గావరే
నేరముఁ గల్గుమద్విభుని । నేఁ డిటఁ గావఁ గదే కృపానిధీ. 687

శా. బాలుం డీతఁడు మంచివాఁ డనుచుఁ జె । ప్పన్ రాము క్రూరుండు దు
శ్శీలుండో నవు నైన నేము సుభగ । శ్రీఁ బాసి వైధవ్యదు
ష్టాలంకారముఁ బొంద నోడెద మనా । థాలాప మాలింపవే
చాలున్ నీపదతాండవంబు పతిభి । క్షం బెట్టి రక్షింపవే. 688

ఉ. ఆకుల మయ్యె భోగ మిదె । యౌఁదల లన్నియు వ్రస్సెఁ బ్రాణముల్

1. ముసుఁగఁబడక.

రాకలఁ బోకలన్ బొలిసె § రాయిడి వెట్టక మా నిజేశుపై
నీకరుణాకటాక్షములు § నిల్పఁగదే తగ నో సమస్తలో
కైకశరణ్య యో యభయ § కారణ యో కమలామనోహరా. 689

ఆ. మమ్ముఁ బెండ్లిసేయు § మాప్రాణవల్లభు, ప్రాణ మిచ్చి కావు § భక్తవరద
నీవు సేయుపెండ్లి § నిత్యంబు భద్రంబు, పిన్ననాఁటిపెండ్లి పెండ్లిగాదు. 690

ఇంద్ర. నీయాన యెవ్వారిని § నిగ్రహింపం, డాయుగ్రపాపాకృతి § నండఁ డింకన్
నీయాజ్ఞలో నుండెడు § నేఁటఁగోలెన్, మాయీశు ప్రాణంబులు § మాకునీవే.

వ. అని యిట్లు తమపెనిమిటిఁబ్రదుకఁ గోరెడి భుజగసతులయందు శరణాగతరక్షకుం
డైనపుండరీకాక్షుండు గరుణించి చరణఘట్టనంబు సాలించి తలంగిన నెట్టకేలకుఁ
బ్రాణేంద్రియంబుల మరలం బడసి చదిసి నులిసినతలలు సవరించుకొని [1]వగరు
చుచు భుజగపతి జలజనయనునికి నంజలి సేసి మెల్లన యిట్లనియె. 692

చ. మలఁకలు మాప్రచారములు § మాముఖముల్ విషవహ్నిఘోరముల్
ఖలులము రోషజాతులము § గర్వుల మే మొకమంచివారమే
నలినదళాక్ష ప్రాణులకు § నైజగుణంబులు మాన నేర్చునే
వెలయవె మావికారములు § వింతలె మే లొనరించి తీశ్వరా. 693

సీ. వివిధభావాకార § వీర్యబీజాశయ, జవయోనియుతముగా § జగము లెల్ల
నీవచేసితి మున్న § నే మాజగంబులో, సహజకోపనులము § సర్పములము
దుర్వార మైననీ § తోరంపుమాయ నే, మెఱిఁగి దాఁటెడుపని § కెంతవార
మంతకుఁ గారణ § మఖిలేశ్వరుండవు, సర్వజ్ఞుఁడవు నీవు § జలజనయన

తే. మనిచెదేనిని మన్నించి § మనుపు నన్ను, నిగ్రహించెదవేనిని § నిగ్రహింపు
మింకసర్వేశ మాయిమ్ము § లెందుఁగలవు, చిత్తమందున్న క్రమమునఁ § జేయఁదగును.

క. నాపుణ్య మేమి సెప్పుదు, నీ పాదరజంబుఁ గంటి § నే సనకాదుల్
నీపాదరజముఁ గోరుదు, రేపదమం దున్న నైన § నిఁక మేలు హరీ. 695

వ. అని విన్నవించినఁ గాళియుపలుకులు విన నవధరించి కారుణ్యమానసుం డయిన
సర్వేశ్వరుం డతని కిట్లనియె. 696

క. గోవర్గముతో మనుజులు, ద్రావుదు రీమడుఁగునీరు § దగ దిం దుండన్
నీవును నీబాంధవులును, నీవనితలు సుతులుఁ జనుఁడు § నేఁ డంబుధికిన్. 697

క. నిను నే శాసించినకథ, మనమునఁ జింతించి రేపు § మాపును గీర్తిం
చినమనుజులు మీ భయమున, వినుమెన్నఁడుఁ బొంద రెందు § విషవిజయముతోన్.

చ. ఇది మొద లెవ్వరైన నరు § లీ యమునాతటినీ హ్రదంబులో
వదలక తోఁగి నన్ను నుప § వాసముతోడఁ దలంచి కొల్చుచుం
గదలక దేవతాదులకుఁ § గా జలతర్పణ మాచరించినన్

1. వగరుపుచ్చుచు.

సదమలచిత్తు లై దురిత § సంఘముఁ బాయుదు రాక్షణంబునన్. 699

ఆ. గరుడభీతి రమణ § కద్వీప మెల్ల కీ, మడువుఁ జొచ్చి తీవు § మత్పదాబ్జ
లాంఛనములు నీ త § లల నుంటఁ జూచి యా, పక్షిరాజు నిన్నుఁ § బట్టఁ డింక. 700

వ. అని యిట్లు విచిత్రవిహారుం డైన గోపాలకృష్ణకుమారుం డాన తిచ్చిన నియ్య
కొని చయ్యన నయ్యహీంద్రుండు దొయ్యలులుం దానును నెయ్యంబున నయ్యీ
శ్వరునకు నవ్యదివ్యాంబరాభరణరత్నమాలికానులేపనంబులు సమర్పించి తేఁటి
తండంబులకు దండ యగునీలోత్పలంబులదండ యిచ్చి పుత్త్రమిత్రకళత్రసమేతుం డై
బహువారంబులు గైవారంబుసేసి వలగొని మ్రొక్కి లేచి వీడ్కొని రత్నా
కరద్వీపంబునకుం జనియె నిట్లు. 701

క. వారిజలోచనుఁ డెవ్వరు; వారింపఁగ లేనిఫణిని § వాసత్వంబుల్
వారించిన యమున సుధా, వారిం బొలుపారె నెల్ల § వారికిఁ బ్రియ మై. 702

కాళియునిపూర్వకథ.

వ. అనిన విని మునీంద్రా యేకారణంబునఁ గాళియుండు భుజగనివాసం బయిన
రమణకద్వీపంబు విడిచె నతం డొక్కరుండును గరుడున కేమి దప్పఁ దలంచె
నని నరవరుం డడిగిన మునివరుం డి ట్లనియె. 703

సీ. సర్పభీరువు లైన § జను లెల్ల నెలనెల, సరసభక్ష్యములు వృ § క్షంబు మొదల
సర్పంబులకుఁ బెట్ట § సర్పంబులును మును, సర్పాంతకుఁడు దమ్ముఁ § జంప కుండఁ
బ్రతిమాసమును దమ § భాగభక్ష్యంబు లా, పక్షిరాజున కిచ్చి § బ్రదుకు చుండ
విషవీర్యదుర్మదా § విష్టుఁ డై కాళియుఁ, డహికులాంతకు[1]నిహా § లపహరించి

తే. యాక తనపాలిబలిభాగ § మెల్లఁ దినిన, విని ఖగేంద్రుఁడు కోపించి § వీనితలలు
సీరి చెండాడి భోగంబు § చించివైచి, ప్రాణములఁ బాపి వచ్చెదఁ § బట్టి యనుచు.

క. అక్షీణకనకసన్నిభ, పక్షయుగోద్భూతఘోర § పవమానమహా
విక్షేపకంపితానే, కక్షోణిధరేంద్రుఁ డగుచు § గరుడుఁడు వచ్చెన్. 705

ఉ. వచ్చినసర్పవైరిఁ గని § వ్రాలక లేచి మహాఫణావళుల్
విచ్చి దృగంచలంబుల న § వీనవిషాగ్నికణంబు లొల్కఁగా
నుచ్చలదుగ్రజిహ్వలు ము § హోద్ధతిఁ ద్రిప్పుచు నూర్పులందుఁ గా
ర్చిచ్చెగయంగఁ బాఱి కఱ § చెన్ విహగేంద్రు నహీంద్రుఁ డుగ్రతన్. 706

క. కఱచినభుజగము రదములు, విఱుగఁగ వదనముల విషము § వెడలఁగ శిరముల్
పఱియలుగ నడిచె గరుడుఁడు, తఱిమి కనకరుచులు గలుగు § తనడాఱెక్కన్. 707

వ. ఇట్లహికులారాతిచేత వ్రేటువడి వెఱచి పఱతెంచి కాళియుం డీ గభీరం బయిన
మడుఁగుఁ జొచ్చె మఱియు నొక్కవిశేషంబు గలదు. 708

సీ. మున్ను సౌభరి యను § ముని యాహ్రదంబునఁ, దపము సేయుచు నుండ § ధరణిలోన

1. ఁ జాలఁ నపహసించి,

నాఁకలిగొని పన్నగాంతకుఁ డొకనాఁడు, సనుదెంచి యందుల జలచరేంద్రు
నొడిసి భక్షించిన నున్నమీనము లెల్ల, ఖిన్నంబు లై వగఁ గ్రిస్సి యున్న
జూచి యామునిరాజు శోకించి కోపించి, గరుడుఁడు నేఁ డాది గాఁగ నిందుఁ

తే. జొచ్చి మీనంబులను మ్రింగఁ జూచె నేనిఁ
జచ్చుఁ గావుత మని యుగ్ర శాప మిచ్చెఁ
గాళియుం డొక్కఁ డా శాప కథ యెఱుంగు
నితరభుజగంబు లెవ్వియు నెఱుఁగ వధిప. 709

వ. అది కారణంబుగాఁ గాళియుం డీమడుఁగుఁ జొచ్చియున్న గోమనుజరక్షణార్థంబు కృష్ణుం డతని వెడలించె నిట్లు దివ్యగంధాంబరసువర్ణమణిగణమాలికాలంకృతుం డై మడుఁగు వెడలి వచ్చినమాధవుం గని ప్రాణలాభంబులం బొందినయింద్రియంబులుంబోలె యశోదారోహిణీసమేత లయినగోపికలును నందసునందాదు లైన గోపకులును మూర్ఛలం బాసి తేఱి తెప్పిఱి లేచి పరమానందంబునం బొందిరి బలభద్రుండు తమ్ముని నాలింగనంబు సేసె నప్పుడు. 710

క. అంకెలు వైచె వృషభము ల, హంకారముతోడ లేఁగ లట్టిట్టుఱికెన్
బొంకముల నొప్పె ధేనువు, లంకురితము లయ్యెఁ దరువు లాహరి రాకన్. 711

క. నీసుతుఁ డహిచే విడివడె, నీసురుచిరభాగ్యమహిమ నిశ్చల మనుచున్
[1]భూసురులు సతులుఁ బారును, భాసురవచనముల నందుఁ బలికి రిలేశా. 712

శా. ని న్నా యుగ్రభుజంగమంబు గఱవన్ నీ వాపదం బొందుచున్
న న్నేమంటి తనూజ యోడవు గదా నాకూన నాతండ్రి రా
వన్నా యంచు శిరంబు మూర్కొని నిజాంకాగ్రంబుపై సిల్పుచుం
గన్నీ రొల్కఁగఁ గౌఁగిలించెఁ దనయున్ గారాముతోఁ దల్లి దాన్. 713

వ. ఇట్లు పరమసంతోషు లై ఘోషజను లారేయి కాళిందీతటంబున నాఁకలినీరువట్టుల డస్సి క్రుస్సి గోవులుం దారు నుండ నగణ్యం బగునయ్యరణ్యంబున నొక్కదవానలంబు పుట్టి చుట్టు ముట్టికొని నడురేయి నిద్రితం బైనవ్రజంబుమీఁదఁ గదిసిన నదిరిపడి లేచి దందహ్యమానదేహు లయి సకలజనులును మాయామనుజబాలకుం డైనహరికి శరణాగతు లై యి ట్లనిరి. 714

గోగోపగోపికాసంఘమును గార్చిచ్చు చుట్టుకొనుట.

మ. అదె వచ్చెన్ దవవహ్ని ధూమకణకీలాభీలదుర్వార మై
యిదె కప్పెన్ మము నెల్లవారి నిట మీఁ దేలాగు రక్షింపు నీ
పదపద్మంబుల కాని యొం డెఱుఁగ మో పద్మాక్ష యోకృష్ణ మ్రొ
క్కెద మోరామ మహాపరాక్రమ దవాగ్నిన్ వేగ వారింపవే. 715

క. నీపాదంబులు నమ్మిన, నాపద లెక్కడివి జనుల కత్యుగ్రమహా

1. భూసురులును ఖేచరులును,

దీపితదావజ్వలనము, నైపడ కుండెడివిధంబు ♦ భావింపఁ గదే. 716

వ. అని ఘోషించుఘోషజనులం గరుణించి జగదీశ్వరుం డగునసంతుం డనంతశక్తియుక్తుం డై గహనంబు నిండినదావదహనంబు పానంబు సేసిన విజయగానంబు దశదిశల నిగిడె నంతం గృష్ణుండు గోగణజ్ఞాతిసమేతుం డై మందయానంబున మందకు వచ్చె నిట్లు రామకేశవులు గోపాలబాలవేషంబులం గ్రీడించుసమయంబున. 717

## గ్రీష్మర్తువర్ణనము.

సీ. దినము లంతంతకు ♦ దీర్ఘంబు లై తోఁచె, దిననాథుఁ డుత్తర ♦ దిశఁ జరించె
నాఁటినాఁటికి నెండ ♦ నవ్య మై ఖర మయ్యె, వెచ్చనిగాడ్పులు ♦ విసరఁజొచ్చె
మేదినీరేణువుల్ ♦ మింట సంకుల మయ్యె, నేఱులుఁ గొలఁకులు ♦ నిగిరిపోయెఁ
బానీయశాలలఁ ♦ బథికసంఘము నిల్చెఁ, జప్పరంబుల భోగి♦చయము డాఁగెఁ

ఆ. దరులు లతలుఁ గుసుమ♦దళములతో వాడె, మిథునకోటికి రతి ♦ మెండు దోఁచె
నఖిలజంతుభీష్మ ♦ మైనగ్రీష్మపురాకఁ, గీలి యడవులందుఁ ♦ గేలి సలిపె. 718

ఆ. వాఁడిరుచులు గలుగు♦వానివేఁడిమి గ్రీష్మ,కాలమందు జగము ♦ గలయఁబడియె
బ్రహ్మజనులకొఱకు ♦ బ్రహ్మాండఘటమున, యుష్ణరసముఁ దెచ్చి ♦ యునిచె ననఁగ.

వ. ఇట్లాభీలం బయిననిదాఘకాలంబు వర్తింప బృందావనంబు రామగోవిందమందిరం బైనకతంబున నిదాఘకాలలక్షణంబులం బాసి నిరంతరగిరినిపతితనిర్ఝరశీకరపరంపరాభాసితపల్లవితకుసుమితతరులతం బయ్యును దరులతాకుసుమపరిమళమిళితమృదులపవనం బయ్యును బవన చలితకమలకహ్లారసరోవరమహాగభీరనదీహ్రదం బయ్యును నదీహ్రదకల్లోలకంకణప్రభూతపంకం బయ్యును బంకసంజనితహరితాయమానతృణనికుంజం బయ్యును జనమనోరంజనం బై వసంతకాలలక్షణంబులు గలిగి లలితమృగపక్షిశోభితం బయి యొప్పుచుండె మఱియు నందు.

క. పికములకోలాహలమును, శుకసంఘముకలకలంబు ♦ సుభగమయూర
ప్రకరముకేకారవ మళి,నికరముఁరొదయును జెలంగె ♦ నెఱి నయ్యడవిన్. 721

క. ఆతతయమునాసరసీ, జాతతరంగాభిషిక్త ♦ జలరుహగంధో
పేతానిల [1]మడఁచె నిదా,ఘాతతదావాగ్నిపీడ ♦ నవ్వనమందున్. 722

వ. ఇట్లామనికందువ తెఱంగు గల్గి సుందరం బైనబృందావనంబునకు బలకృష్ణులు గోవుల రొప్పికొని చని గోపకులుం దారును నొండొరులతో నగుచుఁ దెగడుచుఁ జెలంగుచుఁ దలంగుచు జిఱజిఱం దిరుగుచుఁ దరులసందుల కరుగుచు డాఁగిలిమూఁత లాడుచు గీతంబులు వాడుచు వేణునాదంబులు ఘటియించుచు నటియించుచు గతులు దప్పినక్రియ నొఱగుచుఁ గుప్పల కుఱుకుచుఁ జప్పటలు గొట్టుచుఁ గందుకంబులఁ దట్టుచు నుప్పరం బెగసి దర్దురంబులచందంబున దాఁ

1. మడఁగంగ ని, రాతపదావాగ్ని యయ్యె ♦ నవ్వన మెల్లన్.

టుచు నామలకబిల్వాదిఫలంబుల మీటుచుఁ గుటవిటపంబులఁ గదల్చుచు మృగంబుల నదల్చుచుఁ బెరల రేఁపుచు మధుమక్షికలఁ జోఁపుచుఁ దేనియలు ద్రావుచు సొమ్ములు వోవుచు గురుశిష్యకల్పనంబులం బనులు సేయుచుఁ గాక పక్షధరు లై ముష్టియుద్ధంబులకు డాయుచుఁ బన్నిదంబులు సఱచుచుఁ బులుఁగులభంగి నఱచుచు బహురూపంబులు వన్నుచు నెగిరి తన్నుచు సేవ్యసేవక మిత్రామిత్రభావంబులు వహించుచు నుత్సహించుచు మఱియు ననేకవిధంబులఁ గ్రీడించి రందు. 723

క. పూపాలికి బలకృష్ణులు, భూపాలకు లంచు నెగిరి ϟ బొబ్బ లిడుచు న
గోపాలురు మోతురు ప్రమ, దాపాదకు లగుచు వల్లి ϟ కాందోళికలన్. 724

క. గోపకు లందఱు నాడుచు, దీపింపఁగ రామవాసు ϟ దేవుల వెనుకం
బై పడి పాఠకగాయక, రూపంబులఁ బొగడుదురు ని ϟ రూఢాత్మకు లై. 725

క. ప్రీతిన్ గోపకు లందఱు, గీతంబులు వాడఁ దరుల ϟ క్రిందను నగుచుం
జేతులు ద్రిప్పుచు వెడవెడ, పాతర లాడును యశోద ϟ పాపం డడవిన్. 726

మ. జలజాక్షుండును రాముఁడున్ నటనముల్ ϟ సల్పంగ గోపాలమూ
ర్తులతో వారలఁ గొల్చునిర్జరులు సం ϟ తోషించి వేణుస్వనం
బులు గావించుచుఁ గొమ్ము లూఁదుచు శిరం ϟ బుల్ ద్రిప్పుచుం బాడుచున్
వల నొప్పన్ వినుతించి రప్పుడు నటుల్ ϟ వర్ణించుచందంబునన్. 727

బలభద్రుండు ప్రలంబాసురుని వధించుట.

వ. ఇట్లు రామకృష్ణులు నదనదీతీరంబులఁ గొలంకులసమీపంబుల గిరులచేరువల సెలయేఱులకడల మడుఁగులపొదరులపొంతలఁ బసిమి గల కసవుజొంపంబులఁ బసుల మేపుచుండఁ బ్రలంబుం డనురక్కసుం డుక్కు మిగిలి గోపాల రూపంబున వచ్చి వారల హింస చేయం దలంచుచుండ నయ్యఖిలదర్శనుం డగు సుదర్శనధరుం డెఱింగియు నెఱుంగనితెఱంగున. 728

క. ఆరామునిసహజన్ముఁడు, రా ర మ్మని వానిఁ జీరి ϟ రాకం బోకన్
గారాము సేసి మెల్లన, పోరామి యొనర్చెఁ బిదపఁ ϟ బోరిగొనుకొఱకున్. 729

వ. ఇట్లు ప్రలంబునితోఁ జెలిమి సేయుచుఁ గృష్ణుండు గోపాలకులతో ని ట్లనియె. 730

ఆ. మనకుఁ బ్రొద్దువోదు ϟ మనమిందఱము రెండు, గములవారమగుచుఁ ϟ గందుకముల
శిలల గుఱులు సేసి ϟ చేరి క్రీడింతము, రండు వలయు జయ ప ϟ రాజయములు.

వ. అని యిట్లు వలికి తానును బలభద్రుండును బెన్నుద్దు లై యితరవల్లవు లెల్ల నుద్దించుకొని చిట్టుద్దు లై వచ్చినసమయంబున విభజించుకొని రెండుగము లై మార్గంబులందుఁ దృణదారుశిలాకల్పితంబు లగు గుఱు లొడ్డి కందుకశిలాది ప్రక్షేపణంబుల లక్ష్యంబులఁ దాఁక వైచి జయపరాజయనిర్ణయంబులు గైకొని వాహ్యవాహకలక్షణంబుల నిర్జితులు జేతల వహించి క్రీడించుచు బలరామునికి

వానిచందంబు రహస్యంబున నెఱింగించి పసుల వెల్చుచు భాండీరకం బను వటంబు సేరి రా (సమయంబునఁ) గ్రీడయందుఁ బిదప శ్రీదామనామధేయుం డైనగోపకుండు శ్రీకృష్ణుని వహించె భద్రసేనుండు వృషభు నెక్కించుకొనియె బలభద్రుండు ప్రలంబు నారోహించె నప్పుడు. 732

మ. వనజాక్షుల్ బలిమిన్ బలాఢ్యుఁడు దృణా § వర్తుండు మున్ మింటికిం గొని పోఁ జాలక చిక్కె నా డితని నా § కున్ మోవ రా దంచు నా దనుజారిన్ గొనిపోఁ దలంపక వడిన్ § దైత్యేశుఁ డయ్యాటలోఁ గొని పోయెన్ [1]గెలు దాఁటి రాము నఖల § క్రూర క్షమోద్దాముని౯. 733

వ. ఇట్లు క్రీడాకల్పితవాహనుం డైన ప్రలంబుండు బలభద్రునిం గొనిపోవుచు. 734

మ. గురుశైలేంద్రసమానభారుఁ డగునా § గోపాలకున్ మోవ లే క రయోద్రేకము మాని దైత్యుఁడు నరా § కారంబు సాలించి భీ కరదైత్యాకృతి నేఁగె హేమకటకా § కల్పంబుతో రాముతో మురు వొప్పంగ, దటిల్ల తేందుయుతజీ § మూతంబు చందంబున౯. 735

ఉ. మోసము లేక వానిపెను § మూఁపున నుండుచు నాహలాయుధుం డాసమయంబునం గనియె § హాటకరత్నకిరీటకుండలో ద్భాసితము స్తకున్ భ్రుకుటి § భాగురుదారుణనేత్రు నుగ్రదం ష్ట్రాసహితుం బ్రలంబు నురు § శౌర్యవిలంబు మదావలంబుని౯. 736

వ. కని నక్తంచరుం డని యెంచుక శంకించి వెఱవక. 737

క. కడువడిఁ దను [2]దివికిం గొని, వడిఁ జనియెడు దనుజశిరము § వ్రయ్య హలధరుం డడరి పటుచటులతర ముగు, పిడికిట వెస విసరి పొడిచె § బిఱుసున నలుక౯. 738

క. హలధరుబలుపిడికిటిపాటిఁ, దల వగిలిన రుధిరజలము § దనువివరములం దొలఁక మొఱ యిడుచు దనుజుఁడు, బలరిపుపవినిహతనగము § పగిదింబడియె౯.

మత్తకోకిలము. మేలు మేలు గదయ్య రాముఁడు § మేటిరక్కసు నొక్కడున్ నేలఁ గూలిచె నొక్కపోటున § నేఁడు విస్మయ మంచు గో పాలకుల్ గని చచ్చి వచ్చిన § భ్రాతఁ గన్నవిధంబునం జాల దీవన లిచ్చి రాముని § సత్కరించిరి వేడుక౯. 740

క. బలవంతుఁ డగు ప్రలంబుఁడు, బలుముష్టిన్ నిహతుఁ డైన § బ్రదికితి మనుచున్ బలసూదనాదిదివిజులు, బలుపైఁ గుసుమములవానఁ § బరఁగించి రొగి౯. 741

శ్రీకృష్ణుండు దావాగ్నిని మ్రింగి గోపకగోసంఘమును గాపాడుట.

వ. అట్లు గోపకులు క్రీడింప గోవు లంతంతఁ గాంతారంబున వింతకసవులు మెస వుచు మేఁతవడి నొండడవికి దూరంబు సని యందు దవదహనపవనసంస్ప ర్శంబు సైరింపక కంపించి దప్పి నొప్పి సెడి ఘోషించిన. 742

1. గెఱి. 2. దివిఁ గొనిచనియెడి...ఖగుల నెగిరి హల.

శా. ఆగోపాలకు లందఱుం బసుల కు య్యాలించి కౌమారకే
ళీగాఢత్వము మాని [1]గోఖురరదా ళిచ్ఛిన్నఘాసంబుతో
బాగై యున్నపథంబునం జని దవా పన్నంబు గా కుండ వే
వేగన్ గోగణముల్ మరల్చి రటవీ వీథిన్ జవం బొప్పఁగన్. 743

క. జలధరగభీరరవమున, నలినదళాక్షుండు దమ్ము నామాంకములం
బిలిచిన విని ప్రతిఘోషణ,ములు సేయుచుఁ బసులు దిరిగె ముదమున నధిపా.

వ. అంత నవ్వనంబున దైవయోగంబునం గార్చిచ్చు పుట్టి బిట్టు విసరెడికరువలి వలన మిన్ను ముట్టం మిట్టిపడి గట్టు చెట్టనక దరికొని పట్టి క్రాలుచుఁ జుట్టుకొని (పరవం) గని పల్లటిల్లినయుల్లంబులతో వల్లవు లెల్లఁ దల్లడిల్లి సబలుం డైన హరికి మృత్యుభీతులరీతిం జక్క మ్రొక్కి యి ట్లనిరి. 745

క. అభ్రంకషధూమాయిత, విభ్రాంతమహాస్ఫులింగ విసరోగ్రశిఖా
విభ్రష్టదగ్ధలోకా,దభ్రం బై వచ్చెఁ జూడు దవశిఖి కృష్ణా. 746

శా. నీచుట్టాలకు నాపదల్ గలుగునే నే మెల్ల నీవార మ
న్యాచారంబు లెఱుంగ మీశుఁడవు మా కాభీలదావాగ్ని నేఁ
డే చందంబున నింక దాఁటుదుము మ మ్మీక్షించి రక్షింప వ
న్నా చంద్రాభ విపన్నులన్ శిఖవితా నచ్ఛన్నులన్ ఖిన్నులన్. 747

వ. అని మఱియును. 748

ఉ. బంధుజనంబుచేత నిటు ప్రార్థితుఁ డై హరి విశ్వరూపుఁడో
బంధువులార మీనయన పంకజముల్ ముకుళింపుఁ డగ్ని నీ
సంధి నడంతు నే ననినఁ జక్కన వార లట్ల చేయుదుర్
బంధురదావపావకముఁ బట్టి ముఖంబునఁ ద్రావె లీలతోన్. 749

వ. ఇట్లు నిజయోగవైభవంబున దావదహనంబు పానంబు సేసి నిమిషమాత్రంబున గోపకుల నందఱ భాండీరకవటవిటపిసమీపంబునకుం దెచ్చి విడిచిన వారు వికసితనయనకమలు లయి కృష్ణునియోగమాయాప్రభావంబున నెరగలిచిచ్చువ్రగ్గె నని యగ్గించుచుఁ దమమనంబులందు. 750

క. కార్చిచ్చార్చుపటుత్వము, నేర్చునె నరుఁ డొకఁడు శౌరి నేఁ డిదె కార్చి
చ్చార్చి మనల రక్షింపఁగ, నేర్చె నితం డజుఁడొ హరియొ నిటలాక్షుండో.

వ. అని వితర్కించి రంతఁ గృష్ణుండు సాయాహ్నసమయంబున రామసహితుం డై వంశనాళంబు పూరించుచు గోపగణజేగీయమానుం డై గోష్ఠంబు ప్రవేశించె నప్పుడు. 752

క. కమలాక్షుఁ డొద్ద నుండని, నిమిషము యుగశతము గాఁగ నెగడినగోప
ప్రమదలు సంభ్రమమున నా,కమలాక్షునిఁ జూచి ముదము గైకొని రధిపా.

---

1. గోఖురపుటాళి.

వ. ఆ సమయంబున గోపకు లిండ్లకడ నున్నవృద్ధకాంతాజనంబులకు రామకృష్ణుల చిత్రచరిత్రంబులు సెప్పిన విని వారు వారిని గార్యార్థులై వచ్చిన వియచ్చర వరు లని తలంచి రంత. 754

## వర్షర్తువర్ణనము

సీ. పూర్వవాయువులు ప్రభూతంబులై వీచెఁ, బడమట నింద్రచాపంబు దోఁచెఁ
బరివేషయుక్తమై భానుమండల మొప్పె, మెఱపు లుత్తరదిశ మెఱవఁదొడఁగె
దక్షిణగాములై తనరె మేఘంబులు, జలచరానీకంబు సంతసించెఁ
జాతకంబులపిపా సలు కడపలఁ జేరెఁ, గాంతారవహ్నుల గర్వ మడఁగె

ఆ. నిజకరాళివలన నీరజబంధుండు, ద్రొల్లి పుచ్చుకొన్న తోయ మెల్ల
మరల నిచ్చుచుండె మహికర్షకానంద,కంద మైనవాన కందువందు. 755

క. వర్షాకాలభుజంగుఁడు, హర్షముతో నిడిన నవన ఖాంకము లని యు
త్కర్షింప భూమిసతిపైఁ, గర్షకహలరేఖ లమరె గహనాంతమునన్. 756

క. చెలువుఁడు ప్రావృట్కాలుఁడు, పొలసినఁ బులకించుభూమి పులకము లనఁగా
మొలచి తల లెత్తి నిక్కుచు, సలలితగతి జాలు వాఱె సస్యము లధిపా. 757

వ. మఱియుఁ జటులపవనచలితంబులై పన్ని మిన్ను దన్ని లెక్కకు మిక్కిలి యై తెక్కలు గలనీలగిరులసిరుల మీఱి కాఱుకొని తెఱపిపడక నిబిడంబులై శిశిరకిరణతరణిమండలంబులచొప్పు దప్పించి విప్పు గలిగి చదలు గప్పుకొనిన (లీలం గ్రాలు) నీలమేఘంబులును మేఘవిముక్తంబు లయి జలదసమయవిటుండు సరసగతి ధరణిసతియురువున దర్పించి నేర్పున సమర్పించుకర్పూరఖండంబులవడువునఁ బుడమిం బడుకరకలును గరకానుగతంబులై యసితభోగిభోగంబులబాగున నీలమణిమాలికావిశేషంబులవిధంబున నెడపడక పడుసలిలధారలును ధారాధరవిగళితవిమలసలిలంబులం దోఁగుచు మదజలాభిషిక్తమత్తమాతంగంబుల సొబగున నుండుకొండలును గొండలతుదలనుండి గండశైలంబులపైఁ బడి వికీర్యమాణంబు లగుగిరినిర్ఝరంబులశీకరంబులును శీకరపరంపరలచొదుకులు మదుకులు గొనినఁ బిదపిద నగుచుఁ జిదుకుచిదుకు మను రొంపులును రొంపులు ద్రొచ్చి క్రచ్చఱ నుచ్చలితంబులై పఱచువఱదలును వఱదలవలన మొదలికదలి పాఱెడియేఱులును నేఱులవెంట గఱులు ద్రిప్పుచు గములు గొని క్రొన్నీటి కెదురునడచు మీనంబులును మీననయనల మేనులమెఱుంగు సొంపుపెంపు సైరింపక కంపించి తిరిగి సురిఁగి చనియెడికరణి మేఘమధ్యంబులం బొలసి మలసి నిలువక మరలి చనుక్రొమ్మెఱుంగులు మెఱుంగులపగిది మగువలు పురుషులం దగిలి నిలువ రని జనుల కెఱుంగ నలువ మొఱ యిడినతెఱంగున మొరయు నుఱుములును నుఱుముల కులికిపడక కికురుపొడుచుచుఁ బించెంబులు గొంచెంబులు సేయక విప్పి దెప్పరంబుగ రొపఁచు నర్తనంబులు సలుపుమయూరంబు

లును మయూరఘోషంబులు భీషణంబులై చెవులు సోఁకిన ననూనంబులైనమా
నంబుల నాసలు సెడి యొండొరులకుఁ గ్రిందుపడి క్రందుకొనువిరహిజనులును
జనులకు మాపు రేపని నిరూపింపరాక మాలతీకుసుమవిసరవికసనవిదితావసా
నంబు లగుదుర్దినంబులునుం దినావసానసమయంబున మినుకు మినుకు మని మెఱ
చుచుం దిరుగుఖద్యోతంబులును ఖద్యోతసందర్శనంబు గోరుచు నుడుగక
విడువక కురియుజడిం బడి వలిగొని వడఁకుచు నశనయత్నంబులు వర్జించి
ఖర్జూర జంబూ ఫలభక్షణంబుల దేహసంరక్షణంబు నాచరించువనచరులును
వనచరానందకారిణులై వారరమణులరుచి ననవరతభుజగసమేత లగుకేత
కులును కేతకీకదంబయూథికాకుటజకుసుమపరిమళమిళితంబు లగువిపినమా
ర్గంబులును మార్గనిరోధంబు లగుచుం బెరిఁగి రసికంబులై పసరు దొలం
కుచు [1]హరిన్మణికిరణపుంజంబులభంగి రంజిల్లి తొంగలించుచు జొంపంబులు
గొనినకసవులును కసవులు మెసవి మిసమిసం దనువులు మెఱవ పలుఁదపొదుఁ
గులబరువులం గదలక నిలిచి నెమ రమర నిడుధేనువులును గలిగి ధేనువ్రజంబు
కైవడిం బయఃకణమనోహరంబై హరకరంబుభంగిం బరిపూర్ణసారంగభాసురం
బై సురగిరిచెలువున హరిశరాసనవిభీషణంబై విభీషణహృదయంబుపోలికం బ్రక
టితహరిశబ్దవైభవంబై భవపూజనంబుచందంబున సంద్రగోపాదివిభవజనకంబై
జనకయాగంబుభాతి సీతాప్రకరణాలంకృతంబై కృతయుగంబుసొంపున బహు
వర్షంబునై వర్షాగమంబు [2]చెలువొందె నప్పుడు. 758

క. వాడక వ్రాలక తెవులులఁ, గూడక తగ నల్ల [3]గెఱలు § గొని నవకములై
చూడఁగ భద్రము లగుచును, వీడెఁ సస్యంబు లిడుమ § వీడెం బ్రజకున్. 759

క. జీవనము సాలఁ గలిగియుఁ, గావరమున మిట్టిపడని § ఘనునిక్రియ నదీ
జీవనములు సొర జలనిధి, ప్రావృట్కాలమున డిందు § పడి యుండె నృపా. 760

శా. ఆ వర్షాగమమందు గోవుల నర § ణ్యాంతంబులన్ మేపుచున్
గోవిందుండు ప్రలంబవైరియుతుఁడై § గోపాలవర్గంబుతోఁ
బ్రావీణ్యంబునఁ గందమూలఫలముల్ § భక్షించుచున్ మంజుల
గ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్ది గుడిచెం § గాసారతీరంబులన్. 761

వ. ఆ సమయంబున. 762

సీ. విశ్వమోహన మైన § వేణునినాదంబు, సరసగంభీరగ § ర్జనము గాఁగ
మహనీయనిర్మల § మందహాసద్యుతి, లలితసౌదామనీ § లతిక గాఁగఁ
దలచుట్టు బాగుగఁ § దనరుపింఛపుదండ, శైలభేదనశరా § సనము గాఁగఁ
గరుణాకటాక్షవీ § క్షణసుధావర్షంబు, సలిలధారాప్రవ § ర్షంబు గాఁగఁ
తే. జాడ నేతెంచుగోపాల § జనమునీంద్ర, చాతకంబులదురవస్థ § సక్కఁజేసి

1. 'పద్మరాగమణి' వ్రా. ప్ర. 2. వచ్చె నప్పుడు. 3. నల్లనిరులు_నల్లయిరులు.

కృష్ణమేఘంబు బహుతర । కీర్తి నొప్పె, విమలబృందావనాకాశ । వీథియందు. 763

క. గోవుల వృషవత్సంబుల, వావిరిఁ బూజించి పిదప । వర్షాకాల
శ్రీవనితను బూజించెను, శ్రీవల్లభుఁ డయ్యె గోప । శేఖరు డధిపా 764

వ. ఇట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబు పుచ్చె నంత. 765

### శరదృతువర్ణనము.

క. జొంపములు గొనియె వనములు, రొంపులిగిరె నెమిలిగములు । రొద లుడిగెనదుల్
పెంపులకుఁ బాసె నుఱుములు, శంపలసంపదలు మానె । శారదవేళన్. 766

వ. మఱియు జీవనంబులు విడిచి విమలజ్ఞానవశంబున విముక్తు లగు పురుషరత్నంబులఁ జెన్నున [1]నన్ను వదలి మిన్ను విడిచి వాయువశంబు లై వెల్లివిరిసి చనుమేఘంబులును మేఘపటలరహితంబును గలశభవమునిసహితంబును నై విజ్ఞానదీపవిలసితం బగుయోగిహృదయంబుచందంబున శుభం బయిన నభంబును నభంబుననీలదుకూలవితానసంయుక్తముక్తాఫలంబులవడువున నెగడునుడుగణంబులును నుడుగణమయూఖంబు క్రొవ్వు లువ్వెత్తుగొని నివ్వటిల్లుచు బ్రహ్మాండకరండకర్పూరఖండాయమానంబు లగుచంద్రకిరణంబులును జంద్రకిరణసంస్పర్శనంబున సగర్భంబు లై భూమికి దుర్భరంబు లగుచు నిండి పండి హాలికకరనిశితలవిత్రధారాసంరంభంబుఁ దలంచి తల్లడిల్లి వెలువెలుకం బాఱుచుఁ దల్లి యగువిశ్వంభరకు మును గలుగ ప్రణతంబు లై వడంకుచు నెఱిఁగ మొఱ యిడుచున్న పెంపున సంపన్నంబు లయినయెన్నులప్రేఁగున వ్రాలి గాలిం దూలుచు మర్మరధ్వనుల సారస్యంబు లగుకలమాదిసస్యంబులును సస్యకమంజరీపుంజంబులఁ గొంజకచంచువులఁ ద్రుంచి కబళించి పిల్లపెంటితండంబులం గూడి కడుపులు నిండ మెక్కి విక్కవిరిసి చొక్కుచుఁ ద్రిక్కులు గొని మహోత్తుంగసమంచితమంచప్రదేశంబు లెక్కి సంచరించుచు వెన్నులకావలి యున్నయన్నులకెమ్మోవులు బింబఫలంబు లని కఱచి తత్కరాస్ఫాలనంబుల నులికిపడి యెగసి చనుశుకనికరంబులకలకలంబులును గలహంసకోకసారసకోలాహలమండితంబు లై నిండి నిర్మలజలంబులు గలజలాశయంబులును జలాశయంబులజలంబు లనుదినంబు నిగురగృహంబుల బ్రదుకుదినంబులు సనుట యెఱుంగనిమనుజులగమనికం దిరుగుజలచరంబులును జలచరహృదయంబుల బెదరు గదుర డొంకి యింకిననదులును నదులందుఁ గర్పూరమండపంబుల తెఱంగున మణికుట్టిమంబులమాడ్కిని సౌధసోపానమార్గంబులజాడను విలోకితంబు లగునూతనసైకతంబులును సైకతప్రదేశంబుల నుదయవేళల నిత్యకర్మానుష్ఠాననిరతు లగుమునులును మునికన్యకాకరకలశసలిలాభిషిక్తమూలంబు లగుతపోవనబాలరసాలసాలంబులును సాలవిటపివాసంతికాకుంజపుంజంబులతఱుచున నిఱుముకొని దినకరకిరణంబులకుం గరువలికిం

1. నన్నువ-పన్ను-వదలి.

జొర వెరవుపడనివనమ్ములునువనమ్ములం దరులకొమ్మల నాకలములు నేకలమ్ములై
మెసంగి మసరుకవిసి క్రొవ్వి కొమ్ములకొనల నూటి నేటిదరులు త్రవ్వి చిమ్మి
కుమ్మి కోరాడెడివనగజంబులును గజకుంభకనకకుంభరుచిరకుచభారభీరుమధ్య
సమంచిత లగుచెంచితలును జెంచితలకూర్మి రమ్ము లగుపాఱమ్ముల సారమ్ములు సెడి
ఖేదమ్మునఁ బాడమ్ములు దొట్రుపడఁ బెనుగాదమ్ములం బడు వరాహపుండరీకం
బులును బుండరీకకుందకుముదకురంటకాదికుసుమమకరందంబులు గ్రోలి తేలి
సోలి వాలి మహాహుంకృతుల ఝుంకృతులు సేయు తేఁటికదుపులును గదుపులం గల
యక యెడ గలిగి మదమున నదనుపద నెఱింగి మదనమార్గణప్రేరితంబు లై
పెంటితుటుములఁ వెంటనంటం జని యొండొంటి గెంటించుచుఁ దగుల నెక్కి
గర్భంబులు నెక్కొలుపుమృగవృషభరాజంబులును గలిగి రాజరాజగృహంబు
పగిది విలసితకుందపద్మసౌభాగ్యం బై భాగ్యహీనుకర్ణ రేఖగతి నశ్రుతసీల
కంఠశబ్దం బై శబ్దశాస్త్రవేదిహృదయంబుబాగున విశ్వప్రకాశాభిరామం బై
రామసంగ్రామంబు కైవడి బాణాసనాలంకృతం బై కృతాంతహృదయంబు
కరణి నపంకం బై పంకజాసనుగేహంబుసొంపున రాజహంసవిరాజమానం బై
మానధనునిచరిత్రంబుసొబగున సకల్మషజీవనం బై వననిధిపోలుపున సమ్మిళిత
భూభృద్వాహినీసంకులం బై కులవధూరత్నంబుచెలువున నదృష్టపయోధరం
బై ధరణికిం దోడ వగుచు శరత్కాలంబు వచ్చె నంత. 767

క. వాజులనీరాజనములు, రాజులజయగమనములును । రాజితలక్ష్మీ
పూజలు దేవోత్సవములు, రాజిల్లెను జగతియందు । రాజకులేంద్రా. 768

క. చేగ గలచెఱకువింటను, బాగుగ నీలోత్పలంబు । బాణంబు గ సం
యోగంబు సేసి మదనుఁడు, వేగిరమున విరహిజనుల । వేఁటాడించెన్. 769

వ. ఇట్లు భాసురంబు లయినశరద్వాసరంబుల గోవిందుండు గోబృందసమేతుం డై
బృందావనంబునఁ బసులఁ బొసంగ మేపుచు. 770

సీ. కర్ణావతంసిత । కర్ణికార ప్రభ, గండభాగద్యుతిఁ । గడలుగొలుప
భువనమోహన మైన । భ్రూవిలాసంబుతో, వామభాగానత । వదన మొప్ప
నపసవ్యకరమృదు । లాంగుళీచాతురి, షడ్జధ్వనికి మూర్ఛ । సరణిఁ జూప
డాకాలిమీఁద న । డ్డము సాఁచి నిల్చిన, పదనఖద్యుతి భూమిఁ । బ్రబ్బికొనఁగ

తే. మౌలిపింఛముఁ గంఠదామమును మెఱయ, విలసితగ్రామముగ నొక్క । వేణువందు
బ్రహ్మగాంధర్వగీతంబు । పరఁగఁ జేసెఁ, జతురనటమూర్తి గోపాల । చక్రవర్తి. 771

వ. ఇట్లు హరి వేణునాదంబు పూరించిన మారవికారహేతు వగుతద్గీతం బాలించి
సిగ్గులు సాలించి మక్కువలు సెక్కులొత్త గోపిక లోపికలు లేక తమతమ
పొత్తుకత్తెలుం దారును దత్తఱంబునఁ బదుగురు నేగురుఁ దుటుములు గొని
జిలిబిలిముచ్చటలకుం జొచ్చి తమలోన. 772

మ. శ్రవణోదంచితకర్ణికారకముతో ♦ స్వర్ణాభచేలంబుతో
నవతంసాయిత కేకిపింఛకముతో ♦ నంభోజదామంబుతో
స్వవశుండై మధురామృతముచే ♦ వంశంబుఁ బూరించుచు
న్నవిదా మాధవుఁ డాలవెంట వనముం ♦ దొప్పారెడిం జూచితే. 773

శా. రావే సుందరి యేమె బోటి వినవే ♦ రాజీవనేత్రుండు బృం
దావీథిం దగ వేణు వూఁదుచు లస ♦ త్సవ్యానతాస్యంబుతో
భ్రూవిన్యాసము లంగుళీక్రమములుం ♦ బొల్పార షడ్జంబు గాఁ
గావించెన్ నటుభంగి [1]బ్రహ్మ మగుత ♦ ద్గాంధర్వసంగీతమున్. 774

క. తలఁకెను గొబ్బునఁ జిత్తము, నలినాక్షునిమధురవేణు ♦ నాదము నావీ
నులు [2]సోఁకినంతమాత్రన, చెలియా యిఁక [3]నెట్లు వెరవు ♦ చింతింపఁగదే. 775

క. నాతోడ వెఱవ వలదే, నాతోడనె కొనుచుఁ బోయి ♦ నలినదళాక్షున్
నీతోడుతఁ బలికించెద, నీతోడిజనంబు మెచ్చ ♦ నీతోడు సుమీ. 776

వ. అని పెక్కుభంగుల నొకర్తొకర్తు నుద్దేశించి పలుకుచు గోపసుందరులు బృందావనంబునకు గోవిందున కెదురు చని పరమానందంబున నతనిం దమమనంబులఁ బ్రతిపదంబును నాలింగనంబు సేసినవార లగుచు రామకృష్ణుల నుద్దేశించి. 777

మ. నవగోస్థానకరంగమందుఁ బరమా ♦ నందంబుతోఁ జూతప
ల్లవనీలోత్పలపింఛపద్మదళమా ♦ లావస్త్రసంపన్నులై
కవయై వేణువు లూఁదుచున్ బహునటా ♦ కారంబులం గేళితాం
డవముల్ సేసెద రీకుమారకులు వే ♦ డ్కం గామినుల్ గంటిరే. 778

క. ఓచెలువలార వినుఁడీ, వాచాశతకంబు లేల ♦ వర్ణింపంగా
లోచనములకలిమికి ఫల, మీ చెలువురఁ జూడఁ గలుగు ♦ టింతియ సుండీ. 779

వ. అని పలికి రందుఁ గొందఱు గోవిందు నుద్దేశించి. 780

మ. ఒనరన్ బ్రేతల కించుకేనియును లే ♦ కుండంగ గోపాలకృ
ష్ణుని కెమ్మోవిసుధారసంబు గొనుచుం ♦ జోద్యంబుగా మ్రోయుచుం
దనపర్వంబులు నేత్రపర్వములు గా ♦ దర్శించెఁ బూర్వంబునన్
వనితా యెట్టితపంబు సేసె నొకొ యీ ♦ వంశంబు వంశంబులోన్. 781

మ. ముదితా యేతటినీపయఃకణములన్ ♦ మున్ వేణు వింతయ్యె నా
నది సత్పుత్త్రునిఁ గన్నతల్లిపగిదిన్ ♦ నందంబుతో నేఁడు స
మ్మదహంసధ్వని పాటగా వికచప ♦ ద్మశ్రేణి రోమాంచ మై
యొదవం దుంగతరంగహ స్తనటనో ♦ ద్యోగంబు గావింపదే. 782

క. నలినోదరుభక్తునిఁ గని, కులజులు నందాశ్రుజలము ♦ గురియుపగిది మ్రాఁ
కులు పూఁదేనియ లొలికెడు, నలినాక్షునిచేతివంశ ♦ నాళము మ్రోఁతన్. 783

---

1. బ్రహ్మముగ. 2. సోఁకినంత వినవే - సోఁకిన మాయన్నల. 3. నేటివెఱవు.

శా. నా మోసంబున కెద్ది మేర వినవే § నా పూర్వజన్మంబునన్
లేమా నోమును నోముచో సకట కా § ళిందీతటిన్ వేణు వై
భూమిం బుట్టెద నంచుఁ గోరఁ దగదే § బోధిల్లి యట్లైన నీ
బామం దిప్పుడు మాధవాధరసుధా § పానంబు గల్గుం గదే. 784

క. కాళిందీకూలంబున, నాళీ యీ నందసుతుని § యధరామృతముం
గ్రోలెడివేణువ నగునో, మేలాగున నోమ వచ్చు § నెఱిఁగింపఁ గదే. 785

క. వనితా కృష్ణుఁడు నల్లని,ఘన మనియున్ వేణురవము § గర్జన మనియున్
మనమునఁ దలంచి రొప్పుచు, ననవరతము నెమలితుటుము § లాడెడిఁ గంటే.786

క. గిరిచరమిథునము లోలిం, బరికింపఁగఁ గృష్ణపాద § పద్మాంకిత మై
సురరాజునగరికంటెను, దరుణీ బృందావనంబు § దద్దయు నొప్పెన్. 787

మ. అమరేంద్రాంగన లాకసంబున విమా § నారూఢ లై పోవుచుం
గమలాక్షున్ శుభమూర్తిఁ గాంచి మురళీ § గానంబు లందంద క
ర్ణములన్ నిల్పుచు మేఖలల్ వదలఁగా § నాథాంకమధ్యంబులం
బ్రమదా వ్రాలిరి చూచితే వివశ లై § పంచాశుగభ్రాంత లై. 788

ఉ. కానల నుండుచున్ సరస § గానవివేకవిహీనజాతు లై
వీనుల నేఁడు కృష్ణముఖ § వేణురవామృతధార సోఁకినన్
మేనులు మేఁతలున్ మఱచి § మెత్తనిచూడ్కి మృగీమృగావళుల్
మానిని చూడ వమ్మ బహు § మానము చేసెఁ గృతార్థచిత్తలై. 789

ఉ. తల్లులచన్నుఁబాలు మును § త్రావుతఱిం దమకర్ణవీథులన్
వల్లభ మైనమాధవుని § వంశరవామృతధార సొచ్చినం
ద్రుళ్లక పాలు రాఁ దివిక § దూఁటక మానక కృష్ణుమీఁద దృ
గ్వల్లులు సేర్చి నిల్చె నదె § వత్సము లంగనలార కంటిరే. 790

మ. మమతన్ మోములు మీఁది కెత్తుకొని రో § మంథంబు సాలించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి మురళీ § గానామృతశ్రేణి క
ర్ణములం గ్రోలుచు మేఁత మాని గళితా § నందాశ్రులై చిత్రితో
పమ లై గోవులు సూచు చున్న వవిగో § పద్మాక్షి వీక్షించితే. 791

మ. జగతీజంబులశాఖ లెక్కి మురళీ § శబ్దామృతస్యందమున్
మిగులన్ వీనులఁ ద్రావి వ్రేఁగువడి నె § మ్మిం గృష్ణరూపంబు చి
త్తగ మై యుండఁగ నడ్డపెట్టుక్రియ నే § త్రంబుల్ దగన్ మూసి యీ
ఖగముల్ సొక్కెడిఁ జూచితే మునిజనా § కారంబులం గామినీ. 792

మ. క్రమ మొప్పన్ నదు లెల్ల వంశరవ మా § కర్ణించి సంజాతమో
హములన్ మన్మథసాయకక్షతవిశా § లావర్త లై హంసవా

క్యములం జీరె తరంగహస్తముల నా § కర్షించి పద్మోపహా
రములం గృష్ణపదార్చనంబు సలిపెన్ § రామా విలోకించితే. 793

ఆ. వనిత నేఁడు కృష్ణు § వంశనినాదంబు, విని పయోధరంబు విరులు గురిసి
తనశరీర మెల్ల § ధవళాతపత్త్రంబుఁ, జేసి మింట నీడఁ § జేసెఁ గంటె. 794

క. మంచిఫలంబులు హరిచే, నించి కరాలంబనముల § నెగడుచు నిదె క్రీ
డించెద రంగన చూడుము, [1]చెంచితలాం బింఛపత్త్ర § చేలాంచితలన్. 795

క. ఉల్లసితకుచభరంబున, నల్లాడెడినడుముతోడ § నలరులదండన్
భిల్లి యొకతె హరి కిచ్చెను, హల్లోహలకలిత యగుచు § నంగన కంటే. 796

క. గిరు లెల్ల జలము లయ్యెం, దరు లెల్లను బల్లవించె § ధరణిగగనభూ
చరు లెల్లను జొక్కిరి హరి, మురళీరవామృతము సోఁక § ముద్దియ కంటే. 797

మ. బలకృష్ణాంఘ్రిసరోజసంగమముచే § భాసిల్లుచున్ ధన్యమై
ఫలపుష్పంబులఁ గానికల్ గురిసి సం § భావించి మిన్నందుచున్
జలఘాసంబుల గోవులం దనిపి చం § చద్భూజరోమాంచమై
వెలసెం జూడఁ గఁ దమ్మ యీగిరి పురో § వీథిన్ సరోజాననా. 798

వ. అని యిట్లు బృందావనవిహారి యైనగోవిందుని సందర్శించి పంచబాణభల్ల భగ్న హృదయ లయి వల్లవకాంత లేకాంతంబులఁ జింతించుచుఁ దత్పరతంత్ర లయి యుండి రంత. 799

### హేమంతఋతువర్ణనము.

క. శ్రీమంతికాస్రగంచిత, సీమంతవతీకుచోష్ణ § జితశీతభయ
శ్రీమంతం బయి గొబ్బున, హేమంతము దోఁచె మదనుఁ § డేఁచె విరహులన్.

క. ఉత్తరపుగాలి విసరె వి,యత్తలమునఁ దుహినకిరణుఁ § డహితుం డయ్యెం
బొత్తు జరిగె మిథునములకు, నెత్తమ్ములు దఱిఁగె హిమము § నెలకొనియె నృపా.

క. అహములు సన్నము లయ్యెను, దహనము హిత వయ్యె దీర్ఘ § దశ లయ్యె నిశల్
బహుశీతోపేతం బయి, యుహుహూ యని వడఁకె లోక § మూర్వీనాథా. 802

క. అన్నులచన్నులదండ వి,పన్నులు గా కెల్లవారు § బ్రదికిరి గా కీ
చన్నులు మీఱిన వలి నా,పన్నులు గాకుండఁ దరమె § బ్రహ్మాదులకున్. 803

ఆ. పొడుపుఁగొండమీఁదఁ § బొడుచుట మొదలుగాఁ, బరువువెట్టియినుఁడు § పశ్చిమాద్రి
మఱుఁగుఁజొచ్చెఁగాక § మసలినఁ జలిచేతఁ, జిక్కఁ జిక్కననఁగఁ § జిక్కకున్నె.

క. చెంగల్వ[2]విరులగంధము, మంగళముగఁ గ్రోలుచున్న § మధుపము లొప్పె
న్నంగజవహ్నులపై ను, ప్పొంగి విజృంభించుపొగల § పోలిక నధిపా. 805

ఆ. శంభుకంట నొకటి § జలరాశి నొక్కటి, మఱియు నొకటి మనుజ § మందిరముల
నొదిఁగెఁగాక మెఱసి § యున్నమూఁడగ్నులు, చలికి నోడి భక్తి § సలుపకున్నె.

1. 'చెంచెత_చెంచత' వ్రా. ప్ర. 2. విరిమరందము.

శా. (ఈ హేమంతము రాకఁ జూచి రమణీ § హేలాపరిరంభస
త్సాహాయ్యంబునఁ గాని దీని గెలువన్ § శక్యంబు గా దంచుఁ దా
రూహాపోహవిధిం ద్రిమూర్తులు సతీ § యుక్తాంగు లైనారు గా
కోహో వార ల దేమి సంతతవధూ § యోగంబు రాఁ గందు రే. 807

క. ఈ హేమంతము రాకకు, శ్రీహరి యొక్కింత వడఁకి § చింతింపంగా
నోహో వెఱవకు మని తా, మాహారికిని శ్రీకుచంబు § లభయం బిచ్చెన్.)

వ. ఇట్లు నితాంతం బగు హేమంతంబున మొదలి నెలతొలిదినంబునందు నందుని మందం గలగోపకుమారికలు రేపకడ లేచి చని కాళిందీజలంబులం దోఁగి జల తీరంబున నిసుమునం గాత్యాయనీరూపంబుఁ జేసి సురభికుసుమగంధంబు లిడి ధూపదీపంబు లిచ్చి బహువిధోపహారంబులు సమర్పించి. 809

క. ఓ కాత్యాయని భగవతి, నీకున్ మ్రొక్కెదము నేము § నేఁ డనుకంపన్
మా కిందఱకును వైళమ, శ్రీకృష్ణుఁడు మగఁడు గాఁగఁ § జేయుము తల్లీ. 810

క. ఓ తల్లి మాకుఁ గృష్ణుఁడు, చేతోవిభుఁ డైననాఁడు § చెలువల మెల్లన్
నేతివసంతము లాడుచు, జాతర సేసెదము భక్తి § చాతురితోడన్. 811

వ. అని నమస్కరించి హవిష్యంబులు గుడుచుచు నిర్విఘ్నంబున మాసవ్రతంబు సలిపి రం దొక్కనాఁడు. 812

గోపికావస్త్రాపహరణము.

మ. రమణుల్ ప్రొద్దున మేలుకాంచి సఖులన్ § రం డంచు నాత్మీయనా
మములం జీరి కుచద్వయీభరములన్ § మధ్యంబు లల్లాడఁగాఁ
బ్రమదోద్దామగజేంద్రయాన లగుచుం § బద్మాక్షునిం బాడుచున్
యమునాతీరముఁ జేరఁ బోయిరి గృహీ § తాన్యోన్యహస్తాబ్జ లై. 813

వ. ఇట్లు నదీతీరంబు సేరం జని గజగమనలు విజనప్రదేశంబున వలువలు విడిచి యిడి మది శంకిలక లంకె లై క్రుంకు లిడఁ జలంబుల జలంబులు సొచ్చి. 814

క. వారిజలోచనుఁ బాడుచు, వారిజలోచనలు వారి § వారికి వేడ్కన్
వారివిహారము సలిపిరి, వారివిహారములు జగతి § వారికిఁ గలవే. 815

వ. ఆ సమయంబున. 816

క. తోయజనయనలు యమునా, తోయములం దుంట యెఱిఁగి § దూరగుఁ డయ్యుం
దోయజనయనుఁడు హరి తన, తోయముగోపకులు దానుఁ § దోఁ తెంచెన్నృపా.

తరలము. [1]కదలకుం డని తోడివారలఁ § గన్నుసన్నల నిల్పుచుం
బదము లొయ్యన నేలఁ బెట్టుచుఁ § బద్మనేత్రుఁడు మౌని యై
పొదలమాటున నల్ల నల్లన § పొంచి పొంచి నతాంగుఁ డై
యుదను గోరుచు డాసి వ్రేఁతల § యంబరంబులు దొంగిలెన్. 818

1. కదల కుండఁగఁ దోడి.

వ. ఇట్లు డొంగిలి. 819

శా. ఉద్యద్గంధగజేంద్రగౌరవముతో § యోషాంబరంబుల్ విభుం
డాద్యుం డర్భకుభంగి నర్భకులతో § హాసార్థియై కొంచుఁ ద
న్నద్యంభఃకణశీతవాతజనితా § నందంబుతో నెక్కెఁ దా
సద్యోముక్తదురంతపాదపజను § స్సంతాపముఁ నీపమున్. 820

వ. అప్పు డయ్యింతు లి ట్లనిరి. 821

క. మామావలువలు ముట్టకు, మామా కొనిపోకు పోకు § మన్నింపు తగన్
మామాన మేల కొనియెదు, మామానసహరణ మేల § మానుము కృష్ణా.

సీ. బహుజీవనముతోడ § భాసిల్లి యుండుటో, గోత్రంబు నిల్పుటో § కూర్మితోడ
మహి నుద్ధరించుటో § మనుజసింహంబవై, ప్రజలఁ గాచుటొ కాక § బలిఁ దెరల్చి
పిన్న వై యుండియుఁ § బెంపు వహించుటో, రాజుల గెల్చుటో § రణములందు
గురునాజ్ఞ సేయుటో § గుణనిధి వై బల, ప్రఖ్యాతిఁ జూపుటో § భద్రలీల

ఆ. బుధులు మెచ్చ భువిఁ బ్ర§బుద్ధత మెఱయుటో, కల్కితనము సేయ § ఘనత గలదె
వావి లేదు వారి § వారు నావా రని, యెఱుఁగ వలదె వలువ § లిమ్ము కృష్ణ. 823

క. కొంటివి మాహృదయంబులు, గొంటివి మానంబు లజ్జఁ § గొంటివి వలువల్
గొంటి విఁక నెట్లు సేసెదొ, కొంటెవు గద నిన్ను నెఱిఁగి§కొంటిమి కృష్ణా. 824

సీ. రాజసంబున నీవు రంజిల్లు టెఱుఁగమే, చెలరేఁగి వింతలు § సేయు చుండ
సత్త్వసంపద గల్గి § జరుగుటఁ దలఁపమే, సిరి గల్గి యన్యులఁ § జెనకు చుండ
గురుతరశక్తియు§క్తుఁడ వౌటఁ జూడమే, తామసంబున నగ్గు§ దలఁచు చుండ
నొకభంగితో నుండ§కుంటఁ జింతింపమే, మాయావివై మాఱు§మలయు చుండ

ఆ. నేమిజాడవాఁడ § వేపాటి గలవాఁడ, వేగుణంబు నెఱుఁగ § వెల్లయెడల
నోదిఁగి యుండ నేర § వోరంతప్రొద్దును, బటము లీఁ గదయ్య § పద్మనయన.

క. రాజుల నెఱుఁగవు బలిమిని, [1]రాజిల్లెదు చీర లీవు § రమణుల మింకన్
రాజున కెఱిఁగించెద మో, రాజీవదళాక్ష నీవు § రాజవె ధరకున్. 826

వ. అని పలికిన కన్నియలపలుకులు విని మందహాససుందరవదనారవిందుఁ డై గోపాలబాలకులకరంబులం గరంబులు వ్రేసి యమ్ముద్దియల నుద్దేశించి నెఱవాది చతురుం డి ట్లనియె. 827

శా. రామల్ [2]రాజులతోడ నీపనికి నా § రంభింతురే మీక్రియన్
మోమా టేమియు లేక దూఱెదరు మీ § మోసంబు చింతింప రం
భోమధ్యంబున నుండి వెల్వడి వెసం § బూర్ణేందుబింబాననల్
మీమీచీరలు వచ్చి పుచ్చుకొనుఁడా § మీ కిచ్చెదం జెచ్చెరన్. 828

వ. అనిన నమ్మానవతు లొండొరులమొగంబులు చూచి నగుచు మర్మంబులు నాటు

1. రాజిల్లెదు చీర లీవు. 2. రాములతోడ నీపనికిఁ గా రాగింతురే_గా రావింతురే_రారావత్తురే.

నమ్మాటలకు మగుడం బలుక సిగ్గు వడుచు నగ్గలం బయినచలిని వలిగొని కంఠ
ప్రమాణజలంబులం దుండి డోలాయమానమానస లై యి ట్లనిరి. 829

క. మావలువ [1]లాగడంబున, నీ వేటికిఁ బుచ్చుకొంటి § నీ వల్పుఁడవే
నీ వెఱుఁగని దే మున్నది, నీ వింద ఱలోన ధర్మ § నిరతుఁడవు గదే. 830

శా. ఇంతుల్ తోయము లాడుచుండ మగవా § రేతెంతు రే వచ్చిరా
యింతల్ సేయుదు రే కృపారహితు లై § యేలోకమం దైన నీ
వింతల్ నీతలఁ బుట్టెఁ గాక మఱి యే § వీ కృష్ణ యోచెల్ల నీ
చెంతన్ దాసుల మై చరించెదము మా § చేలంబు లిప్పింపవే. 831

క. వచ్చెదము నీవు పిలిచిన, నిచ్చెద మే మైన నీకు § నెటు సొరు మనినం
జొచ్చెదము నేడు వస్త్రము, లిచ్చి మముం గరుణతోడ § నేలుము కృష్ణా.

వ. అనిన దరహసితవదనుం డై హరి యి ట్లనియె. 833

క. ఏతరుణుఁడు మగఁ డగుటకు, మీతపములు సెప్పఁ డింక § మీయానలు సుం
డీ తప్పిన నీకూరిమి, మీతలలనె పుట్టె నోటు § మేదిని లేదే. 834

క. ఎవ్వనిఁ గని మోహించితి, రెవ్వఁడు మీమానధనము § లెల్ల హరించెన్
నివ్వటిలు మీకుఁ గూరిమి, యెవ్వనిపైఁ బలుక రాదె § యే నన్యుఁడనే. 835

వ. అనిన విని సుందరు లన్యోన్యసందర్శనంబులు సేయుచు హృదయారవిందంబు లందుఁ గందర్పుండు సందడింప నగుచు నిరుత్తర లయి యున్న లోకోత్తరుం డి ట్లనియె. 836

క. నాయింటికి దాసుల రై, నాయాజ్ఞ వహించి మీరు § నడచెద రేనిన్
మీయంబరంబు లిచ్చెదఁ, దోయంబులు వెడలి రండు § తొయ్యలులారా. 837

వ. అనిన విని హరిమధ్యలు చలికి వెఱచి సలిలమధ్యంబున నిలువ నోపక. 838

క. కొందఱు వెడలుద మందురు, కొందఱు వెడలుటయు సిగ్గుఁ § గొను గోవిందుం
డందురు కొందఱు దమలోఁ, గొందల మందుదురు వడఁకు § గొని మనుజేంద్రా.

వ. మఱియు నెట్టకేలకుఁ జిత్తంబులు గట్టిపఱచుకొని తనుమధ్యలు తోయమధ్యంబు వెలువడి. 840

క. చంచత్పల్లవకోమల, కాంచననవరత్నఘటిత § కంకణరుచిరో
దంచితకరసంఛాదిత,పంచాయుధగేహ లగుచుఁ § బడఁతులు వరుసన్. 841

వ. చని ప్రౌఢ లైనసుందరుల ముందట నిడుకొని మందగమనలు మందహాసంబుతోడ నెదుర నిలిచిన నరవిందనయనుం డి ట్లనియె. 842

సీ. శృంగారవతులార § సి గ్గేల మిముఁ గూడి, పిన్ననాఁటనుగోలెఁ § బెరిఁగినాడ
నెఱుఁగనే మీలోన § నెప్పుడు నున్నాఁడ, నేను జూడనిమర్మ § మెద్ది గలదు
వ్రతనిష్ఠ లై యుండి § వలువలు గట్టక, నీరు సొత్తురె మీరు § నియతి దప్పి

1, 'లు లాఘవమున' వ్రా. ప్ర.

కాత్యాయనీదేవిఁ గల్ల సేయుట గాక, యీరీతి నోము వా రెందుఁ గలరు
ఆ. వ్రతఫలంబు మీరు వలచినఁ [1]జక్కన, నింతు లెల్లఁ జేతు లెత్తి మ్రొక్కి
చేరి పుచ్చుకొనుఁడు చీరలు సిగ్గువో, నాడ నేల యెగ్గు లాడ నేల. 843

వ. అనిన విని మానవతులు దమలోన. 844

మ. వ్రతముల్ సేయుచు నొక్కమాటయిన నెవ్వారిన్ విచారించినన్
వ్రతభంగంబులు మాను నట్టివరదున్ వామాక్షు లీక్షించియున్
గతచేలాప్లవనంబు నేఁడు వ్రతభంగం బంచు శంకించి ఫా
లతటన్యస్తకరాబ్జలై సరసలీలన్ మ్రొక్కి రట్లందఱున్. 845

క. బాలలకు హస్తకీలిత, ఫాలలకు నితాంతశీత పవనాగమనా
లోలలకు నంబరములు గృపాలుఁడు హరి యిచ్చె భక్తపాలుం డగుటన్. 846

ఆ. చీర లపహరించి సిగ్గులు విడిపించి, పరిహసించి యైనఁ బరఁగ మనకు
ఘనుఁడు నోముకొలఁతఁ గాకుండ మ్రొక్కించె, ననుచు హరినుతించి రబల లెల్ల.

క. ఉల్లములు నొవ్వ నాడినఁ, గల్లలు సేసినను నగినఁ గలఁచిన నైనన్
వల్లభులు సేయుకృత్యము, వల్లభలకు నెగ్గు కాదు వల్లభ మధిపా. 848

వ. ఇట్లు హరి వలువ లిచ్చినం గట్టుకొని సతు లతనియందు బద్ధానురాగ లయ్యుఁ జలింపక తెప్ప లిడక తప్పక చూడ నాప్రోడ యెఱింగి చేరి వారి కిట్లనియె. 849

సీ. లక్షణవతులార లజ్జించి చెప్పరు, గాని మీమర్మముల్ గానఁబడియె
ననుఁ గొల్వఁ జింతించి నారు నాచేతను, సత్యంబు మీనోము సఫల మగును
గామితార్థంబుల కలిమిఁ జెప్పఁగ నేల, ననుఁ గొల్వ ముక్తికి నడవ వచ్చుఁ
గడమ కూడఁగ నంబికాదేవి నోమంగ, నటమీఁద రాత్రు లందు మీకు
ఆ. నన్నుఁ బొందఁగల్గు నమ్మి పొండని హరి, వల్క నింతు లెల్ల భ్రాంతిఁ జనిరి
తపము పండె ననుచుఁ దత్పదాంబుజములు, మానసించుకొనుచు మందకడకు.

మునిభార్య లన్నముఁ దీసికొని వచ్చి శ్రీకృష్ణుని నారగింపఁ జేయుట.

వ. ఇట్లు గోపకన్యకలందుఁ బ్రసన్నుండై గోవిందుండు బృదావనంబు దాఁటి దూరంబున ధేనువుల మేపుచుండఁ జండకిరణునియెండంబడి దండి చెడి తరులదండ నండ గొనుచు నాతపత్రాకారంబులై నీడలు సేయుచున్నవృక్షంబుల నీక్షించి కృష్ణబలశ్రీరామదేవప్రశస్తవిశాలార్జున ప్రముఖులకుం దక్కినగోపకు లిట్లనిరి.

మ. అపకారంబులు సేయ వెవ్వరికి నేకాంతంబులం దుండు నా
తపశీతానిలవర్షవారణములై త్వగ్గంధనిర్యాసభ
స్మపలాశాగ్రమరందమూలకుసుమచ్ఛాయాఫలశ్రేణిచే
నుపకారంబులు సేయు నర్థులకు నీయుర్వీజముల్ గంటిరే. 852

వ. అని చిగురాకు పువ్వు గాయ పండుతండంబుల ప్రేఁగున వీఁగినతరువులనడిమి

1. జయ్యన - దయ్యెడు.

తెరువులం బసులదాఁటుల దాఁటించి యమునకుం జని వెడఁదమడుగుల మెల్లన చల్లనినీరు ద్రావించి తత్సమీపంబున మేపుచు వల్లవు లెల్ల మూఁకలు గొని యాఁకలి గొంటి మని విన్నవించినఁ దనకు భక్తురాండ్రగువిప్రభార్యలవలనం బ్రసన్నుఁడై వారలం జూచి రామసహితుం డైనహరి యిట్లనియె. 853

సీ. వల్లవులార యీ ♦ వనమున విప్రులు, బ్రహ్మవాదులు దేవ ♦ భవనమునకు నరుగుట కాంగిర ♦ సాహ్వయసత్త్రంబు, సలుపుచు నున్నారు ♦ సనుఁడు మీరు మానామములు సెప్పి ♦ మైత్రితో నడిగిన, నన్నంబు వెట్టెద ♦ రనుచుఁ బలుక వారలు చని విప్ర ♦ వరుల కెల్లను మ్రొక్కి, పసుల మేపుచు బల ♦ భద్రకృష్ణు

తే. లలసి పుత్తెంచి రిట మమ్ము ♦ నన్న మడుగ, ధర్మవిదులార యర్థిప్ర ♦ దాతలార పెట్టుఁడన్నంబుశ్రాంతులఁ ♦ బిలిచి తెచ్చి, పెట్టుదురుగాదె మిముబోఁటి ♦ పెద్దలెల్ల.

క. ఘనదీక్షితునకు నైనం, జనుఁ గుడువఁగఁ బశువధంబు ♦ సౌత్రామణియుం జనినవెనుక దోషము లే, దనఘాత్మకులార పెట్టుఁ ♦ డన్నము మాకున్. 855

వ. అని గోపకులు పలికిన. 856

మ. క్రతువుల్ మంత్రముఁ దంత్రముల్ ధనములుం ♦ గాలంబు దేశంబు దే వతయుల్ ధర్మము నన్యముల్ దలఁప నె ♦ వ్వాఁ డట్టిసర్వేశ్వరుల్ మతి నూహింపక గోపబాలుఁ డనుచుల్ ♦ మందస్మితిం జూచి దు ర్మతు లై యన్నము లేదు లే దనిరి స ♦ మ్మానక్రియాశూన్యు లై. 857

వ. అంత గోపకులు నిరాశు లై వచ్చి యెఱింగించిన హరి లౌకికానుసారి యగుచు మీ రయ్యార్యుల నడుగక వారిభార్యలకు మారాకఁ జెప్పుండన్నఁబు వెట్టెద రని పంచిన వారలు సని బ్రాహ్మణసతుల దర్శించి నమస్కరించి సంపూజితు లై యిట్లనిరి. 858

క. గోవుల మేపుచు నాఁకొని, గోవిందుం డన్న మడిగి ♦ కొని రండని మ మ్మీవేళం బుత్తెంచెను, ధీవిలసితలార రండు ♦ తెండన్నంబుల్. 859

వ. అనిన విని గోవిందసందర్శనకుతూహల లై ధరణీసురసుందరులు సంభ్రమానం దంబులు డెందంబుల సందడింప భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయభేదంబు లుం గలిగి సంస్కారసంపన్నంబు లైన యన్నంబులు కుంభంబుల నిడికొని సం భ్రంభంబుల సముద్రంబునకు నడచునదుల తెఱంగున. 860

క. బిడ్డలు మగలును భ్రాతలు, నడ్డము చని వల దనంగ ♦ నటు దలఁ డని మా ఱొడ్డుచు జగదీశ్వరునకు, జడ్డన నన్నంబు గొనుచుఁ ♦ జని రాసుదతుల్. 861

వ. చని యమునాసమీపమున నవపల్లవాతిరేకంబును విగతవనచరశోకంబును నైనయశోకంబుక్రింద నిర్మలస్థలంబున. 862

సీ. ఒకచెలికానిపై ♦ నొకచేయి సాఁచి వే,ఱొకచేత లీలాబ్జ ♦ మూఁచువానిఁ గొప్పున కందని ♦ కొన్నికుంతలములు, సెక్కుల నృత్యంబు ♦ సేయువానిఁ

గుఱుచచుంగులు వుచ్చి కొమ రారఁ గట్టిన, పసిఁడివన్నియ గలపటమువాని
నొదలఁ దిరిగి రా నలవడఁ జుట్టిన, దట్టంపుఁబింఛపు దండవాని
తే. రాజితోత్పలకర్ణపూరములవాని, మహితపల్లవపుష్పదామములవాని
భువనమోహనతటవేషభూతివానిఁ, గనిరి కాంతలు కన్నుల కఱవు దీఱ. 863
క. కని లోచనరంధ్రంబుల, మును మిడి హరిలలితరూపమును లోఁగొని నె
మ్మనములఁ బరిరంభించిరి, తనుమధ్యలు హృదయజనితతాపము వాయన్. 864
వ. ఇవ్విధంబున. 865
క. వారితసర్వస్పృహలై, వారందఱుఁ దన్నుఁ జూడ వచ్చుట మదిలో
వారిజనయనుఁడు వొడగని, వారికి ని ట్లనియె నగి య వారితదృష్టిన్. 866
శా. కాంతారత్నములార మీగృహములం గల్యాణమే యేమి గా
వింతుర్ మీ కిటు రండు మమ్ము నిచటన్ వీక్షింప నేతెంచి నా
రెంతేవేడుకతో నెఱుంగుదుము నిత్రైతుస్థితిన్ నన్ను ధీ
మంతుల్ మీక్రియఁ జేరి కందురు గదా మత్సేవలన్ సర్వమున్. 867
వ. కావున గృహస్థులైన మీపతులు మిమ్ముం గూడి క్రతువు నిర్విఘ్నంబుగా సమా
ప్తించెదరు మీరు యాగవాటంబునకుం జనుం డనిన విప్రభార్య లి ట్లనిరి. 868
మ. తగునే మాధవ యిట్టివాఁడిపలుకుల్ ధర్మంబులే మాయెడన్
మగలున్ బిడ్డలు సోదరుల్ జనకులున్ మమ్మున్ నివారింప మ
చ్చిగ నీయంఘ్రులు సేరినార మట వోఁ జేకొందురే వార లా
పగిదే మెల్లము కింకరీజనులఁగా భావించి రక్షింపవే. 869
వ. అనిన జగదీశ్వరుండు. 870
సీ. నాసమీపమున నున్నా రంచు నలుగరు, బంధులు భ్రాతలు పతులు సుతులు
మిమ్ము దేవతలైన మెత్తు రంగనలార, నాదేహసంగంబు నరుల కెల్ల
సౌఖ్యానురాగసంజనకంబు గాదు ము, క్తిప్రదాయకము నా కీర్తనమున
దర్శనాకర్ణన ధ్యానంబులను గర్మ, బంధదేహంబులఁ బాసి మీరు
తే. మానసంబులు నాయందు మరగఁజేసి,నన్నుఁజేరెద రటమీఁదనమ్ముఁడనుచుఁ
బలికి వారలు దెచ్చిన భక్షణాదు, లా ప్తవర్గంబుతో హరి యారగించె.871
క. పరమేశ్వరార్పణంబుగఁ, బరజనులకు భిక్ష యిడినఁ బరమపదమునం
బరఁగెద రట తుది సాక్షా,త్పరమేశుఁడు భిక్ష సేయ ఫల మెట్టిదియో. 872
వ. ఇట్లు సర్వేశ్వరుం డయినహరికి భిక్షయిడి తమభార్యలతనివలనం గృతార్థ లగుట
యెఱింగి భూసురవరులు తమలో ని ట్లనిరి. 873
చ. కటకట మోసపోయితిమి కాంతలపాటియు బుద్ధి లేదు నేఁ
డిట హరిఁ గానఁ బో నెఱుఁగ మేము దురాత్ముల మేము కల్మషో
ద్భటులము విష్ణుమాయగుల ప్రాజ్ఞత లేల తపంబు లేల స

ర్యటనము లేల శీలములు ♦ యాగములుఁ మఱి యేల కాల్పనే. 874

క. జపహోమాధ్యయనంబులుఁ, దపములు వ్రతములును లేని ♦ తరుణులు హరిస
త్కృపఁ బడసి రన్ని గలిగియుఁ, జపలతఁ బొందితిమి భక్తి ♦ సలుపమి నకటా.

క. సురగురు లగుయోగీంద్రుల, నరుడుగ మోహితులఁ జేయు ♦ హరిమాయమముఁ
నరగురుల మూఢవిప్రుల, నురవడి మోహితులఁ జేయ ♦ నోపక యున్నే. 876

మ. క్రతువుల్ ధర్మము మంత్రతంత్రధనముల్ ♦ కాలంబు దేశంబు దే
వతయుఁ వహ్నులు మేదినీసురులు నె ♦ వ్వాఁ డట్టిసర్వేశుఁ డీ
క్షితి రక్షింప జనించినాఁ డెఱుఁగ మా ♦ శ్రీభర్తకుం గర్తకుం
గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము ర ♦ క్షోనాథసంహర్తకున్. 877

నందాదు లింద్రయాగము సేయ శ్రీకృష్ణునితో నాలోచించుట.

వ. అని మఱియు ననేకవిధంబులఁ బశ్చాత్తాపంబులం బొంది హరిం దలంచి శమింపు
మని మ్రొక్కి బ్రాహ్మణులు కంసభీతు లయి బలకృష్ణసందర్శనంబు సేయం జన
రై రంత నక్కడ నఖిలదర్శనుం డైనహరి యింద్రయాగంబు సేయం దలంచి
తనకడకు వచ్చిననందాదిగోపవృద్ధులం గని నందున కి ట్లనియె. 878

సీ. యాగంబు సేయంగ ♦ నర్థించి వచ్చితి, రీయాగమున ఫల ♦ మేమి గలుగు
నెవ్వాఁడు దీనికి ♦ నీశ్వరుం డధికారి, యెవ్వఁడు సాధన ♦ మెంత వలయు
శాస్త్రీయమో జనా ♦ చారమో కార్యంబు, వైరుల కెఱిఁగింప ♦ వలదు గాని
యెఱిఁగెడిమిత్రుల ♦ కెఱిఁగింపఁదగుఁ జేరి, యెఱిఁగి చేసినఁ గోర్కు ♦ లెల్లఁ గలుగుఁ

ఆ. బగయుఁ జెలిమి లేక ♦ పరఁగినమిముబోఁటి, మంచివారి కేల ♦ మంతనంబు
తలఁపు లెల్ల మాకుఁ ♦ దగ నెఱింగింపవే, తాత వాక్సుధాప్ర ♦ దాత వగుచు.

వ. అని పలికినప్రౌఢకుమారునికిఁ దండ్రి యి ట్లనియె. 880

సీ. పర్జన్యుఁ డధికుండు ♦ భగవంతుఁ డమరేంద్రుఁ, డతనికిఁ బ్రియమూర్తు ♦ లగుచునున్న
మేఘబృందంబులు ♦ మేదినీతలముపై, నతనిపంపున భూత ♦ హర్షణము గ
జలములు గురియుఁ ద ♦ జ్జలపూరములఁ దోఁగి, పండు సస్యంబు లా ♦ పంట దమకు
ధర్మార్థకామప్ర ♦ దాయకంబు గ లోకు, లెల్లను, బ్రదుకుదు ♦ రింత యెఱిఁగి

తే. మేఘవిభుఁ డైనయింద్రుండు ♦ మెచ్చుకొఱకు
నింద్రయాగము సేయుదు ♦ రెల్లనృపులు
కామలోభభయద్వేష ♦ కలితు లగుచుఁ
జేయ కుండిన నశుభంబు ♦ సెందుఁ బుత్త్ర. 881

వ. అదియునుం గాక. 882

ఆ. మఖము సేయ వజ్రి ♦ మది సంతసించును, వజ్రి సంతసింప ♦ వాన గురియు
వాన గురియఁ గసవు ♦ వసుమతిఁ బెరుఁగును, గసవు మేసి ధేను ♦ గణము బ్రదుకు.

క. ధేనువులు బ్రదికె నేనియు, మానదు ఘన మైనపాఁడి ♦ మందలఁ గలుగున్

మానుగను బాఁడి గలిగిన, మానవులును సురలుఁ దనిసి § మనుదురు పుత్రా.

వ. అని యిట్లు నొడివిన నందునివచనంబులు విని యింద్రునికిఁ గోపంబు దీపింప దనుజదమనుండు తండ్రి కి ట్లనియె. 885

క. కర్మమునఁ బుట్టు జంతువు, కర్మమునన వృద్ధిఁ బొందుఁ § గర్మమునఁ జెడుం
గర్మమె జనులకు దేవత, కర్మమె సుఖదుఃఖములకుఁ § గారణ మధిపా. 886

క. కర్మములకుఁ దగుఫలములు, కర్ములకు నిడంగ రాజు § గాని సదా ని
ష్కర్ముఁ డగునీశ్వరుండును, గర్మవిహీనునికి రాజు § గాఁడు మహాత్మా. 887

వ. కావునఁ గర్మానుయాతంబు లయినభూతంబులకుఁ బురుహూతునివలనిభీతి యేటికిఁ బురాతనసంస్కారంబులు గుప్పలు గొని కప్పినఁ గర్మంబులఁ దప్పించి పెంపు వడయ నప్పరమేశ్వరుండును నేరఁ డితరులం జెప్ప నేల సురాసురనరానీకం బులతోడిలోకంబు నిజసంస్కారవశంబై యంద డింది యున్నది సందేహంబు లేదు దేహి గర్మవశంబున గురుతనుదేహంబులం జొచ్చి వెడలు నొజ్జ వేలుపు నెచ్చెలి పగఱు చుట్టంబులు కర్మంబు జీవుండు కర్మంబుతోడన వర్తించు నత నికిఁ గర్మంబు దైవతంబు కర్మంబునం బ్రదుకుచు నితరసేవ సేయుట సతి పతి విడిచి జారుం జేరినచందం బగు విప్రుండు వైదికకర్మంబున మెలంగు నృ పతి ధరణీపాలనంబున సంచరించు వైశ్యుండు వాణిజ్యకృషికుసీదగోరక్షణా దుల వర్తించు శూద్రుం డగ్రజన్ముల సేవించి బ్రదుకు సత్త్వరజస్తమోగుణంబు లుత్పత్తిస్థితిలయకారణంబు లందు రజంబున జగంబు జన్మించు రజోగుణ ప్రేరితంబు లయి మేఘంబులు వర్షించు వర్షంబునం బ్రజావృద్ధి యగు నింద్రుం డేమి సేయం గలవాఁ డదియునుం గాక. 888

శా. కోపింపం బని లేదు శక్రునికిఁ దాఁ § గోపించుఁ గా కేమి సం
క్షేపం బయ్యెడి దేమి పట్టణములున్ § గేహంబులున్ దేశముల్
వ్యాపారంబులు మీకుఁ బోయెడినె శై § లారణ్యభాగంబులన్
గోపత్వంబున నుండుచున్ మనకు సం § కోచింపఁగా నేటికిన్. 889

సీ. పసులకుఁ గొండకు § బ్రాహ్మణోత్తములకు, మఖము గావించుట § మంచిబుద్ధి
యింద్రయాగంబున § కే మేమి దెప్పింతు, రవి యెల్లఁ దెప్పింపుఁ § దరసిమీరు
పాయసంబులు సపూ § పములు సైఁదపుఁబిండి, వంటలుఁ బప్పును § వలయునట్టి
ఫలశాకములు వండఁ § బంపుఁడు హోమంబు, సేయుఁడు ధేనుద § క్షిణలనిచ్చి

తే. బహురసాన్నంబు వెట్టుఁడు § బ్రాహ్మణులకు
నచలు లై పూజ లొనరింపుఁ § డచలమునకు
నధమచండాలశునకసం § హతికిఁ దగిన
భక్ష్యములఁ దెండు కసవులు § పసుల కిండు. 890

శా. గంధాలంకరణాంబరావళులచేఁ § గై సేసి యిష్టాన్నముల్

బంధుశ్రేణియు మీరలుం గుడిచి నా ♦ భాషారతిన్ వేడుకల్
సంధిల్లన్ గిరి గో ద్విజానలనమ ♦ స్కారంబు గావింపుఁ డో
జం ధర్మం బని తోఁచెనేని జనకా ♦ జన్మంబు ధన్యం బగున్. 891

వ. అని మఱియు నిలింపపతిసొంపు దింపుతలంపున నిమ్మఖంబు తనకు సమ్మతం బని గోవిందుండు పలికిన నందాదులు మేలు మే లని తద్వచనప్రకారంబునం బుణ్యాహవాచనంబులు సదివించి ధరణీసురులకు భోజనంబు లిడి పసులకుం గసవు లొసంగి రప్పుడు. 892

మ. సకలాభీరులు వీఁడె కృష్ణుఁ డన నై ♦ జం బైనరూపంబుతో
నకలంకస్థితి నుండి శైల మిదె మీ ♦ రర్చింప రం డంచుఁ దా
నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో ♦ నొండొండ పూజించి గో
పకదత్తాన్నము లాహరించె విభుఁ డా ♦ ప్రత్యక్షశైలాకృతిన్. 893

మ. వినుఁడీ శైలము కామరూపి ఖలులన్ ♦ వేధించు నాజ్యాన్నముల్
మన మొప్పించిన నాహరించె మనలన్ ♦ మన్నించెఁ జిత్తంబులో
ననుకంపాతిశయంబు సేసె మనపై ♦ నంచున్ సగోపాలుఁడై
వనజాక్షుండు నమస్కరించె గిరికిన్ ♦ వందారుమందారుఁడై. 894

వ. ఇట్లు గోపకులు హరిసమేతు లై యగ్గిరికిం బూజనోపహారంబులు సమర్పించి గోధనంబులం బురస్కరించుకొని భూసురాశీర్వాదవచనంబులతో గిరికిం బ్రదక్షిణంబు సేసి రాసమయంబున. 895

క. గుఱ్ఱములపరువు మెచ్చని, [1]నఱ్ఱులఁ గట్టెసరథంబు ♦ నందప్రముఖుల్
గుఱ్ఱలయార్పులు సెలఁగఁగఁ, దొఱ్ఱులగమి వెంట నంటఁ ♦ దోలి రిలేశా. 896

క. పాటించి గానవిద్యా, పాటవమునఁ దేరు లెక్కి ♦ బహుతానములం
బాటలగంధులు కృష్ణునిఁ, బాటలఁ బాడిరి విరోధి ♦ పాటనుఁ డనుచున్. 897

క. కుండనిభాపీనంబులు, మండితవర్ణములు వివిధ ♦ మహితాకృతులున్
నిండినకడుపులుఁ గన్నుల, పండువులు గఁ బాఁడికుఱ్ఱి ♦ పదువులు జరిగెన్. 898

క. పొగ రెక్కినమూఁపురములుఁ, దెగ గలవాలములు శైల ♦ దేహంబులు భూ
గగనములు నిండుఱంకెలు, మిగుల మెఱయువృషభగణము ♦ మెల్లన నడచెన్.

వ. ఇట్లు పర్వతప్రదక్షిణంబు సేసి గోపకులు మాధవసమేతు లై మందకుం జని రంత మహేంద్రుం డంతయు నెఱింగి మహారోషంబునఁ బ్రళయప్రవర్తకంబు లగుసంవర్తక మేఘంబులం జీరి యి ట్లనియె. 900

మ. పెరుఁగుల్ నేతులు ద్రావి క్రొవ్వి భువి నా ♦ భీసల్ మదాభీరు లై
గిరిసంఘాతకఠోరపత్త్రిదళన ♦ క్రీడాసమారంభదు
ర్భరదంభోళిధరుం బురందరు ననుం ♦ బాటించి పూజింప క

1. నఱ్ఱులఁ.

గ్గిరికిం బూజలు సేసి పోయి రిదె పో కృష్ణుండు ప్రేరేపఁగన్. 901

క. గురుదేవహీను బాలుని, గిరిభూజప్రముఖవాసుఁ గృష్ణు ననీశుం
బరిణామశీలుఁ గులగుణ,విరహితుఁ జేపట్టి యింద్రు విడిచిరి గొల్లల్. 902

ఆ. విమలఘనతరాత్మ విజ్ఞానవిద్యచే, నిగుడ లేక యుడుప నిభము లగుచుఁ
గర్మమయము లైన క్రతువుల భవమహా,ర్ణవము గడవఁ గోరినారు వీరు. 903

శా. ఉద్వృత్సంపద నమ్మి నందతనయో ద్యోగంబునన్ వెఱ్ఱు లై
మద్యాగంబు విసర్జనీయ మని రీ మర్త్యుల్ వశీ మీరు మీ
విద్యుద్వల్లులఁ గప్పి గర్జనములన్ వేధించి గోవుల్ జనుల్
సద్యోమృత్యువుఁ బొంద జాల్ గురియుఁడీ శౌర్యం బవార్యంబు గన్. 904

క. మీ వెంట వత్తు నే నై, రావణానాగంబు నెక్కి రయ మొప్పం గా
దేవగణంబులతోడను, గోవిందునిమంద లెల్లఁ గొందల పెట్టన్. 905

వ. అని యిట్లు వలికి జంభవైరి సంరంభంబున దంభోళి జళిపించి బింకంబున శంకింపక కింకతోడ సంకలియ లూడ్పించిన మహానిలప్రేరితంబు లయి చని నందుని మందమీఁద నమోఘంబు లైన మేఘంబులు మహౌఘంబు లై పన్ని ప్రచండగతిం జండమరీచిమండలంబుఁ గప్పి దివి నిండి దిశ లావరించి రోదోంతరాళంబు నిరంతరనీరంధ్రనిబిడాంధకారబంధురంబుగ నిరోధించి బలిభంజనద్వితీయపాదపల్లవభగ్నం బైన బ్రహ్మాండభాండంబుచిల్లుల జల్లించి తొరఁగుబహిస్సముద్రసలిలనిర్ఝరంబులవడువున నెడ తెగక తోరంబు లైన నీరధారలం గురియుచు శిలల వర్షించుచుఁ బిడుగుల నుఱ్ఱుచు నుండ మిఱ్ఱుపల్లంబులు సమతలంబు లయి యేకార్ణవంబురూపు సూపిన నందు దుడుకడుచుచు నీఁదుచు విలయశిఖిశిఖాసన్నిభవిజృంభమాణవిద్యుల్లతావిలోకంబున రిమ్మలు గొని సొమ్మలు వోవుచున్న లేఁగలును లేఁగలకు మూఁతు లడ్డంబు లిడి ప్రళయభైరవభేరీభాంకారభీషణంబు లగు గర్జనఘోషణంబులఁ జెవుడువడి చిందఱవందఱ లైన డెందంబులం గంది కుందివ్రాలుధేనువులును ధేనువుల వెనుక నిడుకొని దురంతకల్పాంత[1]కాలకీలి కరాళకాలకంఠకరగదాఘాతప్రభూతంబు లై ననిర్ఘాతపాతంబులకు భీతంబు లై హరికి మ్రొక్కి రక్ష రక్షేతిశబ్దంబులు సేయు నైవడి విడువనిజడిం బడి సైరింపక శిరంబులు వంచుకొని గద్గదకంఠంబుల నంభారవంబులు సేయువృషభంబులును వృషభాదిగోరక్షణంబు సేయుచు దుర్వారఘోరశిలాసారంబుల సారంబులు సెడి శరీరంబులు భారంబు లైన మ్రానుపడుగోపకులును గోపకులం బట్టుకొని దట్టం బయినవానఁ గొట్టునం బెట్టువడి బడుగుఁడుములు[2]నుసులువడ వడవడవడంకుచు గోవిందునిం జీరుగోపికలును గోపికాజనకఠినకుచకలశయుగళంబులమఱుంగునం దలలు గుట్టుగొని పరవశు లైనశిశువులు గలిగి మహాఘోషంబుతోడ

1. 'కేళివిలాస - కేళివిశాల - కాళకంఠ' వ్రా. ప్ర. 2. నులుసువడక.

నష్టం బైనఘోషంబుఁ జూచి ప్రబుద్ధు లైనగోపవృద్ధులు గొందఱు దీనజనరక్ష
కుం డైన పుండరీకాక్షునకు మ్రొక్కి యిట్లనిరి. 906

ఉ. అక్కట వానఁ దోఁగి వ్రజ § మాకుల మయ్యెఁ గదయ్య కృష్ణ నీ
వెక్కడ నుంటి వింతదడ § వేల సహించితి నీపదాబ్జముల్
దిక్కుగ నున్న గోపకులు § దీనత నొంద భయాపహారి వై
గ్రక్కునఁ గావ కిట్లునికి § కారుణికోత్తమ నీకుఁ బాడియే. 907

క. ఈ యుఱుములు నీమెఱుములు, నీయశనివిఘోషణములు § నీజలధారల్
నీయాన దొల్లి యెఱుఁగము, కూయాలింపం గదయ్య § గుణరత్ననిధీ. 908

క. వారి [1]బరువయ్యె మందల, వారికి నిదె పరులు లేరు § వారింపం గా
వారిదపటలభయంబును, వారిరుహదళాక్ష నేఁడు § వారింపఁ గదే. 909

వ. అనిన విని సర్వజ్ఞుం డైనకృష్ణుం డంతయు నెఱింగి. 910

ఉ. తన్నొకయింత గైకొనరు § తప్పిరి యాగము చేసి రంచుఁ దా
మిన్ననుండి గోపకుల § మీఁద శిలల్ గురియించుచున్నవాఁ
డున్నతనిర్జరేంద్రవిభ § వోద్ధతగర్వనగాధిరూఢుఁ డై
కన్నులఁ గానఁ డింద్రుఁ డిటు § గర్వపరుం డొరుఁ గాన నేర్చునే. 911

క. దేవత లందఱు నన్నును, సేవింతురు రాజ్యమదముఁ § జెందరు చెఱుపం
గా వలదు మానభంగము, గావింపఁగ వలయు శాంతి § గలిగెడుకొఱకై. 912

వ. అని చింతించి శిలావర్షహతు లై శరణాగతు లైనఘోషజనుల రక్షించుట తగ
వని సకలలోకరక్షకుం డయినవిచక్షణుండు. 913

చ. కలఁగకుఁడీ వధూజనులు § కంపము నొందకుఁడీ వ్రజేశ్వరుల్
తలఁగకుఁడీ కుమారకులు § తక్కినవారలు § తాలవానచే
నలఁగకుఁడీ పశువ్రజము § నక్కడ నక్కడ నిల్వ నీకుఁడీ
మెలపున మీకు నీశ్వరుఁడు § మే లొసఁగుం గరుణార్ద్రచిత్తుఁ డై. 914

వ. అని పలికి. 915

### శ్రీకృష్ణుఁడు గోవర్ధనపర్వతము నెత్తుట.

క. కిరి యై ధర యెత్తినహరి, కరి సరసిజముకుళ మెత్తు § గతిఁ ద్రిభువనశం
కరకరుఁ డై గోవర్ధన, గిరి యెత్తెం జక్క నొక్క § కేలన్ లీలన్. 916

క. దండివి బ్రహ్మాండంబులు, చెండుల క్రియఁ బట్టి యెగురఁ § జిమ్మెడుహరికిన్
గొండఁ బెకలించి యెత్తుట, కొండొకపని గాక యొక్క § కొండా తలఁపన్. 917

వ. ఇట్లు గిరి యెత్తి. 918

శా. బాలుం డాడుచు నాతపత్ర మని సం § భావించి పూఁగుత్తి కెం
గేలం దాల్చినలీల లేనగవుతోఁ § గృష్ణుండు దా నమ్మహా

---

1. బరవయ్యె.



౯౪౩, శ్రీకృష్ణుఁడు గోవర్ధన పర్వతము నెత్తుట.

బులు పలికిరి సిద్ధసాధ్యగంధర్వవరులు విరులు గురియించిరి సురలు శంఖదుందు
భులు మొరయించిరి తుంబురుప్రముఖు లయిన గంధర్వులు పాడి రప్పుడు. 929

క. వల్లవకాంతలు దనకథ, లెల్లను బాడంగ నీర § జేక్షణుఁ డంతన్
వల్లవబలసంయుతుఁ డై, యొల్లన గోష్ఠంబు సేరె § నుర్వీనాథా. 930

వ. అయ్యవసరంబునఁ గృష్ణుచరిత్రంబులు దలంచి వెఱఁగుపడి గోపజనులు నందున
కిట్లనిరి. 931

సీ. కన్నులు దెఱవని § కడుఁజిన్నిపాపఁ డై, దానవిచనుఁబాలు § ద్రాగి చంపె
మూఁడవనెలనాఁడు § ముద్దులబాలుఁ డై, కోపించి శకటంబుఁ § గూలఁ దన్నె
నేఁడాదికుఱ్ఱఁ డై § యెగసి తృణావర్తు, మెడఁ బట్టుకొని కూల్చి § మృతునిఁ జేసెఁ
దల్లి వెన్నలకు నై § తనుఁ గోలఁ గట్టినఁ, గోమరుఁ డై మద్దులు § గూల నీడ్చెఁ

తే. బసులఁ గ్రేపులఁ గాచుచు § బకునిఁ జీరె, వెలఁగతోఁ వత్సదైత్యుని § వ్రేసి గెడపె
సబలుఁ డై ఖరదైత్యుని § సంహరించె, నితఁడు కేవలమనుజుఁడే § యెంచిచూడ.

క. తెంపరి యై రామునిచేఁ, జంపించెఁ బ్రలంబు మ్రింగెఁ § జటులదవాగ్నిన్
సొంపు సెడఁ ద్రొక్కెఁ గాళియుఁ, ద్రుంపక కాళింది వెడలఁ § ద్రోలెన్ లీలన్.

క. ఏడేండ్లబాలుఁ డెక్కడ, క్రీడం గిరి తమ్మి యెత్తు § క్రియ నందఱముం
జూడ గిరి యెత్తు టెక్కడ, వేడుక నొకచేత నేఁడు § వెఱఁ గాఁ గాదే. 934

క. ఓ నంద గోపవల్లభ, నీనందనుఁ డాచరించు § నేర్పరితనముల్
మానవులకు శక్యంబులె, మానవమాత్రుండె నీ కు § మారుఁడు దండ్రీ. 935

వ. అనిన విని నందుండు వారలం జూచి మున్ను తనకు గర్గమహాముని చెప్పినసంకే
తంబు దెలిపి శంక లేదు కృష్ణుండు లోకరక్షకుం డయినపుండరీకాక్షుని నిజాం
శంబ యనుచు సంతరంగంబునం జింతింతు నని పలికిన వెఱఁగుపడి గోపకులు
గృష్ణుం డనంతుం డని పూజించి రంత. 936

మ. హరి కేలన్ గిరి యెత్తి వర్షజలబ § న్నాభీరగోరాజికిన్
శరణం బైనఁ ద్రిలోకరాజ్యమదముం § జాలించి నిర్గర్వుఁ డై
సురభిం గూడి బలారి వచ్చి కనియెన్ § సొంపేది దుష్టప్రజే
శ్వరదుర్మాననిరాకరిష్ణుఁ గరుణా § వర్ధిష్ణు శ్రీకృష్ణునిన్. 937

క. కని యింద్రుఁడు పూజించెను, దినకరసన్నిభనిజకిరీట § దీధితిచేతన్
మునిహృదలంకరణంబులు, సునతోద్ధరణములు నంద § సుతుచరణంబుల్. 938

వ. ఇట్లు నమస్కరించి కరకమలంబులు ముకుళించి హరికి హరిహయుం డిట్లనియె.

సీ. పరమ నీధామంబు § భాసురసత్త్వంబు, శాంతంబు హతరజ § స్తమము నిత్య
మధికతపోమయ § మట్లు గావున మాయ, నెగడెడిగుణములు § నీకు లేవు
గుణహీనుఁడవు గాన § గుణముల నయ్యెడి, లోభాదికములు నీ § లోనఁ జేర
వైన దుర్జననిగ్ర § హము శిష్టరక్షయుఁ, దగిలి చేయఁగ దండ § ధారి వగుచు

తే. జగము భర్తవు గురుఁడవు జనకుఁడవును, జగదధీశుల మనుమూఢజనులు దలఁక
నిచ్చవుట్టినరూపంబు లీవు దాల్చి, హితము సేయుదు గాదె లోకేశ్వరేశ. 940

క. నావంటివెఱ్ఱివారిని, శ్రీవల్లభ నీవు శాస్తి సేసితి వేనిం
గావరము మాని పెద్దల, త్రోవం జరగుదురు బుద్ధి దోఁచిన నీశా. 941

క. ఒక్కొకలోకముఁ గాచుచు, నెక్కుడుగర్వమున నేమె యీశుల మనుచుం
జొక్కి నను బోఁటివెఱ్ఱులు, నిక్కము నీమహిమఁ దెలియ నేర రనంతా. 942

ఆ. వాసుదేవ కృష్ణ వరద స్వతంత్ర విజ్ఞానమయ మహాత్మ సర్వపుణ్య
పురుష నిఖిలబీజ భూతాత్మక బ్రహ్మ, నీకు వందనంబు నిష్కలంక. 943

శా. నీసామర్థ్య మెఱుంగ మేఘములచే నీఘోషమున్ భీమనో
గ్రాసారంబున ముంచితిన్ మఖము నా కై వల్లవుల్ సేయ రం
చో సర్వేశ భవత్సహాత్వమున నా యుద్యోగ మి ట్లయ్యె నీ
దాసున్ నన్నుఁ గృతాపరాధుఁ గరుణన్ దర్శింపవే మాధవా. 944

మ. నిను బ్రహ్మాదు లెఱుంగలేరు జడతా నిష్ఠుండ లోకత్రయా
వనదుర్మానగరిష్ఠుఁడన్ విపులదుర్వైదుష్యభూయిష్ఠుఁడన్
వినయత్యాగపరిష్కృతాంగుజన గర్విశ్రేష్ఠుఁడన్ దేవ నీ
ఘనలీలావిభవంబు పెంపుఁ దెలియం గా నెవ్వఁడన్ సర్వగా. 945

వ. అనిన విని నగుచు జలధర గంభీర రవంబున శక్రునకుం జక్రి యి ట్లనియె. 946

మ. అమరాధీశ్వర లక్ష్మిఁ దగిలి యి ట్లంధుండ వై యున్ననీ
సమదోద్రేకము ద్రుంచి వైచుటకు నీజన్నంబు దప్పించితిం
బ్రమదశ్రీకులు దండధారి నగుటన్ భావింప రెవ్వారి ని
క్కము రక్షింపఁ దలంతు వారి నధముం గావింతు జంభాంతకా. 947

క. నాయాజ్ఞ సేయు చుండుము, నీయధికారంబునందు నిలువు సురేంద్ర
శ్రీయుతుఁడ వై మదింపకు, శ్రేయంబులు గల్గుఁ బొమ్ము సితకరిగమనా. 948

వ. అని యిట్లు జిష్ణునిం బలుకు చున్న కృష్ణునికి మ్రొక్కి గోగణసమేత యయిన కామధేనువు భక్తజనకామధేను వయిన యీశ్వరున కి ట్లనియె. 949

క. విశ్వేశ విశ్వభావన, విశ్వాప్త యోగివంద్య విను నీచేతన్
శాశ్వతుల మైతి మిప్పుడు, శాశ్వతముగఁ గంటి మధిక సౌఖ్యంబు హరీ. 950

వ. దేవా మాకుం బరమదైవతంబ వింద్రుండవు భూసురగోసురసాధుసౌఖ్యంబుల కొఱకు నిన్ను నింద్రునిం జేసి పట్టంబు గట్టు మని విరించి నియమించి పుత్తెంచె నీవు భూతలభూరిభారనివారణంబు సేయ నవతరించినహరి వని పలికి యంత. 951

మ. సురభిక్షీరములన్ సురద్విపమహాశుండాలతానీతని
ర్జరగంగాంబువులన్ నిలింపజననీసన్న్యాససంఘంబుతో
సురనాథుం డభిషిక్తుఁ జేసి పలికెన్ సొంపార గోవిందుఁ డం

చు రణాక్రాంతవిపక్షుఁ దోయజదళాక్షున్ సాధుసంరక్షకున్. 952

సీ. తుంబురునారదాదులు సిద్ధచారణ, గంధర్వులును హరికథలు వాడి
రమరకాంతలు మింట నాడిరి వేల్పులు, గురియించి రంచిత కుసుమవృష్టి
జగములు మూఁడును సంతోషమునఁ బొందెఁ, గుఱ్ఱులచన్నులఁ గురిసెఁ బాలు
నవజలంబులతోడ నదు లెల్లఁ బ్రవహించెఁ నిఖిలవృక్షములు దేనియలు వడిసె

తే. సర్వలతికల ఫలపుష్పచయము లమరెఁ, బర్వతంబులు మణిగణప్రభల నొప్పెఁ
బ్రాణులకు నెల్లఁ దమలోని పగలు మాఁనె, వాసుదేవునియభిషేక వాసరమున.

వ. ఇట్లు గోపగోగణపతిత్వంబునకు గోవిందు నభిషిక్తుం జేసివీడ్కొని పురందరుండు (దేవగణంబులతో దివంబున) కరిగె నంత. 954

శ్రీకృష్ణమూర్తి నందుని వరుణనగరమునుండి కొని తెచ్చుట.

సీ. నందుఁ డేకాదశి నాఁ డుపవాసంబు, సేసి శ్రీహరిపూజ సేసి దనుజ
వేళ యెఱుంగక వేగక ముంపర, ద్వాదశీస్నానంబు దగ నొనర్ప
యమునాజలము సొర[1]నం దొక్క దైత్యుండు, నందుని వరుణుని నగరమునకుఁ
గొనిపోవఁ దక్కిన గోపకు లందఱు, నందగోపకునిఁ గానక కలంగి

తే. రామకృష్ణులఁ బేర్కొని రవము సేయఁ
గృష్ణుఁ డీశుండు దమతండ్రిఁ గికురువెట్టి
వరుణభృత్యుండు గొనిపోయి వరుణుఁ జేర్చు
టెఱిఁగి రయమున నచ్చోటి కేఁగె నధిప. 955

వ. అప్పుడు. 956

క. వచ్చినమాధవుఁ గనుఁగొని, చెచ్చెర వరుణుండు పూజ సేసి వినతుఁడై
యచ్చుగ ని ట్లని పలికెను, విచ్చేసితి దేవ నానివేశంబునకున్. 957

ఉ. ఏవిభుపాదపద్మరతు లెన్నఁడు నెవ్వరుఁ బొంద లేసిపెం
ద్రోవఁ జరింతు రట్టిబుధతోషక నీ వగుదెంచుటం బ్రమో
దావృత మయ్యెఁ జిత్తము కృతార్థత నొందె మనోరథంబు నీ
సేవఁ బవిత్రభావమునఁ జెందె శరీరము నేఁడు మాధవా. 958

ఉ. ఏపరమేశ్వరుం జగము లిన్నిటిఁ గప్పినమాయ గప్పఁగా
నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మక యట్టినీకు ను
ద్దీపితభద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దనూ
తాపము వాయ మ్రొక్కెద సుదార తపోధనచక్రవర్తికిన్. 959

చ. ఎఱుఁగఁడు వీఁడు నాభటుఁ డొకించుక యైన మనంబులోపలం
దెలుకువ లేక నీజనకుఁ దెచ్చె దయం గొని పొమ్ము ద్రోహముం
మఱవుము నన్ను నీభటుని మన్నన సేయుము [2]నీదుసైరణన్

1. 'సర్వ వరుణదూత' అ. ప్ర. 2. నీవు సైరణన్ వఱలుదు గాదె,

వఱలుదుఁ గాదె యోజనక । వత్సల నిర్మల భక్తవత్సలా. 960

వ. అని యిట్లు వలుకుచున్నవరుణునిం గరుణించి తండ్రిం దోడ్కొని హరి దిరిగి వచ్చెనంత నందుండు దన్ను వెన్నుండు వరుణనగరంబుననుండి విడిపించి తెచ్చిన వృత్తాంతం బంతయు బంధువులకెఱింగించిన వారలు కృష్ణుం డీశ్వరుం డని తలంచి రఖిలదర్శనుండయినయీశ్వరుండును వారలతలం పెఱింగి వారికోరిక సఫలంబు సేయుదు నని వారి నందఱ బ్రహ్మహ్రదంబున ముంచి యెత్తి. 961

ఆ. ప్రకృతి కామకర్మ । పరవశ మై యుచ్చ,నీచగతులఁ బొంది । నెఱయ భ్రమసి
తిరుగుచున్నజనము । తెలియ నేరదు నిజ,గతివిశేష మీజ।గంబునందు. 962

మ. అని చింతించి దయాళుఁ డైనహరి మా । యాదూర మై జ్యోతి యై
యనిరూప్యంబును సత్య మై [1]యెఱుక యై । యానంద మై బ్రహ్మ మై
యనఘాత్ముల్ గుణనాశమందుఁ గను ని । త్యాత్మీయలోకంబు గ్ర
క్కునఁ జూపెం గరుణార్ద్రచిత్తుఁ డగుచుం । గోపాలకశ్రేణికిన్. 963

వ. ఇట్లు హరి మున్నక్రూరుండు వొందినలోక మంతయుం (జూపి బ్రహ్మలోకంబు) సూపినం జూచి నందాదులు పరమానందంబునం బొంది వెఱఁగుపడి హంసస్వరూపకుం డైనకృష్ణునిం బొడగని పూజించి రంత. 964

చ. కలువలమేలికందువలు । [2]కామునికయ్యపుఁబాళిమూల్ విర
[3]క్తులు దలడించువేళలు చ । కోరకపంక్తులభోగకాలముల్
సెలువలు సైరణల్ విడిచి । చిక్కుటఱుల్ ఘనచంద్రచంద్రికా
జ్వలితదిశల్ శరన్నిశలు । జారకదుర్దశ లయ్యె నయ్యెడన్. 965

ఆ. కామతంత్రటీక । కలువలజోక కం, దర్పడాక విటుల । తాల్మిపోక
చకితచక్రవాక । సంప్రీతజనలోక, రాక వచ్చె మేలు । రాక యగుచు. 966

క. పతి దనకరములఁ గుంకుమ, సతిమొగమున నలఁదుభంగి । సముదయవేళాం
చితకరరాగమున నిశా, పతి రంజించెన్ నరేంద్ర । ప్రాక్సతిమొగమున్. 967

సీ. [4]విటసేనపై దండు । వెడలెడువలఱేని, గొల్లెనపై హేమ । కుంభ మనఁగఁ
గాముకధృతివల్లి । గలు ద్రెంప నెత్తిన,శంబరాంతకుచేతి । చక్ర మనఁగ
మారుండు పాంథుల । మానాటవులు గాల్పఁ, గూర్చిననిప్పుల । కుప్ప యనఁగ
విరహిమృగముల । వేఁటాడ మదనుండు, దెచ్చినమోహన । దీప మనఁగ

ఆ. వింతనునుపు గల్గి । వృత్త మై యరుణ మై, కాంతితోఁ జకోర।గణము లుబ్బఁ
బొడుపుఁగొండచక్కిఁ । బొడిచె రాకాచంద్ర,మండలంబు గగన । మండలమున.

శరద్రాత్రిం గాన మొనర్చుకృష్ణుసన్నిధికి గోపికలు వచ్చుట.

వ. ఇట్లు వొడిచి నవకుంకుమాంకితరమాముఖ[5]మండలంబునుంబోలె నఖండం బైన

---

1. యతులమై. 2. కామునికయ్యపుబాణముల్; కామశరాసవిముక్తబాణముల్. 3. కులుకురథాంగసంప్రీతిచకోరకపంక్తులభోగకాలముల్ 4. విరహులపై. 5. 'మండలమండితం బై యఖండం' వ్రా. ప్ర.

చంద్రమండలంబుఁ బొడగని పుండరీకనయనుండు యమునాతటవనంబున జగన్మోహనంబుగా నొక్కగీతంబుఁ బాడిన విని పరాయత్తచిత్తలై తత్తఱంబున బ్రేంత లేపనములకుం జేతు లాడకయు గోవులకుం గ్రేపుల విడువకయు విడిచి విడిచియు పీడకయు పీడి యీడియు పీడినపాలు గాఁపకయుఁ గాఁచి కాఁచియుఁ గాఁగినపాలు డింపకయు డించి డించియు డించినపాలు బాలురకుం బోయకయుఁ బోసి పోసియుఁ బతులకుఁ బరిచర్యలు సేయకయుఁ జేసి చేసియు నశనంబులు గుడువకయుఁ గుడిచి కుడిచియుఁ గుసుమంబులు ముడువకయు ముడిచి ముడిచియుఁ దొడవులు దొడుగకయుఁ దొడిగి తొడిగియు గోష్ఠంబుపట్టుల నుండకయుఁ బాయసంబు నెఱయ వండకయు నర్మ్యోయెడల నిలువం బడకయుఁ గాటుకలు నూటి నిడకయుఁ గురులు నక్క నొత్తకయుఁ గుచంబుల గంధంబులు గలయ మెత్తకయుఁ బయ్యెదలు విప్పి కప్పకయు సఖులకుం జెప్పకయు సహోదరులు మగలు మామలు మఱందులు బిడ్డలు నడ్డంబు చని నివారింపం దలారింపకయు సంచలించి పంచభల్లునిభల్లంబుల మొల్లంపుజల్లుల వెల్లువం దల్లడిల్లి డిల్లపడి మొగిళ్లగమి వెలువడి యుల్లసించుతటిల్లతలపోఁడున మందగమన లమందగమనంబుల మంద వెలువడి గోవిందసందర్శనంబునకుం జనిరప్పుడు. 969

మ. తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక త
ద్విరహాగ్నిం బరితాప మొందుచు మనోవీథిన్ విభున్ మాధవుం
బరిరంభంబులు సేసి జారుఁ డనుచున్ భావించియుం జొక్కి పొం
దిరి ముక్తిన్ గుణదేహమున్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై. 970

వ. అనిన నరేంద్రుం డిట్లనియె. 971

క. జారుఁ డని కాని కృష్ణుఁడు, భూరిపరబ్రహ్మ మనియు బుద్ధిం దలంపన్
నేరరు గుణమయదేహము, లేరీతిన్ విడిచి రింతు లెఱిఁగింపు శుకా. 972

వ. అనిన శుకుం డిట్లనియె. 973

మ. మును నేఁ జెప్పితిఁ జక్రికిం బగతుఁడై మూఢుండు చైద్యుండు పెం
పునఁ గైవల్యపదంబు నొందెఁ బ్రియులై పొందంగ రాకున్న దే
యనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డగుణుండై నట్టిగోవిందుమూ
ర్తి నరశ్రేణికి ముక్తిదాయిని సుమీ తెల్లంబు భూవల్లభా. 974

ఆ. బాంధవమున నైనఁ బగ నైన వగ నైన, బ్రీతి నైనఁ బ్రాణభీతి నయిన
భక్తినైన హరికిఁ బరతంత్రులైయుండు, జనులు మోక్షమునకుఁ జనుదు రధిప.

వ. అటు గావునఁ బరమపురుషుండును నజుండును యోగీశ్వరేశ్వరుండును నైన హరిని సోఁకినస్థావరం బయిన ముక్తం బగు వెఱఁగుపడ వలవ దివ్విధంబున. 976

క. ఘనమధురగీతనినదము, విని వచ్చినగోపికలను వీక్షించి నయం

బున మేటి [1]సుగుడి నేర్పరి, తనవాగ్వైభవంబు మెఱయఁ § దగ నిట్లనియెన్. 977

శా. మేలా [2]మీకు భయంబు పుట్టదు గదా § మీమందకున్ సింహశా
ర్దూలానేకపముఖ్యముల్ దిరిగెడిన్ § దూరంబు లేతెంతురే
యేలా వచ్చితి రీనిశాసమయమం § దిచ్చోట వర్తింతురే
చాలుం జాలు లతాంగులార చనుఁడా § సంప్రీతిఁ గోమందకున్. 978

శా. మీ రేతెంచినజాడఁ గానక వగన్ § మీతల్లులుం దండ్రులున్
మీరాముల్ మఱఁదుల్ తనూజులు గురుల్ § మీసోదరుల్ బంధువుల్
మేరల్ మీఱిరె లేరు పోఁడ్రనుచున్ § మీఘోషభూభాగమం
దేరీతిం బరికించిరో తగవు లే § యీసాహసోద్యోగముల్. 979

చ. ఇలువడి సున్న సేసి హృద § యేశుల [3]సిగ్గులు వుచ్చి యుత్తమా
మల నెరియించి సోదరుల § మానము సూఱలు వుచ్చి తల్లిదం
డ్రులరుచి మాన్చి బంధులకు § రోఁత యొనర్చుచు జారవాంఛలన్
వల నఱి సత్కులాంగనలు § వత్తురె లోకులు సూచి మెత్తురే. 980

సీ. ప్రాణేశుఁ డెఱిఁగిన § బ్రాణంబునకుఁ దెగు, దండించు నెఱిఁగిన § ధరణివిభుఁడు
మామ యెఱింగిన § మను వెల్లఁ జెడిపోవుఁ దలవరి యెఱిఁగినఁ § దగులు సేయుఁ
దలిదండ్రు లెఱిఁగినఁ § దల లెత్త కుండుదు, రేరా లెఱింగిన § నెత్తి పొడుచు
నాత్మజు లెఱిఁగిన § నాదరింపరు చూచి, బంధువు లెఱిఁగిన § బహి యొనర్తు

ఆ. రితరు లెఱిఁగి రేని § నెంతయుఁ జులకఁగాఁ, జూతు రిందు నందు § సుఖము లేదు
యశము లేదు నిర్భయానందమును లేదు, జారుఁ జేరఁ జనదు § చారుముఖికి. 981

క. నడవడి గోఱగా కున్నను, బడు గైనఁ గురూపి యైనఁ § బామరుఁ డైనన్
జడుఁ డైన రోగి యైనను, విడుచుట మర్యాద గాదు § విభు నంగనకున్. 982

చ. ఇది యమునానదీజలస § మేధితపాదపపల్లవప్రసూ
నదళవిరాజితం బగువ § నంబు మనంబులు మేర దప్పెనో
[4]పొదఁ డటు నేడ్చుబిడ్డలకుఁ § బోయుఁడు పాలు విడుండు లేఁగలన్
మొదవులకున్ నిజేశ్వరుల § ముద్దియలార భజింపుఁ డొప్పుగన్. 983

చ. వనితలు నన్నుఁ గోరి యిట § వచ్చితి రింతఁ గొఱంత లేదు మే
లొనరె సమస్తజంతువులు § నోలిఁ బ్రియంబులు గావె నాకు నై
నను నిలువంగఁ బోలదు స § నాతనధర్మము లాఁడువారికిం
బెనిమిటులన్ భజించుటలు § [5]పెద్దలు సెప్పుచు నుందు రెల్లెడన్. 984

క. ధ్యానాకర్ణనదర్శన, గానంబుల నాతలంపు § గలిగినఁ జాలుం
బూనెదరు కృతార్థత్వము, మానవతుల్ చనుఁడు మరలి § మందిరములకున్.

వ. అనిన విని. 986

---

1. సుగుణి. 2. మీ కశుభంబు. 3. సిగ్గులఁ జంపి. 4. 'పొదిఁగిట' అ. ప్ర. 5. పెద్దగఁ.

సీ. విరహాగ్నిశిఖలతో ♦ వెడలునిట్టూర్పుల, ముమ్మరంబునఁ గంది ♦ మోము లెండ
గన్నుల వెడలెడి ♦ కజ్జలధారలు, [1]కుచకుంకుమంబుల ♦ గ్రొచ్చి పాఱఁ
జెక్కులఁ జేర్చిన చేతులవేఁడిమిఁ, మోముఁదమ్ములమేలి ♦ మెఱుఁగు డిందఁ
బొరిఁబొరిఁబుంఖాను ♦ పుంఖంబులై తాఁకు, మదనుకోలల ధైర్య మహిమ లెడల
తే. దుఃఖభరమున మాటలు ♦ దొట్రుపడఁగఁ, బ్రియములాడని ప్రియుఁ జూచి ♦ బెగ్గడిల్లి
చరణముల నేల వ్రాయుచు ♦ సంభ్రమమునఁ, గాంతలెల్లను వగలనా ♦ క్రాంతలగుచు. 988

వ. ఇట్లనిరి.

మ. అకటా నమ్మితి మేము క్రూరుఁడన ని ♦ న్నర్థంబె మా యిండ్లలో
సకలవ్యాప్తుల డించి నీపదసరో ♦ జాతంబు లర్చింపఁ జ
క్కక యేతెంచితి మీశుఁ డాఢ్యుఁడు ముము ♦ క్షూసక్తులం గాచుపో
లికఁ గావం దగుఁ గావవే విమనమై ♦ లే కాంతలన్ భ్రాంతలన్. 989

మ. పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం ♦ బాటించు టే ధర్మ ప
ద్ధతి యా నంటివి దేహధారిణులకున్ ♦ ధర్మజ్ఞ చింతింపుమా
పతిపుత్త్రాదికనామమూర్తి వగుచున్ ♦ భాసిల్లు నీయందుఁ ద
త్పతిపుత్త్రాదికవాంఛలం జలిపి సం ♦ భావించు టన్యాయమే. 990

మత్తకోకిలము. నీపయిన్ రతి సేయుచుందురు ♦ నేర్పరుల్ సతతప్రియో
ద్దీపకుండవు గాన నెవ్వగఁ ♦ దెచ్చునాథసుతాదులం
జూప నేటికి మన్మహాశలు ♦ సుట్టి నీకడ నుండఁగాఁ
బాప నేల మదీయతాపముఁ ♦ [2]బాపఁ బోలుఁ గృపానిధీ. 991

సీ. నీపాదకమలంబు ♦ నెమ్మి డగ్గఱఁ గాని, తరలి పోవంగఁ బాదములు రావు
నీకరాబ్జంబులు ♦ నెఱి నంటి తీసఁ గాని, తక్కిన పనికి హస్తములు సొరవు
నీవాగమృతధార ♦ నిండఁ గ్రోలఁగఁ గాని, చెవు లన్యభాషలు ♦ సేరి వినవు
నీసుందరాకృతి ♦ నియతిఁ జూడఁగఁ గాని, చూడ వన్యంబులఁ ♦ జూడ్కి కనులు
ఆ. నిన్నుఁ గాని పలుక ♦ నేరవు మా జిహ్వ, లొల్ల ననుచుఁ బలుక ♦ నోడ వీవు
మా మనంబు లెల్ల ♦ మరపి దొంగిలితివి, యేమి సేయువార ♦ మింకఁ గృష్ణ. 992

చ. సిరికి నుదారచిహ్నములు ♦ సేయు భవచ్చరణారవిందముల్
సరసిజనేత్ర మాతపము ♦ సంపదఁ జేరితి మెట్టకేలకున్
మరలఁగ లేము మా మగల ♦ మాటల నొల్లము పద్మగంధముల్
మరగిన తేఁటు లన్యకుసు ♦ మంబుల[3]కుం జన నిచ్ఛయించునే. 993

ఆ. సవతు లేక నీవి ♦ శాలవక్షస్స్థలిఁ, దొలసి తోడఁ గూడఁ ♦ దోయజాక్ష
మనువు మనుచు నెపుడు ♦ మా కాంత నీపాద, కమలరజముఁ గోరుఁ ♦ గాదె కృష్ణ.

---

1. కుచకుట్మలంబుల ♦ గ్రుచ్చి పాఱ. 2. బాపవే-బాసితేము. 3. చెంతలఁ జేగ నేర్చునే.

ఉ. అత్తలు మామలున్ బగవ నాడిక కోడక నాథు[1]లన్ దగా
యత్తులఁజేసి యిల్వరుస లాఁగిడి పోవఁగ నీదునవ్వులన్
మెత్తనిమాటలన్ మరుఁడు మేల్కని యేఁచిన వచ్చినార మే
పొత్తుల నొల్ల మోపురుష భూషణ దాస్యము లిచ్చి కావవే. 995

మ. మగువల్ సిక్కరె తొల్లి వల్లభులకున్ మన్నించి తద్వల్లభుల్
మగపంతంబు దలంపరే తగులముల్ మాపాలనే పుట్టెనే
మగవా రాడెడుమాటలే తగవు నీ మాటల్ మనోజాగ్నిచేఁ
బొగులం జాలము కౌఁగిలింపుము మముం బుణ్యంబు పుణ్యాత్మకా. 996

ఉ. కుండలదీప్తగండమును గుంచితకుంతలఫాలమున్ సుధా
మండితపల్లవాధరము మంజులహాసవిలోకనంబు నై
యుండెడునీముఖంబుఁ గని యుండఁగ వచ్చునె మన్మథేక్షుకో
దండవిముక్తబాణముల దాసుల మయ్యెద మాదరింపవే. 997

సీ. నీయధరామృత నిర్ఝరంబుల నేఁడు, నేరి వాతెఱలపైఁ జిలుక కున్న
నీ విశాలాంచిత నిర్మలవక్షంబుఁ, గుచకుట్మలంబులఁ గూర్ప కున్న
నీరమ్యతరహస్త నీరజాతంబులు, చికురబంధంబులఁ జేర్ప కున్న
నీకృపాలోకన నివహంబు మెల్లన, నెమ్మొగంబులమీఁద నెఱప కున్న

ఆ. నీ నవీనమాన నీ య సల్లాపంబు, కర్ణరంధ్రదిశలఁ గప్ప కున్న
నెట్లు బ్రదుకువార మెంతఁ జేరెడువార, మధిపవినఁగఁదగ దెఱయాఁడుకుయులు.

మ. భవదాలోకనహాసగీతజములై భాసిల్లు కామాగ్నులన్
భవదీయాధరపల్లవామృతముచేఁ బాపం దగుం బాపవే
ని వియోగానలహేతిసంహతులచే నీఱై భవచ్చింతలన్
భవదంఘ్రిద్వయవీథిఁ బొందెదము నీ పాదంబులానం బ్రియా. 999

క. తరుమృగఖగగోగణములు, కర మొప్పెడునిన్నుఁ గన్న గానము విన్నం
గరఁగి పులకించు నబలలు, గరఁగరె నినుఁ గన్న నీదు గానము విన్నన్. 1000

సీ. ఈపంచబాణాగ్ని నేవెంట నార్తుము, నీ మంజువాగ్వృష్టి నెగడదేని
నీమన్మథాంభోధి నేత్రోవఁ గడతుము, నీదృష్టి నావయై నిలువదేని
నీచిత్తజధ్వాంత మేజాడఁ జెఱుతుము, నీహాసచంద్రిక నిగుడదేని
నీదర్పకజ్వర మేభంగి నడఁతుము, నీనవాధరసుధ నింపవేని

ఆ. నెట్లు నిర్వహింతు మేలాగు మాలాగు, కరుణ సేయవేనిఁ గదియవేని
మరుఁడు నిర్దయుండు మన నిచ్చునే యశో, దాకుమార యువతి ధైర్యచోర.

క. అమరులఁ గాచినహరిక్రియఁ, గమలేక్షణ నీవు నేఁడు కరుణ నభయహ
స్తము మాయురముల శిరములఁ, బ్రమదంబున నిడుము మూర్ఛపాల్పడకుండన్.

---

1. లల్పకాల స్వరాలం ద్రపాయత్తులఁ.

క. [1]కట్టా తలమునుకలు నై, దట్టపువిరహాబ్ధి తెరలు తరుణుల నేఁపఁగ
నెట్టఁగ దరిఁ జేర్ప వయో, కట్టిఁడివి గదా కుమార కరుణోదారా. 1003

వ. అని యిట్లు కుసుమశరునిశరపరంపరాపరవశ లై యోపికలు లేక పలికిన గోపికలదీనాలాపంబులు విని నవ్వి యోగీశ్వరేశ్వరుం డయినకృష్ణుం డాత్మారాముం డై వారలతోఁ రమించె నప్పుడు. 1004

మ. కరుణాలోకనములం బటాంచలకచాకర్షంబులన్ మేఖలా
కరబాహుస్తనమర్శనంబుల నఖాంకవ్యాప్తులన్ నర్మవా
క్పరిరంభంబుల మంజులాధరసుధాపానంబులం గాంతలం
గరఁగించెన్ రతికేళిఁ గృష్ణుఁడు గృపం గందర్పుఁ బాలార్చుచున్. 1005

క. మక్కువ వికసితవదనలు, చక్కఁగఁ దనుఁ గొల్వ హాసచంద్రికతోడన్
మిక్కిలి మెఱసెను గృష్ణుఁడు, చుక్కలగమినడిమిపూర్ణసోమునిభంగిన్. 1006

ఆ. సతులు దన్నుఁ బాడ సంప్రీతి నాడుచు, నఱుత నున్నవైజయంతితోడ
వనజలోచనుండు వనభూషణుం డయ్యె, యువతిజనశతంబు లోలిఁ గొలువ.

ఉ. చిక్కక యీశుఁ డై యెవరిఁ జిక్కులఁ బెట్టెడిమాయలానికిం
జిక్కి కృతార్థ లై మఱుని చిక్కులఁ జొక్కి లతాంగు లుండఁగా
మక్కువ శాంతి సేయుటకు మన్నన సేసి ప్రసన్నుఁ డౌటకుం
జక్కన నావిభుండు గుణశాలి తిరోహితుఁ డయ్యె నయ్యెడన్. 1008

వ. ఇట్లు హరి గనుమొఱఁగి చనిన (తెఱఁ)గు గానక (కరిం బాసి) తిరుగుకరిణులపెల్లున నుల్లంబులు దల్లడిల్ల వల్లవకాంతలు తదీయ గమనహాస లీలావిలాసవీక్షణవిహార వచనరచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి వివిధచేష్టలకుం బాల్పడి తదాత్మకత్వంబున నేన నేన కృష్ణుండ నని కృష్ణగుణావేశంబులం జరియించుచు. 1009

క. భూతములలోన వెలిఁ బ్రఖ్యాతుం డగునట్టివానిఁ గాంతలు గాళిం
దీతీరవనాంతరముల, [2]బ్రాంతిన్ వెదకంగఁ జనిరి పాడుచు నధిపా. 1010

సీ. పున్నాగ కానవే పున్నాగవందితుఁ, దిలకంబ కానవే తిలకనిటలు
ఘనసార కానవే ఘనసారశోభితు, బంధూక కానవే బంధుమిత్రు
మన్మథ కానవే మన్మథాకారుని, వంశంబ కానవే వంశధరునిఁ
జందన కానవే చందనశీతలుఁ, గుందంబ కానవే కుందరదను

తే. నింద్రభూజమ కానవే యింద్రవిభవుఁ, గువలవృక్షమ కానవే కువలయేశుఁ
బ్రియకపాదప కానవే ప్రియవిహారు, ననుచుఁ గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు.

వ. మఱియును. 1012

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ

1. క. కట్టా తలమునుకలు నై - తలమునుఁగుడు లై, దట్టపువిరహాగ్నిశిఖలు తరుణుల నేఁపన్, నెట్టుం-బలుకవు చూడవు. 2. భ్రాంతిన్.

జల్లెడువాఁడు మాళిపరి § సర్పితపింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడుమోమువాఁ డొకఁడు § చెల్వలమానధనంబు, దెచ్చె నో
మల్లియలార మీ పొదల § మాటున లేఁడు గదమ్మ చెప్పరే. 1013

ఉ. అంగజు నైనఁ జూడ హృద § యంగముఁ డై కరఁగించువాఁడు శ్రీ
రంగదురంబువాఁడు మధు § రం బగు వేణురవంబువాఁడు మ
మ్మంగజుపువ్వుఁదూపులకు § సగ్గము సేసి లవంగ లుంగ నా
రంగములార మీకడకు § రాఁడు గదా [1]కృప నున్నఁ జూపరే. 1014

సీ. మానినీమన్మథు § మాధవుఁ గానరే, సలలితోదారవ § త్సకములార
సలలితోదారవ § త్సకవైరిఁ గానరే, సుందరోన్నతలతా § ర్జునములార
సుందరోన్నతలతా § ర్జునభంజిఁ గానరే, ఘనతరలసదశో § కంబులార
ఘనతరలసదశో § కస్ఫూర్తి, గానరే, సవ్యరుచిరకాంచ § నంబులార

ఆ. నవ్యరుచిరకాంచ § నకిరీటుఁ గానరే, గహనపదవికురవ § కంబులార
గహనపదవికురవ § కనివాసిఁ గానరే, గణికలార చారు § గణికలార. 1015

సీ. అదె నందనందనుం § డంతర్హితుం డయ్యెఁ, బాటలీతరులార § పట్టరమ్మ
హేలావతులఁ గృష్ణ § యేల పాసితి వని, యైలేయలతలార § యడుగరమ్మ
వనజాక్షుఁ డిచటికి § వచ్చి డాఁగఁడు గదా, చూతమంజరులార § చూడరమ్మ
మానినీమదనుతో § మారాక యెఱిఁగించి, మాధవీలతలార § మనుపరమ్మ

ఆ. జాతిసతులఁ బాయ § [2]నీతియే హరి కని, జాతులార దిశలఁ § జాటరమ్మ
కదళులార పోఁక § కదలించి శిఖిపింఛ, [3]జూటుఁ దెచ్చి కరుణఁ § జూపరమ్మ.

క. హరిచరణములకుఁ బ్రియవై, హరి నిను మన్నింప భద్ర § మందెదు తులసీ
హరి నీదెస రాఁడు గదా, హరిచొప్పెఱిఁగించి శుభము § లందింపఁ గదే.

తే. పొగడఁదగువానిఁ గానరే § పొగడలార, యీడెఱుంగనివిభుఁజూపుఁ § డీడలార
మొల్ల మగుకీర్తివాఁడేడి § మొల్లలార, శుకనిగదితుని జెప్పఁడు § కింశుకములార.

క. తరుణీకుచకుంకుమయుత, హరికంధరదామగంధ § మడరెడుఁ జూడ్కల్
హరిఁ గనినపగిదిఁ దనరెడి, హరిణీ హరిజాడఁ బుణ్య § మయ్యెడిఁ జెపుమా.

క. కిటి వై కౌఁగిటఁ జేర్చెను, వటుఁ డై వర్ధిల్లి కొలిచె § వసిఁ గృష్ణుం డై
యిట పదచిహ్నము లిడెఁ గ్రిం, దటిబామున నేమి నోఁచి § తమ్మ ధరిత్రీ. 1020

వ. అనుచు [4]మదనోన్మాదచిత్తలై తదాత్మకత్వంబునఁ గృష్ణులీలల ననుకరించుచు.

సీ. పూతన నై యొక్క § పొలఁతి చరింపంగ, శౌరి నై యొకకాంత § చన్నుగుడుచు
బాలుఁ డై యొకభామ § పాలకు నేడ్చుచో, బండి నే నను లేమఁ § బాఱఁ దన్ను
సుడిగాలి నని యొక్క § సుందరి గొని పోవ, హరి నని వర్తించు § నబ్జముఖియు
బకుఁడ నే నని యొక్క § పడఁతి సంరంభింపఁ, బద్మాక్షుఁ డను కొమ్మ § పరిభవించు

1. కృపణుండు సూడరే. 2. జాతియే. 3. చూడు. 4. నున్మత్తచిత్తలై.

ఆ. నెలమి రామకృష్ణు ‡ లింతు లిద్దఱు గాఁగ, గోవత్సగణము ‡ కొంద ఱగుచు
రసురవైరి ననుచు ‡ నబల యొక్కతె చీరుఁ, బసుల మనెడిసతుల ‡ భరతముఖ్య.

ఆ. లోక మెల్లఁ గుక్షి ‡ లోపల నున్నది, మాధవుండ నేను ‡ మాత వీవు
చూడుమనుచు నొక్క ‡ సుందరియొకతెకు, ముఖముఁ దెఱచిచూపు‡ముఖ్యచరిత.

క. వెన్నలు దొంగిలి తినియెసి, వెన్నుఁడ నని యొకతె నుడువ ‡ వేఱొక్కతె చే
సన్నల యశోద నంచును, గ్రన్నన కుసుమములదండఁ ‡ గట్టు నిలేశా. 1024

క. కాళియఫణి యిది వీరడు, కాళీయఫణిసతులు మ్రొక్కఁ ‡ గడఁగిరి నే గో
పాలకుమారుఁడ ననుచును, లీలాగతి నాఁడు నొక్క ‡ లేమ నరేంద్రా. 1025

క. తరుణులు గోపకు లందఱు, హరిమాయఁ డిదె వాన గురిసె ‡ హరి నే నని భా
సురచేలాంచల మొక్కతె, గిరి నెత్తెద ననుచు నెత్తెఁ ‡ గెంగేల నృపా. 1026

క. మీరలు గోపకు లే నను, రారిసి దావాగ్ని వచ్చె ‡ నటు నూడకుఁడీ
వారించెద నని యొక్కతె, సేరి బయల్ కబళనంబు ‡ సేయు నరేంద్రా. 1027

వ. ఇట్లు తన్మయత్వంబున గోపసుందరులు బృందావనంబునం గలతరులతాదుల హరి నడుగుచు దుర్గమంబు లయినవిపినమార్గంబుల సరోజాతకేతసహాలకులిశకలశాంకుశాదిశుభలక్షణలక్షితంబు లయి మనోహరంబు లయినహరిచరణంబులచొప్పుఁ గని తప్పక చెప్పికొనుచుఁ దమలో ని ట్లనిరి. 1028

సీ. కొమ్మకుఁ బువ్వులు ‡ గోసినాఁ డిక్కడ, మొనసి పాదాగ్రంబు ‡ మోపినాఁడు
సతి నెత్తుకొని వేడ్క ‡ జరిగినాఁ డిక్కడఁ, దృణములో లే దిదె ‡ తెఱవజాడ
ప్రియకు ధమ్మిల్లంబు ‡ వెట్టినాఁడిక్కడఁ, గూర్చున్న చొప్పిదె ‡ కొమరుమిగులు
నింతికిఁ గెమ్మోవి ‡ యిచ్చినాఁ డిక్కడ, వెలఁది నిక్కినగతి ‡ విశద మయ్యె

ఆ. సుదతితోడ నీరు ‡ సొచ్చినాఁ డిక్కడఁ, జొచ్చి తా వెడలిన ‡ చోటు లమరెఁ
దరుణిఁ గాముకేళిఁ ‡ దనిపినాఁ డిక్కడ, ననఁగి పెనఁగి యున్న ‡ యంద మొప్పె.

వ. మఱియును. 1030

సీ. ఒకయెలనాఁగచే ‡ యూఁదినాఁ డిక్కడ, సరస నున్నవి నాల్గు ‡ చరణములును
నొకనీలవేణితో ‡ [1]నొదిఁగినాఁ డిక్కడ, మగజాడలో నిదె ‡ మగువజాడ
యొకలేమ మ్రొక్కిన ‡ [2]నఱిచినాఁడిక్కడ, రమణిమ్రొక్కినచొప్పు‡రమ్యమయ్యె
నొకయింతి కెదురుగా ‡ నొలసినాఁడిక్కడ, నన్యోన్యముఖములై ‡ యంఘ్రు లొప్పె

ఆ. నొకతె వెంటఁ దగుల‡నుండక యేఁగినాఁ, డడుగుమీఁదఁ దరుణి ‡ యడుగు లమరె
నబల లిరుగెలంకు ‡ లందురాఁదిరిగినాఁ, డాఱుపదము లున్న‡వమ్మ యిచట. 1031

సీ. ఈచరణంబులే ‡ యిందునిభానన, సనకాదిమునియోగ ‡ సరణి నొప్పు
నీపాదతలములే ‡ యెలనాఁగ శ్రుతివధూ, సీమంతవీథులఁ ‡ జెన్ను మిగులు
నీపదాబ్జంబులే ‡ యిభకులోత్తమయాన, పాలేటిరాచూలి ‡ పట్టుగొమ్మ

1. నొడిసినాఁ. 2. నుడిపినాఁ.

లీసుందరాంఘ్రులే § యిందీవరేక్షణ, ముక్తికాంతామనో § మోహనంబు
ఆ. లీయడుగులరజమె § యింతి బ్రహ్మేశాది, దివిజవరులు మౌళి § దిశలఁ దాల్తు
రనుచుఁగొందఱబల § లబ్జాక్షుఁడేఁగిన, క్రమముఁ గనియు నతనిఁ § గాన రైరి.
వ. అప్పుడు. 1033
సీ. [1]పతులదైన్యంబును § భామలశౌర్యంబుఁ, జూపుచు విభుఁ డొక్క § సుదతితోడ
విహరింప నది యెల్ల § వెలఁదుల వర్జించి, నాయొద్ద నున్నాఁడు § నాథుఁ డనుచు
గర్వించి రాఁజాలఁ § గమలాక్ష మూఁపున, నిడుకొనుమనుడు న § య్యీశ్వరుండు
మొఱఁగిపోయినఁ దాప § మునఁ బొంది యోకృష్ణ, యెక్కడఁజనితి ప్రా § ణేశ రమణ
తే. నీకు వరవుడ నయ్యెద § నిలువుమనుచు, వగవఁ గొందఱుకాంత లా § వనితఁ జూచి
వరుఁడు మన్నింప గర్వించి § వనజనేత్ర, చిక్కె నేఁడని వెఱఁగున § జెందిరపుడు.
వ. మఱియును. 1035
సీ. ఈపొదరింటిలో § నిందాఁకఁ గృష్ణుండు, నాతోడ మన్మథ § నటన మాడె
నియ్యేల మగుచోట § నిందాఁకఁ జెలువుండు, గాఢంబుగాననుఁ § గౌగిలించె
నీమహీజమునీడ § నిందాఁక సుభగుండు, చిట్టంటుచెయ్యేల § సిగ్గు గొనియె
నీపుష్పలతపొంత § నిందాఁక దయితుండు, నను డాసి యధరపా § నంబు సేసె
ఆ. నీప్రసూనవేది § నిందాఁక రమణుండు, గుసుమదామములను § గొప్పుఁ దీర్చె
ననుచుఁ గొంద ఱతివ § లంభోజ నయనుని, పూర్వలీలఁ దలఁచి § పొగడి రధిప.
మ. అని యుబ్బంగి లతాంగు లందఱును బ్రం § దారణ్యమం దీశ్వరున్
వనజాక్షుం బరికించి కానక విభున్ § వర్ణించుచుం బాడుచున్
మనముల్ మాటలుఁ జేష్టలుం గ్రియలు న § మ్మానాథుపైఁ జేర్చి వే
చని రయ్యామునసైకతాగ్రమునకున్ § సంత్యక్తగేహేచ్ఛలై. 1037
వ. చని గోపికలు హరి నుద్దేశించి యి ట్లనిరి. 1038

### గోపికాగీతలు.

క. నీవు జనించినకతమున, నోవల్లభ లక్ష్మి మంద § నొప్పె నధిక మై
నీవెంటనె ప్రాణము లిడి, నీవా రరసెదరు చూపు § నీరూపంబున్. 1039
క. శారదకమలోదరరుచి, చోరక మగుచూపువలన § సుందర మమ్ముం
గోరి వెల యీనిదాసుల, ధీరత నొప్పించు టిది వ § ధించుట గాదే. 1040
ఆ. విషజలంబువలన § విషధరదానవి, వలన గాలివాన § వలన వహ్ని
వలన నున్న వాని § వలనను రక్షించి, కుసుమశరుని బారిఁ § గూల్పఁ దగునె. 1041
ఉ. నీవు యశోదబిడ్డఁడవె § నీరజనేత్ర సమస్తజంతుచే
తోవిదితాత్మ వీశుఁడవు § తొల్లి విరించి తలంచి లోకర
క్షావిధ మాచరింపు మని § సన్నుతి సేయఁగ [2]సత్కులంబునన్
భూవలయంబుఁ [3]గావ నిటు § పుట్టితి గాదె మనోహరాకృతిన్. 1042

---

1. పతులధైర్యంబును. 2. మత్కులంబునం 3. నా గరుణఁ బుట్టితి.

ఆ. చరణసేవకులకు ♦ సంసారభయమును, బాపి శ్రీకరంబు ♦ పట్టు గలిగి
కామదాయి యైన ♦ కరసరోజంబు మా, మస్తకముల నునిచి ♦ మనుపు మీశ.

ఉ. గోవుల వెంటఁ ద్రిమ్మరుచుఁ ♦ గొల్చినవారల పాపసంఘముల్
ద్రోవఁగఁ జాలి శ్రీఁ దనరి ♦ దుష్టభుజంగఫణాలతాగ్రసం
భావిత మైననీచరణ ♦ పద్మము చన్నులమీఁద మోపి త
ద్భావజపుష్పభల్లభవ ♦ బాధ హరింపు వరింపు మాధవా. 1044

క. బుధరంజనియును సూక్తియు, మధురయు నగునీదువాణి ♦ మఱగించెను నీ
యధరామృతసంసేవన, విధి నంగజతాప మెల్ల ♦ విడిపింపఁ గదే. 1045

క. మగువలయెడ నీక్రౌర్యము, దగునే నిజభక్తభీతి ♦ దమనుఁడ వకటా
తగదు భవద్దాసులకును, నగు మొగముం జూపి కావు ♦ నళినదళాక్షా. 1046

మ. ఘనలక్ష్మీయుత మై విరక్త శుభద మై ♦ కామాదివిధ్వంసి యై
సనకాదిస్తుత మై నిరంతరతప ♦ స్సంతప్త పున్నాగజీ
వన మై యొప్పెడునీకథామృతము ద్రా ♦ వం గల్గునే భూరిదా
ననిరూఢత్వము లేనివారలకు మా ♦ నారీ మనోహారకా. 1047

క. నీనగవులు నీచూడ్కులు, నీనానావిహరణములు ♦ నీధ్యానంబుల్
నీనర్మాలాపంబులు, మానసముల నాఁటి నేఁడు ♦ మగుడవు కృష్ణా. 1048

ఆ. ఘోషభూమి వెడలి ♦ గోవుల మేపంగ, నీరజాభ మైన ♦ నీపదములు
గసవు శిలలుఁ దాఁకిఁ ♦ గడునొచ్చునో యని, కలఁగు మా మనములు ♦ కమలనయన.

ఉ. మాపటివేళ నీవు వన ♦ మధ్యము వెల్వడి వచ్చి గోష్పద
ప్రాపితధూళిధూసరిత ♦ భాసితకుంతల మై సరోరుహా
ద్దీపిత మైననీమొగము ♦ ధీరజనోత్తమ మాకు వేడ్కతోఁ
జూపి మనంబులన్ మరునిఁ ♦ జూపుదు గాదె క్రమక్రమంబునన్. 1050

ఆ. భక్తకామదంబు ♦ బ్రహ్మసేవిత మిలా, మండనంబు దుఃఖ ♦ మర్దనంబు
భద్రకరము నైన ♦ భవదంఘ్రియుగము మా, యురము లందు రమణ ♦ యునుపఁ దగదె.

ఆ. సురతవర్ధనంబు ♦ శోకాపహరణంబు, స్వరితవంశనాళ ♦ సంగతంబు
నన్యరాగజయము ♦ నైననీమధురాధ, రామృతమునఁ దాప ♦ మార్పు మీశ.

ఉ. నీ వడవిం బగల్ దిరుగ ♦ నీకుటిలాలకలాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడ కున్న నిమి ♦ షంబులు మాకు యుగంబు లై చనుం
గావున రాత్రు లైన నినుఁ ♦ గన్నుల నెప్పుడుఁ జూడ కుండ ల
క్ష్మీవర ఱెప్ప లడ్డముగఁ ♦ జేసె నిదేల విధాత క్రూరుఁ డై. 1053

ఉ. అక్కట బంధులున్ మగలు ♦ నన్నలుఁ దమ్ములుఁ బుత్త్రకాదులున్
నెక్కొని రాత్రిఁ బోకుఁ డన ♦ నీమృదుగీతరవంబు వీనులన్

వెక్కసమైన వచ్చితిమి వేగమె మోహము నొంది [1]నాథ నీ
వెక్కడఁ బోయితో యెఱుఁగ మీ క్రియ నిర్దయుఁ డెందుఁ గల్గునే. 1054

తే. మదనుఁ డార్వంగ నీ వాడు మంతనములు, నవరసాలోకనంబగు నగు మొగంబు
కమల కిరవైనమహితవక్షఃస్థలంబు, మామనంబుల లోఁగొని మరపెఁ గృష్ణ.

మ. అరవిందంబులకంటెఁ గోమలము లై యందంబు లై యున్ననీ
చరణంబుల్ కఠినంబు లై మొనయుమా చన్నుంగవల్ మోవఁగా
[2]నెరియం బోలు న టంచుఁ బొక్కుదుము నీ యాకర్కశారణ్యభూ
పరిసంచారము కృష్ణ నీప్రియలకుం బ్రాణవ్యథం జేయదే. 1056

క. కట్టా మన్మథుకోలలు, నెట్టన నెఱి నాట బెగడి నీపాదంబుల్
పట్టికొనఁగ వచ్చినమము, నట్టడవిని డించి పోవ న్యాయమె కృష్ణా. 1057

క. హృదయేశ్వర మాహృదయము, మృదుతరముగఁ జేసి తొల్లి మిక్కిలి కడ నీ
హృదయము కఠినము [3]చేసెను, మదీయసౌభాగ్య మిట్టిమందము గలదే. 1058

ఉ. క్రమ్మి నిశాచరుల్ సురనికాయములన్ వడిఁ దాఁకి వీఁక వా
లమ్ముల [4]తెట్టెముల్ పఱప నడ్డము వచ్చి జయింతు వంద్రు ని
న్నమ్మినముగ్ధలన్ రహిత నాథల నక్కట నేఁడు రెండుమాఁ
డమ్ములయేటుకాఁ డెగవ నడ్డము రాఁ దగదే కృపానిధీ. 1059

క. [5]తియ్యవిలుకాఁడు డీకొని, వ్రయ్యలుగాఁ దూల నేసె వనితలమనముల్
వియ్యాన నింక నయినం, గుయ్యాలింపంగ దయ్య గోవింద హరీ. 1060

మ. అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం బాడుచుం
దను రావే యని చీరి యేడువ జగత్త్రాణుండు త్రైలోక్యమో
హనుఁ డై మన్మథమన్మథుం డయి మనోజ్ఞాకారి యై హరి యై
ఘనపీతాంబరధారి యై పొడమెఁ దత్కాంతాసమీపంబునన్. 1061

క. వచ్చినవల్లభుఁ గనుఁగొని, విచ్చేసె నటంచు సతులు వికసితముఖు లై
యచ్చుగఁ బ్రాణము లొడలికి, వచ్చిన నిలుచుండునవయవంబులభంగిన్. 1062

సీ. అబల యొక్కతె భక్తి నంజలి గావించి, ప్రాణేశు కెంగేలు వట్టికొనియె
నింతి యొక్కతె జీవితేశ్వరుబాహువు, మూఁపున నిడికొని ముదము నొందె
వనిత యొక్కతె తనవల్లభుతాంబూల, చర్వితి మాత్మహస్తమునఁ దాల్చెఁ
బడఁతి యొక్కతె ప్రియు పదములు విరహాగ్ని, తప్తకుచంబులఁ దాపుకొనియె

ఆ. భామ యొకతె భ్రుకుటి బంధంబు గావించి, ప్రణయభంగరోష భాషణమున
దష్టదశన యగుచు దండించుకైవడి, వాఁడిచూడ్కిగముల వరునిఁ జూచె.

---

1. నార మీ వెక్కడ. 2. నిఱియం; దిఱియం. 3. చేసిన. 4. తెట్టువల్-దట్టముల్. 5. తీయవిలుకాఁడు డీకొని, పాయలుగాఁ దూఱ నేసె వనితలమనముల్, నీయూన యింక నైనం, గూయాలింపంగ దయ్య గోవింద హరీ.

క. హరిముఖకమలముఁ జూచుచుఁ, దరుణియొకతె ఱెప్ప లిడక § తనియక యుండెన్
హరిపదకమలముఁ జూచుచు, మరగి తనివి లేనిసుజను § మాడ్కి నరేంద్రా. 1064

ఉ. ఒక్కలతాంగి మాధవుని § యుజ్జ్వలరూపముఁ జూడ్కిత్రోవలం
జిక్కఁగఁ బట్టి హృద్గతముఁ § జేసి వెలిం జన నుండ నేత్రముల్
గ్రక్కున మూసి మేనఁ బుల § కంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచుం
జొక్కము లైనలోచనులఁ § జొక్కుచు నుండెను యోగికైవడిన్. 1065

సీ. ఎలయించి ప్రాణేశ § యెందుఁ బోయితివని, తొరంపుటలుకతో § దూఱె నొకతె
జలజాక్ష ననుఁ బాసి § చనఁగ నీపాదంబు, [1]లె ట్లాడె నని వగ § నెయిదె నొకతె
నాథ నీ వరిగిన § నాప్రాణ మున్నది, కూర్మి యే యిది యని § కుందె నొకతె
యీశ్వర నను నిన్ను § నిందాఁకఁ బాపెనే, పాపపువిధి యని § పలికె నొకతె

ఆ. తలఁగి పోవునట్టి § తప్పేమి చేసితి, నధిప పలుకు ధర్మ § మనియె నొకతె
యేమినోముఫల మొ § హృదయేశ నీమోము, మరలఁ గంటి ననుచు § మసలె నొకతె.

క. పలికినఁ బ్రతిజ్ఞ దప్పెడిఁ, బలికించినఁ గాని రమణుఁ § బలుక నటంచుం
గలకంఠి యొకతె చెలితోఁ, బలుకుల నమృతములు గురియు § పలుకులు వలికెన్.

క. పట్టినఁ గాని మనోవిభుఁ, బట్టఁ గదా యంచు నొక్క § బాలిక సఖిచే
పట్టుకొని చెప్పె ధైర్యము, పట్టెల్లను మరుని టెంకి § పట్టుగ నధిపా. 1068

క. చెలువుఁడు సెప్పక పోయిన, సొలపున నొకముగ్ధ మున్ను § చూడ ననుచు నౌ
దల వంచి యుండఁ జాలక, దల యెత్తును లోన మరుఁడు § దల యెత్త నృపా.

వ. ఇవ్విధంబున. 1070

క. హరిసురుచిరలలితాకృతిఁ, దరుణులు గని ముక్తవిరహ § తాపజ్వర లై
పరమోత్సవంబు సలిపిరి, పరమేశ్వరుఁ గనినముక్త § బంధులభంగిన్. 1071

వ. అంత నక్కాంతుండు గాంతాజనపరిక్రాంతుం డై వనాంతరంబున శక్తినికరసంయుక్తుం డైన పరమపురుషుండునుం బోలె వారలం దోడ్కొని మందారకుంద కుసుమపరిమళమిళిత పవమానమానిత మధుకరనికరఝుంకారసుకుమారంబును శరత్కాలచంద్రకిరణసందోహసందళితాంధకారంబును యమునాతరంగసంగత కోమలవాలుకాస్ఫారంబును నై యమలినం బైనపులినంబు ప్రవేశించి వారును విజ్ఞానకాండంబున నీశ్వరుం గని శ్రుతులు ప్రమోదంబునం గామానుబంధంబులు విడిచినవిధంబున హరిం గని విరహవేదనలు విడిచి పరిపూర్ణమనోరథ లై. 1072

క. పాఠీనయన లెల్ల న,కాఠిన్యపటాంచలములఁ § గౌతుకములు హృ
త్పీఠముల సందడింపఁగఁ బీఠముఁ గల్పించి రంతఁ § బ్రియునకు నధిపా. 1073

ఆ. పరమయోగిహృదయ § [2]భద్రపీఠంబుల, నుండుమేటి వ్రజవ § ధూత్తరీయ
పీఠమున వసించి § పెంపారెఁ ద్రిభువన, [3]దేవలక్ష్మి మేనఁ § దేజరిల్ల. 1074

1. లాడెనే యని వగ నడలె నొకతె. 2. పద్మపీఠంబుల. 3. దేవి-దేశ-లక్ష్మి.

మ. మదనోద్దీపకుఁ డైననాథునికి స § మ్మానంబు గావించుచున్
ముదితల్ హాసవిలోకవిభ్రమములన్ § మోదించుచుం జేరి త
త్పదముల్ హస్తతలంబులం బిసుకుచుం § బైఁ ముట్టుచున్ దూఱుచుం
జదురుల్ వల్కుచుఁ గూర్మి ని ట్లనిరి యా § మత్తోత్కపదీప్తాస్య లై. 1075

క. కొలిచినఁ గొలుతురుకొందఱు, గొలుతురు దమ్ముఁ గొలువకున్న § గొందఱు పతులం
గొలిచినను గొలువ కున్నను, గొలువరు మఱికొంద ఱెలమి § గోపకుమారా.

వ. అని తన్నుద్దేశించి రహస్యంబుగాఁ బలికినసుందరులపలుకులు విని గోపాలసుందరుం డి ట్లనియె. 1077

సీ. కొలిచినఁ గొలుతురు § కొందఱు పశువుల, భజనముభంగిని § ఫలముకొఱకు
నై సఖ్యధర్మము § లందు సిద్ధింపవు, కొందఱు తండ్రుల § గుణముఁ దాల్చి
దయ గలవారలు § తగినసుహృత్తులు, గొలువనివారలఁ § గొల్తు రెపుడు
ధర్మకామంబులు § దనరంగఁ గొందఱు, కొలువనివారిని § గొలుచువారిఁ

ఆ. గొలుచుతలఁపు లేమిఁ § గొలువ రాత్మారాము, లాప్తకాము లజ్ఞు § లతికఠినులు
వారియందుఁ బిదపకవానిఁగాఁ జింతించి, యే లతాంగులార § యిట్టు లనుట.

క. ఏ నిం దెవ్వఁడ నయినం, గా నంగనలార పరమ § కారుణికుండన్
మానసబంధుఁడ నిత్య, ధ్యానము మీ కొసఁగ వలసి § తలఁగితిఁ జుండీ. 1079

మ. నను సేవించుచు నున్నవారలకు నే § నారూపముం జూపఁ జూ
చినఁ జాలించి ముదించి వారు మఱి సన్ § సేవింపరో యంచు ని
ర్ధనికుం డాత్తధనంబు సెడ్డ నెపుడుం § దత్పారవశ్యంబుఁ దా
ల్చినభంగిన్ ననుఁ బాసి మత్ప్రియుఁడు దాఁ § జింతించు నారూపమున్. 1080

తరలము. తగవు ధర్మము, జూడ నొల్లక § తల్లిదండ్రుల బంధులన్
మగల బిడ్డలఁ బాసి వచ్చిన § మన్నిమిత్తల మిమ్ము నేఁ
దగదు పాసితిఁ దప్పు సైఁపుడు § తద్వియోగభరంబునన్
వగలఁ బొందుచు మీర లాడిన § వాక్యముల్ విను చుండితిన్. 1081

ఉ. పాయనిగేహశృంఖలలఁ § బాసి నిరంతరమత్పరత్వముం
జేయుచు నున్నమీకుఁ బ్రతి § సేయ యుగంబుల నైన నేర నన్
బాయక కొల్చుమానసము § ప్రత్యుపకారముగాఁ దలంచి నా
పాయుటఁ దప్పుగాఁ గొనక § భామినులార కృపన్ శమింపరే. 1082

క. చక్కఁగ హరి యిటు పలికిన, చక్కనివాక్యముల నతని § సంగమమున లో
నిక్కినవియోగతాపము, లొక్కట విడిచిరి లతాంగు § లుర్వీనాథా. 1083

### రాసక్రీడాభివర్ణనము.

ఉ. ఆ సమయంబునన్ విభుఁ డ § నంతుఁడు కృష్ణుఁడు చిత్రమూర్తి యై
చేసెను మండలభ్రమణ § శీలపరస్పరబద్ధబాహుకాం

తానువిలాసముఁ బహువిధస్ఫురితాననహస్తపాదవి
న్యాసము రాసముం గృతవిస్మయచ్చరనేత్రమనోవికాసమున్. 1084

వ. ఇట్లు బహుగతులం దిరుగ నేర్చి యగుహరి దర్పించి తనయిరుగెలంకుల నలం
కృత లయి కళంకరహితచంద్రవదన లిద్దఱు ముద్దియ లుద్దిగొని వీణ లందుకొని
(వీణలఁ) బ్రవీణలై సొంపుమెఱసి యింపుగ వాయించుచు నానందలహరీనిధానం
బగుగానంబు సేయ నవిరళం బై తరళంబు గానివేడుక సరళం బగుమురళంబు
లీలం గేల నందుకొని మధురం బగునధరంబునం గదియించి మించి కామినీజన
కబరికాసౌగంధికగంధబంధురకరాంగుళీకిసలయంబులు యతిలయంబులం గూడి
వివరంబుగ మురళీవివరంబుల సారెంచి పూరించుచు సరి లేనిభంగిం ద్రిభంగి యై
కమలకర్ణికాకారంబున నడుమ నిలిచి మఱియు గోపసుందరు లెంద ఱందఱకు
నంద ఱయి సుందరుల కవలియొడలం దానును దన కవలియొడల సుందరులును
దేజరిల్ల నృత్తవిద్యామహార్ణవవేలావలయవలయితం బై విస్మితాఖండలం బైనరాస
మండలంబు గల్పించి వేల్పులు హర్షంబునం గుసుమవర్షంబులు గురియ నందుఁ
బ్రసూనమంజరీసహచరంబులైనచంచరీకంబులమించు ప్రకటించుచు సువర్ణమణి
మధ్యగంబులైనమహేంద్రనీలంబులతెఱంగు నెఱపుచుఁ గరిణీవిహారబంధురంబు
లైనసింధురంబులచెలువుఁ గైకొలుపుచుఁ బల్లవితకుసుమితలతానుకూలంబులైన
తమాలంబులసొబగు నెగడించుచు మెఱుపుఁదీవల నెడనెడఁ బెడంగడరునల్ల మొగిళ్ల
పెల్లు సూపుచుఁ దరంగిణీసంగతంబు లయినరోహణాచలశృంగంబులబాగులాగిం
చుచు జగన్మోహనుం డై యంసశిరస్తకమలాభరణంబులును జంద్రశకలనిర్మలనఖర
సంస్ఫురణంబులును శ్రుతినితంబినీసీమంతవీథికాలంకరణంబులును (త్రిలోకరక్షా
కరణంబులును) సనకసనందనాదియోగీంద్రమానసాభరణంబులును నయినచర
ణంబులు గదియ నిడి సమస్థితి నంజలిపుటంబులం బుష్పంబు (లుల్లసిల్లఁ) జల్లి
సల్లలితకమలప్రశస్తంబు లయినహస్తంబులు వల్లవీజనులకంఠంబులపై నిడి తాను
గీతానుసారంబుగ విచిత్రపాదసంచారంబులు సలుపుచు వర్తులాకారరాసబంధం
బున నర్తనంబులం బ్రవర్తించి వెండియు వ్రేతలుం దానును శంఖ పద్మ వజ్ర
కందుక చతుర్ముఖ చక్రవాళ చతుర్భద్ర సౌభద్ర నాగ సంద్యావర్త కుండలీ
కరణ ఖురరీబంధప్రముఖంబు లయినవిశేషరాసబంధంబులకుం జొచ్చి యేకపాద
సమపాద వినివర్తిత గతాగత వలిత వైశాఖమండల త్రిభంగి ప్రముఖంబులైనతా
నకంబుల నిలుచుచుఁ గనకకింకిణీమంజులమంజీరశింజనంబులుజగజ్జనకర్ణరంజనంబు
లై చెలంగ ఘటితమర్దితపార్శ్వగప్రముఖంబు లైన పాదకర్మభేదంబులు సేయుచు
సమపాదశకటవదనమతల్లీసుప్తిప్రముఖంబు లైనపార్థివచారివిశేషంబులును నప
క్రాంతడోలాపాదసూచీప్రముఖంబు లైనవ్యోమచారివిశేషంబులనుం జూపుచు
సురేంద్రశాఖిశాఖామనోహరంబులును నపహసితదిక్కరీంద్రకరంబులును

లోకక్షేమంకరంబులును నగుకరంబులం దిరంబులగురత్నకటకంబుల మెఱుంగులు నింగిచెఱంగులం [1]దఱచుకొన నర్ధచంద్ర కర్తరీముఖ కపిత్థ కటకాముఖ శుక తుండ లాంగూల పద్మకోశ పతాక ప్రముఖంబు లైనస్వస్వభావసూచకనానావిధకర భావంబు లాచరించుచుఁ గటినిబద్ధసువర్ణవర్ణ చేలాంచలప్రభానికరంబులు సుక రంబులై దిశాంగనాముఖంబులకు హారిద్రా లేపనముద్రాలంకారంబు లొసంగుచు నాస్కందితభ్రమరశకటాసనప్రముఖంబు లైనజానుమండల భేదంబులును నలాత దండలాత లలిత విచిత్రప్రముఖంబు లైనదైవమండలంబులు నొనర్చుచుఁ గమ నీయకంబుకంఠాభిరామంబులు నుద్దామతేజస్తోమంబులు నైననీలమౌక్తికవజ్ర వైదూర్యదామంబులరుచు లిందిరకు మందిరంబు లయి సుందరంబులై నయురంబు లం దిరుగుడువడి కలయంబడ [2]నంగాంతరవాహ్యాలకు ఛత్రప్రముఖంబు లైన భ్రమరీవిశేషంబుల విలసించుచు నిద్దంబులగుచెక్కుటద్దంబుల నుద్దవిడిం ద్దయుం బ్రభాసితచంద్రమండలంబు లగుకుండలంబుల మెఱుంగు మొత్తంబులు నృత్తంబు లొనరింపఁ గటిభ్రాంతదండరచితలలాటతిలకమయూరలలితచక్రమండల నికుంచిత గంగావతరణప్రముఖంబు లైనకరణంబు లెఱింగించుచు వెలిదమ్మివిరులసిరులఁ జెన్నుమిగులుకన్నులవలన దీనజనదైన్యకర్కశంబు లైతనరుకటాక్షదర్శనజాలం బులు జాలంబు లై కామినీజననయనమీనంబుల నావరింప లలితకుంచితవికాస ముకుళప్రముఖంబు లయినచూడ్కులం దేజరిల్లుచు ననేకపరిపూర్ణ చంద్రసౌభా గ్యసదనంబు లగువదనంబులఁ బ్రసన్నరాగంబులు ప్రకటించుచు నుదంచితపింఛ మాలికా మయూఖంబులకాలశక్రచాపంబులసొంపుసంపాదింపనికుంచితాకుంచిత కంపితాకంపితపరివాహితపరావృత్తప్రముఖంబు లైనశిరోభావంబులు నెఱపుచు మృగనాభితిలకంబులు గలనిటలఫలకంబులఁ జికురంబులు నికరంబులు గ నపరా జితసూచికావిద్ధపరిచ్ఛిన్నవిష్కంభరేచితప్రముఖంబు లగునంగహారంబుల విలసి ల్లుచుఁ జరణకటికరకంఠరేచకంబు లాచరించుచు నొప్పెనప్పు డారాసంబు సంజ నితసకలజనమానసోల్లాసకరం బై సుధార్ణవంబునుంబోలె నుజ్జ్వలరసాభిరామం బై రామరాజ్యంబునుంబోలె రాగపరిపూర్ణం బై పూర్ణచంద్రమండలంబునుం బోలెఁ గువలయానందం బై నందనవనంబునుంబోలె భ్రమరీవిరాజమానం బై మానధనునిచిత్తంబునుంబోలెఁ బ్రధాన[3]వృద్ధిసమర్థం బై సమర్థకవివిలసనంబునుం బోలె బహుప్రబంధభాసురం బై సురలోకంబునుంబోలె వసుదేవనందనవిశిష్టం బై శిష్టచరితంబునుంబోలె ధరణీగగనమండలసుందరం బై సుందరీరత్నంబునుం బోలె నంగహారమనోహారం బై హారవధూనిలయంబునుంబోలె ననేకచారిసుకు మారం బై సుకుమారవృత్తంబునుంబోలె నుద్దీపితవంశం బై యుండె నందు.

1. దఱుముకొన_దరులుగొన. 2. గాంతారబాహ్యులకు. 3. 'వృత్తిసమ' అ. ప్ర.

చ. నడుములు వీఁగ యాడఁ జిఱు § నవ్వులు నివ్వటిలంగ హారముల్
సడిసడ మేఖలల్ వదలఁ § జూడ్కిమెఱుంగులు వర్వ ఘర్మముల్
వొడమఁ గురుల్ చలింప శ్రుతి § భూషణముల్ మెఱవన్ సకృష్ణలై
పడఁతుక లాడుచుం జెలఁగి § పాడిరి మేఘతటిల్లతాప్రభన్. 1086

క. అంకరహితేందువదనలు, పంకజలోచనునిఁ గూడి § పరఁగ నటింపం
గింకిణుల నూపురంబుల, కంకణముల మ్రోఁత లెసఁగెఁ § గర్ణోత్సవమై. 1087

క. హరిణీనయనలతోడను, హరి రాసక్రీడ సేయ § నంబరవీథిన్
సురనాథులు భార్యలతో, సొరిది విమానంబు లెక్కి § చూచి రిలేశా. 1088

క. కురిసెం బువ్వులవానలు, మొరసెన్ దుందుభులు మింట § ముదితలు దారున్
సరసన్ గంధర్వపతుల్, వరుసన్ హరిఁ బాడి రపుడు § వసుధాధీశా. 1089

క. రామలతోడను రాసము, రామానుజుఁ డాడఁ జూచి § రాగిల్లి మనో
రాములమీఁద వియచ్చర,రామలు మూర్ఛిల్లి పడిరి § రాజకులేంద్రా. 1090

క. తారాధిపనిభవదనలు, తారాధిపవంశ్యుఁ గూడి § తారు నటింపం
దారలు నిల్చి సుధాంశుఁడు, దారును వీక్షింప రేయి § దడవుగ జరగెన్. 1091

మ. యమునాకంకణచారి యై వనజపు § ష్పామోదసంచారి యై
రమణీఘర్మనివారి యై మదవతీ § రాసశ్రమోత్తారి యై
ప్రమదామానసనవ్యభవ్యసుఖసం § పత్కారి యై చేరి యా
కమలాక్షుం డలరంగ గాలి విసరెం § గల్యాణభావంబునన్. 1092

వ. అప్పుడు. 1093

చ. ప్రమద యొకర్తు మాధవుఁడు § పాడ విపంచి ధరించి కేల సం
భ్రమమునఁ దంత్రి మీటుచుఁ ది § రంబుగ [1]తాయను సేసి యొక్క రా
గము దగ నాలపించి సుభ § గస్వరజాతులు వేఱువేఱ కా
నమరఁగఁ బాడెఁ దన్ రమణుఁ § డౌ సన దారువు లంకురింపఁగన్. 1094

క. ఆడుచుఁ బాడుచు నం దొక, చేడియ మంజీరమంజు § శింజిత మమరం
గూడి హరికరము సనుఁగవ,పై డాయఁగఁ దిగిచె జఘన § భారాలసయై. 1095

క. చందనలిప్తం బై యర,విందామోదమున నొప్పు § విపులభుజము గో
విందుఁ డొకతరుణిమూఁపునఁ, బొందించిన నది దెమల్చి § పులకించె నృపా.

సీ. చెలువయొక్కతె చెక్కుఁ § జెక్కుతో మోపిన, విభుఁడు దాంబూలచ § ర్వితము వెట్టె
నాడుచు నొకలేమ § యలసినఁ బ్రాణేశుఁ, డున్నతదోస్స్తంభ § మూఁత సేసెఁ
జెమరించి యొకబాల § సేరినఁ గడకొంగఁ, జతురుఁడు కుచఘర్మ § జలము వాపె
నలకంబు లొకయింతి § కళిక[2]చిత్రకరేఖ, నంటినఁ బ్రియుఁడు వాకయుంగ దువ్వెఁ

1. రాయము. 2. నారుల రేఖ.

ఆ. బడఁతి యొకతె పాట వాడి దప్పిన నధ,రామృతమున నాథుఁ డాదరించె
హార మొక్కసతికి నఁసావృతం బైనఁ, గాంతుఁ డురముఁ జేర్చి కౌఁగిలించె.

క. హాసంబులఁ గరతలవి,న్యాసంబుల దర్శనముల నాలాపములన్
రాసశ్రాంతల నాహరి, సేసెన్ మన్ననలు కరుణ సేసి నరేంద్రా. 1098

క. హరితనుసంగసుఖంబునఁ, బరవశ లై వ్రేత లెల్లఁ బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమి చోద్యమె, సురసతు లీక్షించి కరఁగి చొక్కిరి మింటన్.

వ. ఇట్లు భగవంతుం డైనకృష్ణుం డాత్మారాముం డయ్యును గోపసతు లెంద ఱంద
ఱకు నంద ఱై నిజప్రతిబింబంబులతోడం గ్రీడించుబాలుపోలిక రాసకేళి సలిపిన.

క. తగఁ గూడి యాడి మనముల, నగెఁ జూచెం బలికె నంద నందనుఁ డనుచున్
మగువలు పెద్దఱికముతోఁ, బొగడిరి తమ పూర్వజన్మ పుణ్యశ్రేణిన్. 1101

### జలక్రీడావర్ణనము

వ. ఇట్లు హరి రాసకేళి సాలించి కరకాంచిత లగుతటిల్లతలచెలువున ఘర్మసలిల
రణాక్రాంత లగుకాంతలం గూడి జలక్రీడాకుతూహలుం డై యమునాజలంబులు
సొర నందు ముందర సుందరులు సొచ్చి పదప్రమాణంబు జానుదఘ్నంబు కటి
ద్వయసమంబు మధ్యమాత్రంబు కుచంబులబంటి యని పలుకుచుం గుచనయన
నాభివివరకుంతలంబులు చక్రవాకజలచరావర్తశైవాలంబులచందంబున నందం
బుగ నీడువొందినయేఱు లని కళిందనందన గరంబులు సాఁచి పరిరంభంబులకు
నారంభించుకైవడి నెదురు చనుదెంచి తాఁకుతరంగంబులకు నులుకుచు సారసం
బులకుం గరంబులు సాఁచుచు మరాళంబులం జోపుచుఁ జెన్ను మిగిలినచన్నుల
యొత్తు వత్తు మనునెపంబులం దపంబుల నీటఁ గావించుసూటిని సంచరించుచక్ర
వాకంబులం దోలుచు నితాంతకాంతిసదనంబు లగు వదనంబులకునోడి వ్రీడం జెంది
కంది చందురుండు సలం బుడిగి జలంబునం బడి కంపించుకరణి నిజకరకంపితజల
ప్రతిఫలితుం డై కదలుచంద్రునిం గని మెచ్చి సోలుచు సలిలావగాహసమయసము
చ్ఛలితవారిశీకరపరంపరలవలన మకరందపానమత్తమధుకరపక్షవిక్షేపణసంజాత
వాతసముద్ధూతకుముదాదిపరాగపటలంబులం జేరుచు మోముఁదమ్ములకమ్మఁదనం
బునకు మూఁగి ఝుమ్మురనుతుమ్మెదలకు వెఱచుచుఁ గరంబుల నీ రెగయం జఱ
చుచు నీలనీరదనిపతితపయోబిందు సందోహంబులం దడియుపువ్వుఁదీవియలబా
గునఁ గృష్ణకరద్వయతోయంబులం బెక్కుతోయంబులు దడియుచుఁ గ్రందు
కొని సుడియుచు నసమబాణునిపులుగడిగినకుసుమబాణంబులపగిది మేనులు
మెఱయ సలిలావగాహనపరాయత్తచిత్త లగుచు మొత్తంబు లై సరసభాషణం
బులం దుళ్ళుచుఁ గరంబుల నీరు నించి హరిమీఁదం జల్లుచుఁ జల్లునెడం దడఁబడక
దాఁటుచు దాఁటి చనక నిలువరించుచు వినోదింప హరియుం గరేణుకరవికీర్ణనీర
ధారాభిషిక్తం బగుశుండాలంబులీల నాభీరకామినీకరసముక్షితజలాసారంబులం

దోఁగుచు వ్రజవధూజనహస్తప్రయుక్తకహ్లారకైరవ పరాగపటలంబువలన భూతి భూషణుసిరి వహించుచు గోపికాజనపాణికిసలయసమున్ముక్తకమలదళంబులవలన సహస్రనయనునిరూపుఁ జూపుచు గోపాలబాలికాకుచకలశకుంకుమపంకంబు వలనఁ బ్రభాతబాలభానునిభంగి భాసిల్లుచు ఘోషయోషాకటాక్షవిక్షేపణం బులవలన మధుపరివృతహరిచందనసౌందర్యంబు నొందుచు వల్లవీహాసరుచుల వలనఁ జంద్రికాప్రభాభాసితనీలశైలంబు క్రియ నమరె నంత. 1102

మ. సతులుం దానును నీటిలో వెడలి భూ ♦ షాగంధచేలాద్యలం
కృతుఁడై కుంభి కరేణుయూథములతోఁ ♦ గ్రీడించుచందంబునన్
లతలందుం దరులందుఁ బుష్పమయలీ ♦ లాశయ్యలందున్ సుఖో
న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా ♦ నారీలలామంబులన్. 1103

వ. ఇట్లు శరత్కాలంబున వెన్నుం డింద్రియస్ఖలనంబు సేయక గోపికలతోడ రమించె నని చెప్పిన మునివరునకు భూవరుం డిట్లనియె. 1104

మత్తకోకిలము. ధర్మకర్తయు ధర్మభర్తయు ♦ ధర్మమూర్తియు నైనస
త్కర్ముఁ డీశుఁడు ధర్మశిక్షయు ♦ ధర్మరక్షయుఁ జేయఁ గా
నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి ప ♦ రాంగనాజనసంగ మే
ధర్మమంచుఁ దలంచి చేసె ను ♦ దాత్తమానస చెప్పుమా. 1105

వ. అనిన శుకుం డిట్లనియె. 1106

ఆ. సర్వభక్షుఁ డగ్ని ♦ సర్వంబు భక్షించి, దోషి గానిపగిది ♦ దోష మైనఁ
జేసి దోషపదముఁ ♦ జెందరు తేజస్వు, లగుటఁ జంద్రవాస ♦ వాదు లధిప. 1107

క. ఈశ్వరుఁడు గానివాఁడు న, రేశ్వర పరకాంతఁ దలఁచి ♦ యెట్లు బ్రదుకు గా
రీశ్వరుఁడు దక్క నన్యుఁడు, విశ్వభయదవిషము మ్రింగి ♦ వెలయం గలఁడే.

క. సత్యము ప్రభువులవచనము, నిత్యముఁ దద్వచనవీథి ♦ నిలుతురు పెద్దల్
సత్యాసత్యము గావున, సత్య మనుచుఁ జనరు వారి ♦ చరితమున నృపా. 1109

మ. ఘను లెవ్వనిపాదపంకజపరా ♦ గధ్యానసంప్రాప్తయో
గనిరూఢత్వముచే మునీంద్రులు మహా ♦ కర్మంబులం బాసి బం
ధనిరోధంబులు లేక విచ్చలవిడిన్ ♦ దర్పింతు రాదివ్యశో
భనుఁ డెట్లుండిన నుండెఁ గాక కలవే ♦ బంధంబు లుర్వీశ్వరా. 1110

ఆ. గోపజనములందు ♦ గోపికలందును, సకలజంతులందు ♦ సంచరించు
నామహాత్మునకుఁ బ ♦ రాంగన లెవ్వరు, సర్వమయుఁడు లీల ♦ సలిపెఁ గాక. 1111

వ. అని చెప్పి శుకుం డిట్లనియె నంత బ్రాహ్మ్యముహూర్తంబునం గృష్ణు వీడ్కొని గోపిక లిచ్చ లేకయు నిండ్లకడ కేఁగినం గృష్ణమాయామోహితు లై గోపకులు వారలం గోపింప నేర రై రివ్విధంబున. 1112

ఇంద్ర. గోపాలకృష్ణుండును ♦ గోపకాంతల్, ప్రాపించి క్రీడించిన ♦ భంగు లెల్లన్

రూపించి వర్ణించి నఁ దురంతు హృత్సంతాపంబులఁ బాయును దత్ప్రసక్తిన్.

### సర్పరూపి యగుసుదర్శనుం డను గంధర్వుని శాపవిమోచనము.

వ. అంత నొక్కనాఁడు నందాదు లైనగోపకు లంబికావనంబునకు శకటంబు లెక్కి జాతరకుం జని సరస్వతీనదీజలంబుల స్నానంబులు సేసి యుమామహేశ్వరుల నర్చించి కానిక లిచ్చి బ్రాహ్మణులకు గోహిరణ్యవస్త్రాన్నదానంబు లొసంగి జలంబులఁ బ్రాశించి నియమంబున నుండ దైవయోగంబున నాఁకొని యొక్క మహోరగంబు నిదుర వోయిననందునిం గఱచి మ్రింగ నగ్గలింప నతండు కృష్ణ కృష్ణేతివచనంబులం దన్ను విడిపింపుమని మొఱ యిడిన విని. 1114

క. గోపకు లందఱు మేల్కొని, కోపముతోఁ బెద్దగుదెలఁ గొఱవుల మొత్తం
దాపము నొందియు వదలక, పాపపుఁబెనుఁబాము నందుఁ బట్టె నరేంద్రా. 1115

వ. అయ్యవసరంబునఁ గృష్ణుండు దర్పించి పాదతాడనంబు సేసి త్రొక్కిన సర్పంబు సర్పరూపంబు విడిచి విద్యాధరేంద్రరూపంబుఁ దాల్చి హరికి మ్రొక్కిన నతనికి హరి యి ట్లనియె. 1116

ఉ. మండితమూర్తితోఁ గనకమాలికతో శుభలక్షణుండ వై
యుండెడువీవుఁ గష్టపు మహోరగదేహ మిదేల వచ్చె నె
వ్వండవు నామ మెయ్యది భవంబున కెద్ది మిషంబు నాకు నొం
డొండ యెఱుంగఁ జెప్పుము బుధోత్తమ నీపని చోద్య మయ్యెడిన్. 1117

వ. అనిన వాఁడి ట్లనియె దేవా యేను సుదర్శనుం డనువిద్యాధరుండ విమానారూఢుండ నై రూపసంపద్గర్వంబులం జొక్కి దిక్కులం జరించుచు నొక్క యెడ నాంగిరసు లైనఋషులం గురూపు లైనవారలం గని నగిన వారును నీవు రూపసంపద్గర్వంబున మమ్ము నగితివి గావున మహాసర్పంబ వై యుండు మని శపించి పిదప నే వేఁడుకొనిన ని ట్లనిరి. 1118

చ. యదుకులమందు భక్తులభయంబు హరించుటకుఁ జనార్దనుం
డుదయము నొంది యీయడవి కొక్కదినంబున రాఁ గలండు త
త్పదమున నీవు దన్నఁబడి పన్నగదేహముతోడఁ బాసి నీ
మొదలిటిమేను గాంచెదవు మూఢుఁడ పొమ్మని రో దయానిధీ. 1119

మ. నినుఁ జింతించిన [1]నిన్నుఁ బేరుకొనినన్ నిర్మూల మై క్రుస్సి పా
పనికాయంబు వినష్ట మౌ నట భవత్పాదంబు నామీఁదఁ బె
ట్టినఁ దద్బ్రాహ్మణశాపసంజనితకౌటిల్యంబు దా నిల్చునే
వనజాతేక్షణ నేఁడు వాసె నురగత్వం బెల్ల నేఁ బోయెదన్. 1120

వ. అని విన్నవించి హరికిఁ బ్రదక్షిణంబు వచ్చి మ్రొక్కి సుదర్శనుండు దివంబునకుం జనియె సర్పంబువలన నందుండు విముక్తుం డయ్యెఁ దత్ప్రకారంబు విని

1. విన్నఁ.

వెఱఁగుపడి గోపకులు దేవతామహోత్సవంబు సమాప్తించి కృష్ణకీర్తనంబు సేయుచు మరల మందకుం జని రంత. 1121

కుబేరభటుం డగుశంఖచూడుం డను గుహ్యకుని సంహరించుట.

చ. మఱియొకనాఁటిరాత్రి బల § మాధవు లుజ్జ్వలవస్త్రమాలికా
ధరులును లేపనాభరణ § ధారులు నై చని మల్లికాదిపు
ష్పరసనిమగ్నమత్తమధు § పంబులగీతము వించుఁ సద్వనాం
తరమున వెన్నెలన్ వ్రజని § తంబిను లుండఁగఁ బాడి రింపుగన్. 1122

క. ఆ పాట సెవుల సోఁకిన, నేపాటియు దేహలతల § నెఱుఁగక దృగ్వా
చాపాటవములు సెడి పడి, రాపాటలగంధు లెల్ల § నటవీవీథిన్. 1123

వ. ఇట్లు సకలభూతసమ్మోహనంబు గాఁ బాడుచు సిచ్ఛానువర్తనంబులం బ్రమత్తుల చందంబున రామకృష్ణులు క్రీడింపఁ గుబేరభటుండు శంఖచూడుం డనువాఁడు రామకృష్ణరక్షిత లగుగోపికలం దనయోగబలంబున నుత్తరపుదిక్కునకుం గొనిపోవ నయ్యోషలు రామకృష్ణేతిభాషలం బులికి నగపడిన మొదవులక్రియ మొఱ లిడిన విని. 1124

ఉ. గ్రద్దన సాలవృక్షములు § గైకొని బల్లిదు లన్నదమ్ము లా
యిద్దఱుఁ గాలమృత్యువుల § యేపున వే చని యోడ కుండుఁ డో
ముద్దియలార యంచుఁ దను § ముట్టినఁ జూచి కలంగి గుహ్యకుం
డుద్దవడిన్ నడిం బఱచె § నుత్తర మింతుల డించి భీతుఁ డై. 1125

వ. ఇట్లు గుహ్యకునిచేత విడివడిన గోపికల రక్షించుకొని యుండు మని బలభద్రునిం బలికి. 1126

శా. ఓరీ గుహ్యక పోకు పోకు మని రో § షోక్తిన్ బకారాతి వాఁ
డేరూపంబున నెందుఁ జొచ్చె నట వో § యెం దోడఁ దా నేఁగి దు
ర్వారోదంచితముష్టి వానితలఁ ద్రె § వ్వం బెట్టి తద్వీరకో
టీరభ్రాజితరత్నముం గొనియె దం § డిన్ గోపికల్ సూడఁగన్. 1127

వ. ఇట్లు శంఖచూడునిం జంపి వానిశిరోరత్నంబు దెచ్చి బలభద్రుని కిచ్చి మెప్పించె మఱియు నొక్కదినంబునం గృష్ణుండు వనంబునకుం జనిన నతనిలీలలు వాడుచు నిండ్లకడఁ దద్విరహవేదనానలభరంబు సహింపక గోపికలు దమలో ని ట్లనిరి.

శా. భ్రూవిక్షేపముతోడ దాపలిభుజం § బుం జెక్కుఁ గీలించి కె
మ్మోవిన్ వేణువుఁ గూర్చి సుస్వరముగా § మ్రోయించుచున్ సంగుళీ
ప్రావీణ్యంబు విభుండు సూపఁ గని స § ప్రాణేశ లై యుండియున్
నీవీబంధము లూడఁ జొక్కుదురు వో § నింగిన్ నిలింపాంగనల్. 1129

మ. నవమాధుర్యము గల్గుకృష్ణుమురళీ § నాదామృతస్యందముల్
సెవులం జొచ్చి హృదంతరాళముల భా § సిల్లన్ సవత్సంబు లై

యువిదా మేపులకుం దొలంగి మృగగో ॥ యూథంబు లుత్కంఠతో
దివికిం గంఠము లెత్తి లో వదలుఁ బో ॥ దేహేంద్రియవ్యాప్తులన్. 1130

శా. ఓ కంజేక్షణ కృష్ణుఁ డుజ్జ్వలితహా ॥ రోద్దాముఁ డై గానవి
ద్యాకౌతూహలితక్ష మనోజ్ఞమురళీ ॥ ధ్వానంబు గావింపఁగా
నాకర్ణించి సశంప మై మొరయునీ ॥ లాభ్రంబుగాఁ జూచుచుం
గేకారావము లిచ్చుచుక్ మురియుఁ బో ॥ కేకీంద్రసంఘాతముల్. 1131

మ. లలనా యేటికిఁ దెల్ల వాఱె రవి యే ॥ లా తోఁచెఁ బూర్వాద్రిపైఁ
గలకాలంబు సహంబు గాక నిసిగాఁ ॥ గల్పింపఁ డా బ్రహ్మ దా
వలఱేఁడుం గృప లేఁడు కీరములు దు ॥ ర్వారంబు లెట్లో కదే
కలదే మాపటివేళయుం గలుగునే ॥ కంజాక్షుసంభోగముల్. 1132

ఉ. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకు హరి ॥ యెప్పుడు గోవుల మేపి వచ్చునా
కెప్పుడు తన్ముఖాంబుజస ॥ మీక్షణ మబ్బు నతండు వచ్చి న
న్నెప్పుడు గారవించుఁ దుది ॥ నెప్పుడు మద్విరహాగ్ని రాశికిం
జెప్పఁ గదమ్మ బోఁటి మరు ॥ చేతల నుల్లము దల్లడిల్లెడిన్. 1133

మ. చెలియా కృష్ణుఁడు నన్నుఁ బాసి వనముం ॥ జేరంగ సద్యోక్షణం
బులు నా కన్నియు నుండ నుండఁగ దునా ॥ పూర్ణంబు లై సాఁగి లో
పలఁ దోఁచుం బ్రహరంబు లై దినము లై ॥ పక్షస్వరూపంబు లై
నెల లై యబ్దము లై మహాయుగము లై ॥ నిండారుకల్పంబు లై. 1134

వ. అని మఱియుఁ గృష్ణవిరహదుఃఖంబున బహువిధంబులఁ బశ్చాత్తాపంబునం బొం
దుచు గోపిక లోపికలు లేక యెట్టకేలకు దివంబు గడపి దినాంతసమయంబునందు.

మ. అదె భానుం డపరాద్రిఁ జేరె నిదె సా ॥ యంకాల మేతెంచె న
ల్లదె గోపాదపరాగ మొప్పెసఁగె బృం ॥ దారణ్యమార్గంబునం
దిదె వీతెంచె వృషేంద్ర ఘోషము ప్రియుం ॥ డేతెంచె రం డంచుఁ దా
మొదు రేతెంతురు మాపు కృష్ణునికి న ॥ య్యింతుల్ పరిభ్రాంత లై. 1136

వ. ఇట్లు దన కెదురు వచ్చిన మచ్చిక నచ్చెలువల నచ్యుతుం డిచ్ఛానువర్తనంబుల
గారవించె నంత నొక్కనాఁడు. 1137

వృషభాసురసంహారము.

సీ. ఎవ్వనిమూఁపుర ॥ మీక్షించి మేఘంబు, లద్రిశృంగం బని ॥ యాశ్రయించు
నెవ్వనిఱంకె కర్ణేంద్రియంబులు సోఁక, గర్భపాతం బగు ॥ గర్భిణులకు
నెవ్వనిపదహతి ॥ నెగయుపరాగంబు, లంధకారారాతి ॥ నావరించు
నెవ్వఁడు గొమ్ముల ॥ నెదిరించి చిమ్మినఁ, బృథ్వీధరంబులు ॥ పెల్లగిల్లు
తే. నట్టి వృషభాసురేంద్రుఁ డ ॥ హంకరించి, వాలలత యెత్తి పెనుఱంకె ॥ వైచినేలఁ
గాలుద్రవ్వుచునిశితశృం ॥ గములుసాఁచి,మంచుబెగడంగఁగవిసెన ॥ మందుఁడగుచు,

వ. ఇట్లు వృషభాకారంబున నరిష్టుండు హరికి నరిష్టంబు సేయం దలంచి పైకుఱికిన.

ఉ. క్రేపులు వాఱె గోవులకుఁ ♦ గ్రేపులు గోవులు గోవృషంబులం
బైపడె వత్సధేనువృష ♦ భంబులు గోపకులందుఁ జొచ్చె నా
గోపకు లావృషేంద్రములు ♦ గోవులు లేఁగలు విచ్చి పాఱఁ గా
గోపచమూవిభుండు గనె ♦ గోవృషదైత్యుఁడు వెంట నంటఁగన్. 1140

వ. ఇట్లు భయభ్రాంతు లై కాంతలుం దారును గృష్ణ రక్షింపు రక్షింపు మనియెడు గోపకులకు నడ్డంబువచ్చి దీనజనరక్షకుం డైనపుండరీకాక్షుం డి ట్లనియె. 1141

ఉ. బాలుర నింతులం బసులఁ ♦ బాఱఁగఁ దోలుట బంటుపంతమే
చాలు వృషాసురేంద్ర బల ♦ సంపదఁ జూపఁగ నెల్లబోఁటిగో
పాలురమంద గాదు చనఁ ♦ బైపడితేనిఁ బ్రచండకృష్ణశా
ర్దూలము నేఁడు నీగళము ♦ ద్రుంపక చంపక పోవ నిచ్చునే. 1142

ఆ. అనుచు ధిక్కరించి ♦ హాస్తతలంబులఁ, జప్పుడించి నగుచు ♦ సఖునిమీఁదఁ
బన్నగేంద్రభయద ♦ బాహుదండము సాఁచి, దండి మెఱసి దనుజ♦దండ నిలిచె.

వ. అప్పుడు. 1144

చ. ఖురముల నేలఁ ద్రవ్వుచు న ♦ కుంఠితవాలసమీరణంబులన్
విరవిరఁ బోయి మేఘములు ♦ విచ్చ విషాణము లొడ్డికొంచు దు
స్తరతరమూర్తి యై వృషభ ♦ దైత్యుఁడు గన్నుల నిప్పు లొల్కఁ గా
దురదుర వచ్చి తాఁకె రిపు ♦ దుర్మదమోచనుఁ బద్మలోచనున్. 1145

ఉ. యాదవకుంజరుండు వృష ♦ భాసురుకొమ్ములు రెండుఁ బట్టి య
ష్టాదశపాదమాత్రము గ ♦ జంబు గజంబును ద్రొబ్బుకైవడిన్
భేదిల ద్రొబ్బ నయ్యసుర ♦ బిమ్మిటి నొంది చెమర్చి మ్రొగ్గి దు
ర్మాదముతోడ డీకొనెఁ బ్ర ♦ మత్తవిమర్దను నా జనార్దనున్. 1146

ఆ. అంత గోపసింహుఁ ♦ డసురకొమ్ములు వట్టి, ధరణి ద్రొబ్బి త్రొక్కి ♦ దైత్యభటుల
కొమ్ము వీఁగ సురల♦కొమ్ము వర్ధిల వాని, కొమ్ము వెఱికి మొత్తి ♦ గూల్చె నధిప.

క. ఉక్కు సెడి రోఁజి నెత్తురు, ముక్కున వాతను స్రవింప ♦ మూత్ర శకృత్తుల్
మిక్కిలి విడుచుచుఁ బసరవు, రక్కసుఁ డని సమసెఁ బ్రజకు♦రాగం బమరన్.

వ. ఇట్లు వృషభాసురుం జంపిన నిలింపులు గుంపులు గొని విరులు వర్షింప గోపకులు హర్షింప గోపసతు లుత్కర్షింప బలభద్రుండును దానును గోవిందుండు పరమానందంబున మందకుం జనియె నంత. 1149

చ. ఘనుఁ డొకనాఁడు నారదుఁడు ♦ కంసునితోడ యశోద కూఁతుఁ దాఁ
గనుటయుఁ జక్రి దేవకికి ♦ గర్భజుఁ డౌటయు మున్ను రోహిణీ
తనయుఁడు రాముఁ డౌటయును ♦ దద్విభు లిద్దఱు మంద నున్నవా
ర్తనియు నెఱుంగఁ జెప్పిన మ ♦ హాద్భుత మంచుఁ జలించి కిన్కతోన్. 1150

చ. కొడుకుల మందలోన నిడి § గొంటుతనంబున మోసపుచ్చె నీ
బుడుగనిఁ బట్టి చంపు టిది § భావ్య మ టంచుఁ గృపాణపాణి యై
వడి వసుదేవునిం దునుమ § వచ్చినకంసునిఁ జూచి నారదుం
డుడుగుము చంపఁ బోల దని § యొడక మానిచి పోయె నింటికిన్. 1151

వ. మఱియు నలుక దీఱక కంసుండు దేవకీవసుదేవుల లోహపాశబద్ధులం జేసి కేశి యనువానిం బిలిచి రామకేశవులం జంపు మని పంపి మంత్రిభటగజారోహచాణూరముష్టికసాల్వకోసలప్రముఖుల రావించి యి ట్లనియె. 1152

శా. ఎందుఁ గా న న్నెదిరించి పోరుటకు దే § వేంద్రాదులుం జాల రీ
బృందారణ్యముమంద నిప్డు మదా § భీరార్భకుల్ రామగో
విందుల్ వర్ధిలు చున్నవారఁట రణో § ర్విం గంసు మర్దింతు మం
చుం దర్పంబులు వల్కు చుందు రఁట యా § చోద్యంబులన్ వింటిరే. 1153

క. పట్టణజనములు సూతురు, దట్టంబుగ మల్లరంగ § తలపార్శ్వములం
బెట్టింపుఁడు తమకంబులు, పుట్టింపుఁడు వీట మల్లు § పో రనుమాటన్. 1154

శా. విన్నాణంబులఁ బోర నేర్తురు మహా § వీర్యప్రతాపాదిసం
పన్నుల్ మీరలు మేటిమల్లుగములం § బ్రఖ్యాతు లై పెంపుతో
మన్నా రాబలకృష్ణులం బెనఁకువన్ § మర్దించి మత్ప్రీతి గా
సన్నుల్ గంసు పురీజనుల్ వొగడ నో § చాణూర యోముష్టికా. 1155

శా. రారా హస్తిపకేంద్ర గండమదధా § రాగంధలోభాంధగం
భీరాళివ్రజ మైనమత్కువలయా § పీడద్విపేంద్రంబు మ
ద్ద్వారోదంచితదేహళీపరిసర § స్తంభంబు డాయంగ నా
భీరుల్ రా నదలించి డీకొలుపు నీ § బీరంబు తోరంబుగన్. 1156

క. పశువిశసనములు సేయుఁడు, పశుపతికిం బ్రియము గాఁగ § భావించి చతు
ర్దశినాఁడు ధనుర్యాగము, విశదంబుగఁ జేయ వలయు § విజయముకొఱకున్.

వ. అని తనవారి నందఱ సమ్యోపసులకు నియమించి యదుశ్రేష్ఠుం డగునక్రూరునిం బిలిపించి చెట్ట వట్టికొని యి ట్లనియె. 1158

శా. అక్రూరత్వముతోడ నీవు మనఁగా § నక్రూరనామంబు ని
ర్వక్రత్వంబునఁ జెల్లె మైత్రి సలుపన్ § వచ్చున్ నినుం జేరి [1]ని
ర్వ్యాక్రోశుండవు మందలోన బలకృ § ష్ణాభీరు లస్మద్వినా
శక్రీడారతు లై చరింతు రఁట యో § జం దెచ్చి యొప్పింపవే. 1159

ఆ. నాకు వెఱచి సురలు § నారాయణుని వేఁడి, కొనిన నతఁడు వచ్చి § గోపకులము
నందుఁ గృష్ణమూర్తి § నానకదుందుభి, కుదితుఁ డయ్యె ననఁగ § నొకటి వింటి.

వ. కావున నీవు గోపకులచేత నరులు గొని ధనుర్యాగంబుఁజూడ రం డని వారలం

1. నీ వక్రోధుండవు.

దోడ్కొని రమ్ము వచ్చిన. 1161

శా. కొండల్ గూలఁగ ద్రొబ్బుకొమ్ములతుదిం గోపించి కోరాడుచో
దండిన్ దండి నధఃకరించు నొకవే దండంబు నాయింటఁ బ్ర
హ్మాండం బైనఁ గదల్ప నోపు బలకృష్ణాభీరులం బోరిలోఁ
ఖండింపం దడ వెంత దాని కదియుం గాదేని నక్రూరకా. 1162

శా. చాణూరుండును ముష్టికుండును సభా సంఖ్యాతమల్లుల్ జగ
త్ప్రాణుల్ మెచ్చరు సత్త్వసంపదల బాహాబాహి సంగ్రామపా
రీణుల్ వారలు రామకృష్ణులబలోద్రేకంబు సైరింతురే
క్షీణప్రాణులఁ జేసి చంపుదురు సూ సిద్ధంబు యుద్ధంబునన్. 1163

సీ. ఆరామకేశవు లంతరించిన వసు, దేవముఖ్యులఁ జంపి తెగువ మెఱసి
వృష్ణిభోజదశార్హ వీరులఁ దెగటార్చి, ముదుకఁడు రాజ్యకాముకుఁడు ఖలుఁడు
నగు నుగ్రసేను మా యయ్య గీటడఁగించి, పినతండ్రి దేవకుఁ బీఁచ మడఁచి
మఱియు వైరుల నెల్ల మర్దించి నేజరా, సంధ నరక బాణ శంబరాది

ఆ. సఖులతోడ భూమి చక్క మేలెదఁ బొమ్ము, తెమ్ము వేగమ వసు దేవసుతుల
మఖముపేరు సెప్పి మంత్రభేదము సేయ, వలయుఁ బెంపఁ జనదు వైరిజనుల.

వ. అనిన నక్రూరుం డిట్లనియె. 1165

ఉ. పంపినఁ బోనివాఁడనె నృపాలక మానవు లెన్నఁ దమ్ము నూ
హింపరు దైవయోగముల నించుక గానరు తోఁచినట్లు ని
ష్కంపగతిం జరింతు రది గా దన వచ్చునె యీశ్వరేచ్ఛఁ ద
ప్పింపఁగ రాదు నీపగతు బిడ్డలఁ దెచ్చెదఁ బోయి వచ్చెదన్. 1166

శ్రీకృష్ణుండు కేశివ్యోమాసురుల సంహరించుట.

వ. అని పలికి రథం బెక్కి యక్రూరుండు సనిన సకలజనులను వీడుకొలిపి కంసుం డంతిపురంబునకుం జనియె నంతఁ గంసప్రేరితుం డై. 1167

సీ. ఖురపుటాహతిఁ దూలి కుంభినీచక్రంబు, ఫణిరాజఫణలకు బరువు సేయ
భీషణహేషావి భీషితు లై మింట, నమృతాంధు లొండొరు నండఁ గొనఁగఁ
జటులచంచలసటాచ్ఛటలగాడ్పుల మేఘ, ములు విమానముల పై ముసుఁగుపడఁగ
వివృతాస్యగహ్వర విపులదంతంబులు, ప్రళయాగ్నికీలల పగిది మెఱయఁ

ఆ. గాలపాశలీల గా వాల మేపార, వాహ మగుచు గంధ వాహగతుల
విజితశక్రపాశి వీర్యపయోరాశి, కేశి వచ్చె మంద క్లేశ మంద. 1168

వ. మఱియును. 1169

క. భీషణఘోటకదానవ, హేషానిర్ఘోషభిన్న హృదయనిఖిలగో
యోషాపురుషార్భక మై, ఘోషము హరి సూడ దైన్య ఘోషం బయ్యెన్.

వ. ఆ సమయంబున, 1171

ఉ. పేదల ఘోషగోపకుల § బిట్టదలించుట వీరధర్మమా
కాదు వ్రజంబులో దనుజ § ఘస్మరుఁ డేఁ డని తన్ను రోయు క్ర
వ్యాదునిఁ జూచి గోపకుల § కడ్డము వచ్చి నిశాట యింకఁ బో
రా దని శౌరి సీరె మృగ § రాజుక్రియ న్నదిరించె దైత్యుఁడున్. 1172

ఆ. నిష్ఠురోగ్రసింహ § నినదంబుతో నింగి, మ్రింగుభంగి నోరు § మిగులఁ దెఱచి
కఱవ రాఁగ నతఁడు§గాటు దప్పించినఁ, దన్నె నెగసి తురగ§దానవుండు. 1173

ఉ. తన్నినతన్ను నంబడక § దానవహంత సమీకరంత దై
కన్నులఁ గెంపుపెం పెనయ § గ్రక్కున ఘోటనిశాటుపాదముల్
వన్నె సెడంగఁ బట్టి వడి § వైచె ధనుశ్శతమాత్రదూరముం
బన్నగడింభమున్ విసరి § పాఱఁగ వైచు ఖగేంద్రుకైవడిన్. 1174

ఉ. వైచిన మ్రొగ్గి లేచి వెస § వాజినిశాటుఁడు హుంకరించి సం
కోచము లేక పైపడిన § గోపకులేంద్రుఁడు దిగ్గజేంద్రశుం
డాచటులప్రభాబలవి § డంబక మైనభుజార్గళంబు దో
షాచరునోటిలో నిడియెఁ § జండఫణిన్ గుహ నుంచుకైవడిన్. 1175

శా. దంభోళిప్రతిమానకర్కశమహో § ద్యద్వామదోఃస్తంభమున్
శుంభల్లీల నఖారి వానిరదముల్ § చూర్ణంబులై రాలఁగా
గంభీరంబుగఁ గుక్షిలోఁ జొనిపి వీఁ § కన్ వృద్ధిఁ బొందించుచుం
గుంభించెన్ బవనంబు పిక్కటిలఁ ద § త్కుక్షిన్ నరేంద్రోత్తమా. 1176

క. వాయువు వెడలక నిలిచినఁ, గాయంబు సెమర్పఁ గన్నుఁ § గవ వెలి కుఱుకన్
మాయ సెడి తన్నుకొనుచును, గూయుచు నశ్వాసురుండు § గూలెన్ నేలన్.

ఆ. ఘోటకాసురేంద్రు § కుక్షిలోఁ గృష్ణుని, బాహు వధిక మైనఁ § బట్టులేమిఁ
బగిలి దోసపండు§పగిదిఁ దద్దేహంబు, వసుమతీశ రెండు§వ్రయ్య లయ్యె. 1178

క. నలినాక్షుఁడు లీలాగతి, విలయముఁ బొందించె నిట్లు § వీరావేశిం
బలలాశిన్ జగదభినవ,బలరాశిన్ విజితశక్ర § పాశిం గేశిన్. 1179

వ. ఆ సమయంబునం బుష్పవర్షంబులు గురియించి సురలు వినుతించి రంత హరి
భక్తివిశారదుం డైననారదుండు వచ్చి గోవిందుని సందర్శించి రహస్యంబున
నిట్లనియె. 1180

సీ. జగతీశ యోగీశ § సర్వభూతాధార, సకలసంపూర్ణ యీ § శ్వర మహాత్మ
కాష్ఠగతజ్యోతి § కైవడి నిఖిలభూ,తములందు నొకఁడ వై § నీవు మాయఁ
సద్గూఢుఁడవు గుహా § శయుఁడవు సాక్షివి, నీయంతవాఁడ వై § నీవు మాయఁ
గూడి కల్పింతువు § గుణముల వానిచేఁ, బుట్టించి రక్షించి § పొలియఁ జేయు

ఆ. దీప్రపంచ మెల్ల § నిట్టినీ విప్పుడు, రాజమూర్తు లయిన § రాక్షసులను
సంహరించి భూమి § చక్రంబు రక్షింప, నవతరించినాఁడ వయ్య కృష్ణ. 1181

వ. దేవా నీచేత నింకఁ జాణూర ముష్టిక గజ కంస శంఖ యవన ముర నరక పౌండ్రక శిశుపాల దంతవక్త్ర సాల్వప్రముఖులు మడిసెదరు పారిజాతం బపహృతం బయ్యెడిని నృగుండు శాపవిముక్తుం డగు శమంతకమణిసంగ్రహం బగు మృతబ్రాహ్మణపుత్త్రప్రదానంబు సిద్ధించు నర్జునసారథి వై యనేకాక్షౌహిణీ బలంబుల వధియించెదవు మఱియును. 1182

శా. కృష్ణా నీ వొనరించు కార్యములు లె ॥ క్కింపఁగ సమర్థుండె వ
ర్ధిష్ణుం డైన విధాత మూఁడుగుణముల్ ॥ దీపించు లోపించు రో
చిష్ణుత్వంబున నుండు నీవలన ని ॥ స్సీమంబు నీరూపు సి
ద్ధిష్ణుఁ జిష్ణు సహిష్ణు నీశు నమితుఁ ॥ విశ్వేశ్వరుఁ మ్రొక్కెదన్. 1183

వ. అని వినుతించి వీడుకొని నారదుం డరిగె నంత నొక్కనాఁడు కృష్ణసహితులయి గోపకుమారు లడవికిం జని పసుల మేపుచు నొక్కకొండదండ నిలాయన క్రీడ సేసి రందు. 1184

క. కొందఱు గొఱియల మంచును, గొందఱు పాలకుల మంచుఁ ॥ గుటిలత్వమునం
గొందఱు దొంగల మనుచును, జెంది కుమారకులు గ్రీడ ॥ సేసిరి తమలోన్.

శా. ఆలో దొంగలలో మయాసురసుతుం ॥ డాద్యుండు వ్యోముండు గో
పాలుం డై చని మేషకల్పనలతో ॥ భాసిల్లి క్రీడించు త
ద్బాలవ్రాతము నెల్ల మెల్లన చతుః ॥ పంచావశిష్టంబుగా
శైలాంతర్గుహలోనికిం గొని చనెం ॥ జౌర్యం బవార్యంబుగన్. 1186

వ. ఇట్లు కొండగుహలోనఁ గ్రమక్రమంబున గోపకుమారుల నిడి యొక్కపెనుఱాతఁ దద్ద్వారంబు గప్పి యెప్పటియట్ల వచ్చిన. 1187

ఉ. వీరుఁడు మాధవుం డఖల ॥ వేది నిశాచరభేది నవ్వుతో
నార నిశాట దొంగతన ॥ మచ్చుపడెన్ నెఱిదొంగ వీఁడు వా
భీరుల నెల్ల శైలగుహఁ ॥ బెట్టితి చిక్కినవారిఁ బెట్ట రా
రార యటంచుఁ బట్టె మృగ ॥ రాజు వృకాఖ్యముఁ బట్టుకైవడిన్. 1188

ఉ. పంకజలోచనుం డొడిసి ॥ పట్టిన శైలనిభాసురాకృతిన్
బింకముతోడఁ బొంగి విడి ॥ పించుకొనంగ బలంబు లేమి లో
శంకిలి బిట్టు తన్నుకొనఁ ॥ జక్కన యారణభీము వ్యోమునిం
గొంకక కూల్చె నవ్విభుఁడు ॥ గో యని మింట సుపర్వు లార్వఁగన్. 1189

ఆ. ఘోరదనుజు నేలఁ ॥ గూల్చి పర్వతగుహా, వాత నున్న ఱాయి ॥ వ్రయ్యఁ దన్ని
గుహఁ జరించుచున్న ॥ గోపాలకులఁ గొంచు, బల్లిదుండు [1]గొల్ల ॥ పల్లె కరిగె.

వ. అంత నారాత్రి మధురానగరంబున నక్రూరుండు వసియించి మఱునాఁడు రేపకడ (లేచి నిత్యకృత్యంబు లాచరించి) రథం బెక్కి కదలి నందగోపకులంబునకుం

1. ఘోషపల్లి.

బోవుచుం దెరువునఁ దనలో ని ట్లనియె. 1191

కంసునిపంపున నక్రూరుండు బృందావనంబునకుఁ జనుదెంచుట.

ఉ. ఎట్టితపంబు సేయఁబడె § నెట్టిచరిత్రము లబ్ధ మయ్యెనో
యెట్టిధనంబు లర్థులకు § నీఁబడెనో తొలిబామునందు నా
యట్టివివేకహీనునకు § నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టఁగ లేనియీశ్వరుని § బ్రహ్మమయున్ హరిఁ జూడఁ గల్గెడిన్. 1192

ఉ. సూరులు దొల్లి యేవిభుని § శోభితపాదనఖప్రభావళిం
జేరి భవాంధకారములఁ § జిక్కక దాఁటుదు రట్టిదేవరన్
వైరముతోడ నైనఁ బిలు § వన్ ననుఁ బంచి శుభంబు సేసె ని
ష్కారణ మైనప్రేమ నిదె § కంసునిఁ బోలుసఖుండు గల్గునే. 1193

మ. ఇతఁ డాకంసునిచేతఁ బంపువడి నన్ § హింసింప నేతెంచినాఁ
డతిదుష్టుం డని చూచునో సకలభూ § తాంతర్బహిర్మధ్యసం
గతుఁ డౌటం దలపోసి నన్ను సుజనుం § గాఁ జూచునో యెట్టియు
న్నతి గావించునొ యేక్రియం బలుకునో § నాభాగ్య మెట్లున్నదో. 1194

వ. (అని మఱియును.) 1195

మ. అలకభ్రాజిత మై సుధాంశునిభ మై § హాసప్రభోద్దామ మై
జలజాక్షం బయి కర్ణకుండలవిరా § జద్గండ మై యున్నయా
జలజాతాక్షుముఖంబు సూడఁ గలుగున్ సత్యంబు వో నాకు నా
వలది క్కేఁగుచు నున్న వీవనమృగ § వ్రాతంబు లీత్రోవలన్. 1196

ఉ. మాపటివేళ నేను జని § మాధవుపాదసమీపమందు దం
డాపతితుండ నైన నతఁ § డాశుగకాలభుజంగవేగసం
తాపితభక్తలోకభయ § దారణ మైనకరాబ్జ మాదలన్
మోపి హసించి నా కభయ § ముం గృపతోడుత నీయ కుండునే. 1197

వ. అని మఱియు నక్రూరుం డనేకవిధంబుల గోవిందసందర్శనంబు గోరుచు నమంద గమనంబున సుందరస్యందనారూఢుం డై చని చని. 1198

క. ముందటఁ గనె ఘనచందన, కుంద కుటజ తాల సాల § కురవక వట మా
కందన్ నందితబలగో,విందన్ వికచారుణార § విందన్ బృందన్. 1199

వ. కని బృందావనంబు దఱియం జొచ్చి యందు సాయంకాలంబున నడవికి నెఱి గల మేఁతల వెంబడి దిగంబడి రాక చిక్కినకుఱ్ఱ కోడె పడ్డతండంబులం గానక పొద యిఱుము మిట్టు పల్లం బనక తూఱి పాఱి వెదకి (కానక) చీరెడుగోపకుల యాహ్వానశబ్దంబు లాకర్ణించుచుఁ గోమలఘాసఖాదనకుతూహలంబులం జిక్కి మక్కువం గ్రేపులం దలంచి తలారింపక తమకంబులం దమతమయంత నంభా రవంబులు సేయుచు నూధంబులు స్రవింపఁ బరువు లిడుధేనువులును ధేనువులకు

నోసరించుచు సద్యోజాతంబు లగుతర్ణకంబుల వహించి నవసూతికలు వెనుతగు
లుటవలన దామహస్తు లై చనువల్లవుల మెల్లన విలోకించుచు మందయిరు
గెలంకులం గలంకరహితు లై పులి చివంగి వేఁగి [1]లోనగువాలుమెకంబుల మొత్తం
బులవలన నప్రమత్తులయి కుఠారకుంతశరాసనప్రముఖాయుధంబులు ధరియించి
కావలి తిరుగువ్రేలం గడచి నానావిధసరసతృణకబళఖాదనగరిష్ఠ లై గోస్థానకం
బులఁ బ్రవేశించి రోమంథలీలాలస లై యున్న ధేనువులును జన్నులు గుడిచి తల్లుల
మ్రోలఁబెల్లు రేఁగి క్రేళ్లుఱుకులేఁగలును వెదలైన మొదవులం బైకొని పరస్పర
విరుద్ధంబు లై డీకొని కొమ్ముల యుద్ధంబులు సలుపువృషభంబులును నకుంఠిత
బలంబులం గంఠరజ్జువులం ద్రెంచుకొని పాద లుఱికి దాఁటి తల్లులం దూఁటి
కుడుచుతఱిపిదూడల దట్టించి పట్ట నోపక గ్రద్దనఁ బెద్దలం జీరుగోపకుమారు
లును గొడుకుల మగల మామల మఱందుల వంచించి పంచాయుధభల్ల
భగ్నహృదయ లై గృహకృత్యంబులు మఱచి శంకిలక సంకేతస్థలంబులఁ గృష్ణా
గమతత్పర లై యున్న గోపకామినులును గోష్ఠప్రదేశంబుల గోవులకుఁ గ్రేపుల
విడిచి యొడ్డుచు మరలం గట్టుచు నీప్పుచుం గ్రీడించుగోపకులను గోఖురసము
ద్ధూతకరీషపరాగపటలంబులవలన నల్లారి మలదుల నైన ధేనుదోహనవేళావికీర్ణ
పయోబిందుసందోహపరంపరాసంపాదితపంకంబులును దోహనసమయగోపకరా
కృష్టగోస్తననిర్గతంబు లయి కలశంబులందుఁ బడియెడు క్షీరధారల చప్పుళ్లును
మహోత్కంఠసమ్మర్శనస్నిగ్ధంబు లైన మందిరద్వారదారుస్తంభంబులపొంతల
(నుండి యులికిపడి నలుదిక్కులు గనుంగొని) నూతనజనవిలోకనకుపితంబు లై
కరాళించుసారమేయంబులునుం గలిగి బలకృష్ణబాహుదండప్రాకారరక్షావిశేష
భూషం బైన ఘోషంబుఁ బ్రవేశించి యందు. 1200

క. జలజాంకుశాదిరేఖలు, గలహరిపాదములచొప్పుఁ § గని మోదముతోఁ
బులకించి రథము డిగి యు,త్కలికన్ సంతోషబాష్ప § కలితాక్షుం డై. 1201

మ. కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రం § గద్గాత్రులన్ ధేనుదో
హనవాటీగతుల న్నలంకృతుల ను § ద్యద్భాసులం బీతనీ
లనవీనోజ్జ్వలవాసులం గుసుమమా § లాధారులన్ ధీరులన్
వనితాకాములఁ గృష్ణరాముల జగ § ద్వంద్యక్రమోద్దాములన్. 1202

క. కని వారలపాదములకు, వినయంబున మ్రొక్కి భక్తి § వివశుం డగుచుం
దనువునఁ బులకాంకురములు, మొనయఁగ నానందబాష్పములు జడిగురియన్.

వ. తదనంతరంబ. 1204

క. అక్రూరు లైనజనుల న,వక్రగతిం గాచుభక్త § వత్సలుఁ డంత
న్నక్రూరుఁ గౌఁగిలించెను, జక్రాంకితహస్తతలముఁ § జాఁచి నరేంద్రా. 1205

---

1. వాలవుమొత్తంబుల.

వ. మఱియు నక్రూరుండు బలభద్రునికిం బ్రణతుండైన నతండు కౌఁగిలించి చెట్టపట్టుకొని కృష్ణసహితుండై గృహంబునకుం గొనిపోయి మే లడిగిన గద్దియ యిడి పాదప్రక్షాళనంబు సేసి మధుపర్కంబు సమర్పించి గోవు నిచ్చి సాదరంబున రసిరసాన్నంబు వెట్టించి తాంబూలగంధమాల్యంబు లొసంగి నయ్యవసరంబున నందుం (డుపవిష్టుం డైన)యక్రూరుని సత్కరించి యిట్లనియె. 1206

క. చెలియలు మొఱ యిడ నల్లుర, ఖలుఁడై పొరిగొనినయట్టి । కంసుఁడు బ్రదుకం
గలదే మనికి దశార్హుల, కిలపై మీసేమ మింక । నే మని యడుగన్. 1207

వ. అని పలికె నంత నక్రూరుం డొకపర్యంకంబున సుఖోపవిష్టుండై యుండ హరి యిట్లనియె. 1208

మ. శుభమే నీకుఁ బ్రమోదమే సఖులకుం । జుట్టాలకుఁ సేమమే
యభయంబే ప్రజ కెల్ల గోత్రజుల కా । త్మానందమే మామ ము
క్తభయుండే వసుదేవదేవకులు త । త్కారాగృహంబందు మ
త్ప్రభవవ్యాజనిబద్ధులై బ్రదికిరే । ప్రాణానిలోపేతులై. 1209

మ. నెఱి నేఁ డిక్కడ నీవు రాఁగ వగతో । నీతోడ నే మైన నా
కెఱుఁగం జెప్పు మటంచుఁ జెప్పరు గదా । యే మందు రావార్తయే
తెఱఁగుఁ లే దని డస్సిరో వగచిరో । దీనత్వముం జెందిరో
వెఱతో నాతలిదండ్రు లెట్లు వడిరో । విన్పింపు మక్రూరకా. 1210

వ. మఱియు నీ వేమికారణంబున వచ్చితని హరి యడిగిన నతండు కంసునికి నారదుండు వచ్చి చెప్పినవైరానుబంధప్రకారంబును గంసుండు దేవకీవసుదేవుల వధియింపఁ గమకించి మానినతెఱంగును ధనుర్యాగంబుపేరు సెప్పి పుత్తెంచిన ప్రకారంబును నెఱింగించిన రామకృష్ణులు నగి తమ్ముం బరివేష్టించిననందాది గోపకులం జూచి కృష్ణుం డిట్లనియె. 1211

శా. భూనాథుండు మఖంబుఁ జూడఁ బిలువం । బుత్తెంచినాఁ డవ్విభుం
గానం బోవలెఁ బాలునెయ్యి వెరుఁగుల్ । గట్నంబులుం గానికల్
మీ నేర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు తగన్ । మీమీనివాసంబులన్
యానంబుల్ గొని రండు పొందు మథురా । యాత్రాభిముఖ్యంబు గన్. 1212

వ. అని నియమించె నంత నక్రూరుండు మథురకు హరిం గొనిపోయెడి నని యెఱింగి వ్రేతలు గలంగి. 1213

మ. హరినవ్వుల్ హరిమాటలున్ హరిమనో । [1]జ్ఞాలాపముల్ లీలలున్
హరివేడ్కల్ హరిమన్ననల్ హరికరా । బ్జాలంబనాహ్వానముల్
హరిణీలోచన లందఱున్ మఱి యుపా । యం బెట్లొకో యంచులో
నెరియన్ ముచ్చటలాడి రంత గములై । యేకాంతగేహంబులన్. 1214

1. జ్ఞాలోకముల్.

నొసరించుచు సద్యోజాతంబు లగు తర్ణకంబుల వహించి నవసూతికలు వెనుతగులుటవలన దామహస్తు లై చనువల్లవుల మెల్లన విలోకించుచు మందయిరుగెలంకులం గలంకరహితు లై పులి చివంగి వేఁగి [1]లోనగు వాలుమెకంబుల మొత్తంబులవలన నప్రమత్తులయి కుఠారకుంతశరాసనప్రముఖాయుధంబులు ధరియించి కావలి తిరుగు వేలం గడచి నానావిధసరసతృణకబళఖాదనగరిష్ఠ లై గోస్థానకంబులు ప్రవేశించి రోమంథలీలాలస లై యున్న ధేనువులును జన్నులు గుడిచి తల్లుల మ్రోలఁ బెల్లు రేఁగి క్రేళ్లుఱుకు లేఁగలును వెడ లైన మొదవులం బైకొని పరస్పరవిరుద్ధంబు లై డీకొని కొమ్ముల యుద్ధంబులు సలుపు వృషభంబులును నకుంఠితబలంబులం గంఠరజ్జువులం ద్రెంచుకొని పొద లుఱికి దాఁటి తల్లులం దూఁటి కుడుచుతఱిపిదూడల దట్టించి పట్టనోపక గద్దఁ బెద్దలం జీరు గోపకుమారులును గొడుకుల మగల మామల మఱందుల వంచించి పంచాయుధభల్లభగ్నహృదయ లై గృహకృత్యంబులు మఱచి శంకిలక సంకేతస్థలంబులఁ గృష్ణాగమతత్పర లై యున్న గోపకామినులును గోష్ఠప్రదేశంబుల గోవులకుఁ గ్రేపుల విడిచి యొద్దుచు మరలం గట్టుచు నీడ్చుచుం గ్రీడించు గోపకులను గోఖురసముద్ధూతకరీషపరాగపటలంబులవలన నుల్లారి మలదుల నైన ధేనుదోహనవేళావికీర్ణపయోబిందుసందోహపరంపరాసంపాదితపంకంబులును దోహనసమయగోపకరాకృష్టగోస్తననిర్గతంబు లయి కలశంబులందుఁ బడియెడు క్షీరధారల చప్పుళ్లును మహోత్కంఠసమ్మర్శనస్నిగ్ధంబు లైన మందిరద్వారదారుస్తంభంబులపొంతల (నుండి యులికిపడి నలుదిక్కులు గనుంగొని) నూతనజనవిలోకనకుపితంబు లై కరాళించు సారమేయంబులునుం గలిగి బలకృష్ణబాహుదండప్రాకారరక్షావిశేషభూషణం బైన ఘోషంబుఁ బ్రవేశించి యందు. 1200

క. జలజాంకుశాది రేఖలు, గలహరిపాదములచొప్పుఁ । గని మోదముతోఁ
బులకించి రథము డిగి యు,త్కలికన్ సంతోషబాష్ప । కలితాక్షుం డై. 1201

మ. కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రం । గద్గాత్రులన్ ధేనుదో
హనవాటీగతుల న్నలంకృతుల ను । ద్యద్భాసులం బీతనీ
లనవీనోజ్జ్వలవాసులం గుసుమమా । లాధారులన్ ధీరులన్
వనితాకాములఁ గృష్ణరాముల జగ । ద్వంద్యక్రమోద్దాములన్. 1202

క. కని వారలపాదములకు, వినయంబున మ్రొక్కి భక్తి । వినముం డగుచుం
దనువునఁ బులకాంకురములు, మొనయఁగ నానందబాష్ప । ములు జడిగురియన్.

వ. తదనంతరంబ. 1204

క. అక్రూరు లైనజనుల న,వక్రగతిం గాచుభక్త । వత్సలుఁ డంత
న్నక్రూరుఁ గౌఁగిలించెను, జక్రాంకితహస్తతలముఁ । జాఁచి నరేంద్రా. 1205

1. వాలవుమొత్తంబుల.

వ. మఱియు నక్రూరుండు బలభద్రునికిం బ్రణతుం డైన నతండు గౌఁగిలించి చెట్టపట్టు
కొని కృష్ణసహితుం డై గృహంబునకుం గొనిపోయి మే లడిగిన గద్దియ యిడి పాద
ప్రక్షాళనంబు సేసి మధుపర్కంబు సమర్పించి గోవు నిచ్చి సాదరంబున రసి
రసాన్నంబు వెట్టించి తాంబూలగంధమాల్యంబు లొసంగె నయ్యవసరంబున
నందుం (డుపవిష్టుం డైన)యక్రూరుని సత్కరించి యి ట్లనియె. 1206

క. చెలియలు మొఱ యిడ నల్లుర, ఖలుఁడై పొరిగొనినయట్టి § కంసుఁడు బ్రదుకం
గలదే మనికి దశార్హుల, కిలపై మీ సేమ మింక § నే మని యడుగన్. 1207

వ. అని పలికె నంత నక్రూరుం డొకపర్యంకంబున సుఖోపవిష్టుం డై యుండ హరి
యి ట్లనియె. 1208

మ. శుభమే నీకుఁ బ్రమోదమే సఖులకుం § జుట్టాలకున్ సేమమే
యభయంబే ప్రజ కెల్ల గోత్రజుల కా § త్మానందమే మామ ము
క్తభయుండే వసుదేవదేవకులు త § త్కారాగృహంబందు మ
త్ప్రభవవ్యాజనిబద్ధు లై బ్రదికిరే § ప్రాణానిలోపేతు లై. 1209

మ. నెఱి నేఁ డిక్కడ నీవు రాఁగ వగతో § నీతోడ నే మైన నా
కెఱుఁగం జెప్పు మటంచుఁ జెప్పరు గదా § యే మందు రావార్త యే
తెఱఁగున్ లే దని డస్సిరో వగచిరో § దీనత్వముం జెందిరో
వెఱతో నాతలిదండ్రు లెట్లు వడిరో § విన్పింపు మక్రూరకా. 1210

వ. మఱియు నీ వేమికారణంబున వచ్చి తని హరి యడిగిన నతండు కంసునికి నార
దుండు వచ్చి చెప్పినవైరానుబంధప్రకారంబును గంసుండు దేవకీవసుదేవుల వధి
యింపఁ గమకించి మానినతెఱంగును ధనుర్యాగంబుపేరు సెప్పి పుత్తెంచిన
ప్రకారంబును నెఱింగించిన రామకృష్ణులు నగి తమ్ముం బరివేష్టించిననందాది
గోపకులం జూచి కృష్ణుం డి ట్లనియె. 1211

శా. భూనాథుండు మఖంబుఁ జూడఁ బిలువం § బుత్తెంచినాఁ డవ్విభుం
గానం బోవలెఁ బాలునెయ్యివెరుఁగుల్ § గట్నంబులుం గానికల్
మీ నేర్పొప్పఁగఁ గూడఁబెట్టుఁడు తగన్ § మీమీనివాసంబులన్
యానంబుల్ గొని రండు పొందు మథురా § యాత్రాభిముఖ్యంబు గన్. 1212

వ. అని నియమించె నంత నక్రూరుండు మథురకు హరిం గొనిపోయెడి నని యెఱింగి
వ్రేతలు గలంగి. 1213

మ. హరినవ్వుల్ హరిమాటలున్ హరిమనో § [1]జ్ఞాలాపముల్ లీలలున్
హరివేడ్కల్ హరిమన్ననల్ హరికరా § బ్జాలంబనాహ్వానముల్
హరిణీలోచన లందఱున్ మఱి యుపా § యం బెట్లొకో యంచులో
నెరియన్ ముచ్చట లాడి రంత గము లై § యేకాంతగేహంబులన్. 1214

1. జ్ఞాలోకముల్.

వ. మఱియుఁ దమలో ని ట్లనిరి. 1215

ఉ. మేటిగృహస్థు బ్రహ్మ యని ♦ మిక్కిలి నమ్మితి మమ్మ చూడ నే
పాటియు లేదు మాకుఁ బరి ♦ పాలకుఁ డైనసరోజనేత్రు ని
చ్చోట వసింప నీక యొక ♦ చోటికిఁ బో విధియించి చిన్నబి
డ్డాటలు సేసె నీసుగుణుకు ♦ లక్కట భారతి కైనఁ జెప్పరే. 1216

వ. అని విధిం దూఱుచు మదనతాపాయత్తచిత్తలై. 1217

ఉ. రమ్మని చీరినంతన పు ♦ రంబున కేఁగెఁ గాని సన్ను నీ
కొమ్మలు నమ్మినారు మరు కోలల కగ్గము సేసి పోవఁగా
ముమ్మర మైనతాపమున ♦ మ్రొగ్గుమరో యనఁ డంబుజాక్షుఁ డా
యమ్మలు గోపవృద్ధులుఁ బ్ర ♦ యాణము వల్దన రైరి చెల్లరే. 1218

శా. అక్రూరుం డని పేరు వెట్టుకొని నేఁ ♦ డస్మన్మనోవల్లభుం
జక్రిన్ మాకడఁ బాపికొంచు నరుగం ♦ జర్చించి యేతెంచినాఁ
డక్రూరుం డట క్రూరుఁ డీతఁడు నిజం ♦ బక్రూరుఁ డౌ నేని ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁ బెట్టి తనతో ♦ వం బో విచారింపఁడే. 1219

ఉ. ఫుల్లసరోజలోచనలు ♦ పూర్ణసుధాంశుముఖుల్ పురాంగనల్
మెల్లనె యెల్లి పట్టణపు ♦ మేడలనుండి సువర్ణలాజముల్
సల్లఁగ వారిఁ జూచి హరి ♦ సంగతి సేయఁ దలంచుఁ గాక ప్రే
పల్లె వసించుముద్దియలఁ ♦ బైపడ నేల తలంచు నక్కటా. 1220

క. పురసతులవిలోకనములు, సరసాలాపములు నర్మ ♦ సంభోగములున్
మరగి హరి మసల నొల్లఁడు, నరవరు లోయమ్మ నూత ♦ నప్రియులు గదే. 1221

క. పుట్టినప్పుడు హరి నెఱుఁగని, పట్టణసుందరుల కితనిఁ ♦ బట్టిఁ జేసి కడున్
దట్టపువిరహాగ్నులకును, గట్టిఁడిదైవంబు ఘోష ♦ కాంతల వెదకెన్. 1222

మ. హరి నేలా కొనిపోయె దంచు మన మా ♦ యక్రూరుఁ బ్రార్థింతమా
హరిఁ బో నీకుఁడు నిల్పరే యనుచు నేఁ ♦ డర్చింతమా వేల్పులన్
హరిపాదంబుల కడ్డముల్ వడుదమా ♦ హా దైవమా యంచు నా
తరుణుల్ గొప్పులుఁ జీరలున్ మఱచి కం ♦ దర్పజ్వరభ్రాంతలై. 1223

మ. ఉవిదల్ సిగ్గులు మాని కన్నవల నీ ♦ రొండొండ వర్షింపఁగా
వివశత్వంబులతోఁ గపోలతటసం ♦ విన్యస్తహస్తాబ్జలై
పవనోద్ధూతలతాభలై మమ్ముఁ గృపం ♦ బాటింపు గోవింద మా
ధవ దామోదర యంచు నేడ్చిరి సుజా ♦ తం బైనగీతంబులన్. 1224

వ. అంత మఱునాఁడు సూర్యోదయకాలంబునం గృష్ణుండు దనతోడఁ బయనం
బునకు గమకించి నడచుగోపికలను మరల వత్తు నని దూతికాముఖంబున నివ
ర్తించి శకటంబులందుఁ గానికలు గోరసంబు నిడికొని నందాదు లగునగోప

కులు వెనుతగుల నక్రూరచోదితం బయినరథం బెక్కి మథురాభిముఖుం డై
చను సమయంబున. 1225

చ. అదె చను చున్నవాఁడు ప్రియుఁ | డల్లదె తేరదె వైజయంతి య
ల్లదె రథఘోటకాంఘ్రిరజ | మాదెస మార్గము చూడుఁ డంచు లో
నొదవెడిమక్కువన్ హరిర | థోన్ముఖ లై గము లై వ్రజాంగనల్
గదలక [1]నిల్చి చూచి రటు | గన్నుల కబ్బినయంతమేరమున్. 1226

వ. అంత నక్రూరరామసహితుం డై చని చని. 1227

క. అవలోకించెను గృష్ణుఁడు, ప్రవిమలకల్లోలపవన | భాసితజన్య
న్నవసన్న పాపసైన్యం, గవిజనమాన్యం గళింద | కన్యన్ ధన్యన్. 1228

వ. కని తత్కాళిందియందుఁ బరిక్షుణ్ణమణిగణసముజ్జ్వలంబు లగుజలంబులు ద్రావి
తరుసమూహసమీపంబున రామసహితుం డై కృష్ణుండు రథంబు ప్రవేశించ
నంత నక్రూరుండు వారలకు మ్రొక్కి వీడ్కొని కాళిందీహ్రదంబు సొచ్చి విధి
పూర్వకంబుగ వేదమంత్రంబుల జపించుచు. 1229

అక్రూరుండు యమునన్ రామకృష్ణుల దర్శించి నుతించుట.

ఉ. స్నానము సేసి చేసి నది | చల్లనినీరను రామకృష్ణులన్
మానుగఁ జూచి వీరు రథ | మధ్యమునన్ వసియించి యున్నవా
రీనదినీరిలోపలికి | నెప్పుడు వచ్చి ర టంచు లేచి మే
ధానిధి సూచె వారిని ర | థస్థుల భక్తమనోరథస్థులన్. 1230

వ. చూచి వెఱఁగుపడి. 1231

శా. కంటిన్ మున్న రథంబుపై జలములోఁ గంటిం దుదిం గ్రమ్మఱం
గంటిం దొంటిరథంబుమీఁద నిదె యీ | కల్యాణచారిత్రు లే
వెంటం దోఁచిరి రెండుదిక్కుల మనో | విభ్రాంతియో నీరిలో
నుం డాశ్చర్యము చూతు నంచు మఱియు | న్స్నాహించి మగ్నాంగుఁ డై.

ఉ. పోషితబాంధవుండు యదు | పుంగవుఁ డాజలమందుఁ గాంచె స
ద్భాషుఁ సహస్రమస్తకవి | భాసితభూషు [2]నహీశు భూమిభృ
ద్వేషుఁ గృపాభిలాషుఁ బ్రతి | వీరచమూవిజిగీషు నిత్యసం
తోషు నరోషు నిర్దళిత | దోషు ననేకవిశేషు శేషునిన్. 1233

వ. మఱియు నీలాంబరసంయుతుండును సిద్ధోరగాదిసన్నుతుండును నై యొప్పున
ప్పాఁపఱేనిం దప్పక కనుంగొని. 1234

సీ. ఆభోగిభోగప | ర్యంకమధ్యంబున, వల నొప్పుపచ్చని | వలువవాని
మేఘంబుపై నున్న | మెఱుఁగుచందంబున, నురమున శ్రీదేవి | యొప్పువాని
మునరు తేఁటులు విష్వ | ముఖచతుష్కము గల,తనయుఁ డాడెడిబొడ్డుఁ | దమ్మివాని

1. నిక్కి...కన్నుల కద్భుత మైనదూరమున్. 2, మహీశ.

గదలినబహుపదక్రమవిశేషంబుల, వరము సూపెడినూపురములవాని

ఆ. జలజగర్భరుద్రసనకసనందన, [1]సద్ద్విజామరప్రశస్యమాన
చరితుఁడైనవానిసౌందర్యఖని యైన, వాని నొక్కపురుషవర్యుఁ గాంచె.

వ. మఱియును జారులక్షణలక్షితనఖపాదగుల్ఫజానుజంఘోరుకటినాభిమధ్యోదరుండును సాదరుండును శ్రీవత్సకౌస్తుభవనమాలికావిరాజితవిశాలవక్షుండును బుండరీకాక్షుండును శంఖచక్రగదాపద్మహస్తుండును సత్త్వగుణప్రశస్తుండును బ్రహ్మసూత్ర కటిసూత్రహార కేయూరకటక కంకణ కుండల కిరీటాదివిభూషణుండును భక్తజనపోషణుండును సుందరకపోలఫాలనాసాధరవదనకర్ణుండును నీలనీరదవర్ణుండును గంబుకంధరుండును గరుణాగుణబంధురుండును బ్రహ్లాద నారద సునంద నంద ప్రముఖసంభావితుండును శ్రీపుష్టితుష్టికీర్తికాంతీలోర్జావిద్యావిద్యాశక్తిమాయాదిసేవితుండును నైన యప్పరమేశ్వరునకు మ్రొక్కి భక్తిసంభ్రమంబు లగ్గలంబులుగ గద్గదకంఠుండై దిగ్గనం గరంబులు ముకుళించి యిట్లని వినుతించె. 1236

దండ. శ్రీమానినీమానచోరా శుభాకార వీరా జగద్ధేతుహేతుప్రకారా సమస్తంబు నస్తంగతంబై మహాలోలకల్లోలమాలాకులాభీలపాథోనిధిం గూలఁగా బాలకేళీగతిం దేలి నారాయణాఖ్యం బటుఖ్యాతి శోభిల్లు నీనాభికంజంబులో లోకపుంజంబులం బన్నువిన్నాణి యై మన్న [2]యాబమ్మ యుత్పన్నుఁ డయ్యెం గదా పావకాకాశవాతావనీవార్యహంకారమాయామహామానసాదుల్ హృషీకాదులున్ లోకముల్ లోకబీజంబులున్ నిత్యసందోహమై నీమహాదేహమం దుల్లసించున్ వసించున్ నశించున్ జడత్వంబు లేకాత్మ యై యొప్పు నీయొప్పిదం బెల్ల నో చెల్ల చెల్లన్ విచారింపఁ దారెంతవారెంతవారైన మాయాదులా మాయతోఁ గూడి క్రీడించులోకానుసంధాత యాధాత నిర్ణేతయే నీకళారాశికిం గొంద ఱంభోజగర్భాదులధ్యాత్మలందున్ నశేషాదిభూతంబులందున్ ననేకాధిదైవంబులందున్ సదాసాక్షివై యుండు దంచుం దదంతర్గతజ్యోతి వీశుండ వంచుం ద్రయీపద్ధతిం గొంద ఱింద్రాదిదేవాభిధానంబులన్ నిక్కు దొక్కండ వంచున్ మఱిం గొంద ఱారూఢకర్మంబులం ద్రుంచి సంసారముం ద్రెంచి సన్న్యస్తులై మించి విజ్ఞానచక్షుండ వంచున్ మఱిం బాంచరాత్రానుసారంబుగాఁ ద్వన్మయత్వంబుతోఁ గొంద ఱీ వాత్మ వంచున్ మఱిం గొంద ఱావాసుదేవాదిభేదంబులన్ నల్వురై చెల్వు వాటింతు వంచున్ మఱిన్ నీవు నారాయణాఖ్యుండ వంచున్ శివాఖ్యుండ వంచున్ మఱిం బెక్కుమార్గంబులన్ నిన్ను నగ్గింతు రెగ్గేమి యేఱుల్ పయోరాశినే రాసులై కూడు క్రీడన్ విశేషంబు లెల్లన్ విశేషంబు

---

1. వందనీయుఁ డగుచు ♦ వఱలువానిఁ, జతురుఁ డైనవాని; వాసవామరాదివంద్యమాన. చరణుఁ డైనవాని. 2. 'యాబన్న' అనియే వ్రా. ప్ర.

లై యుండి నీయం దనూనంబు లీనంబు లౌ నేకరాకేందుబింబంబు కుంభాంతరంభం
బులం బింబితంబైన వే యున్నదే యొన్న నేలా ఘటాంతర్గతాకాశముల్ దద్ఘటాం
తంబులం దేక మారేఖ లోకావధిన్ వీఁక నేపోకలం బోక యేకాకి వై యుండు
దీశా కృశానుండు నెమ్మోము భానుండు గన్నుల్ దిశల్ గర్ణముల్ భూమి
పాదంబు లంభోనిధుల్ గుక్షి శల్యంబు లద్రుల్ లతాసాలముల్ రోమముల్ గాలి
ప్రాణంబు బాహుల్ సురేంద్రుల్ ఘనంబుల్ గచంబుల్ నభోవీథి నాభిప్రదేశంబు
రేలుం బగళ్లున్ నిమేషంబు లంభోజగర్భుండు గుహ్యంబు వర్షంబు
వీర్యంబు నాకంబు మూర్ధంబు గా నేకమై యున్ననీమేనిదండం బయోజాత
గర్భాండముల్ మండితోదుంబరానోకహానేక [1]శాఖాఫలాపూరితా నంతజంతు
ప్రకాండంబులీలం బ్రసిద్ధోదరాశిస్థజంతుప్రకారంబుగా నిండి యుండున్ మహా
రూప నీరూపముల్ వెగ్గలం బుగ్గడింపన్ లయాంభోధిలో మీనుమేనన్ విరోధిన్
నిరోధించి సాధించి మున్ వేధకున్ వేదరాశిం బ్రసాదింపవే త్రుంపవే కైటభ
శ్రీమధుం జక్రివై యొత్తవే యెత్తవే మందరాగంబు రాగంబుతోఁ గూర్మలీలా
పరిస్పంది వై పంది వై మేదినిన్ మీఁదికిం ద్రోచి దోషాచరుం గొమ్ములన్
నెమ్ములం జిమ్ముచున్ గ్రువ్వవే త్రవ్వవే ఘోరవైరిన్ నృసింహుండ వై దండి వై
దండివైరోచనిం జూచి యాచింపవే పెంపవే మేను బ్రహ్మాండము న్నిండఁ బాఱుండ
వై రాజకోటిన్ విపాటింపవే రాజవై రాజబింబాస్యకై దుర్మదారిన్ విదారింపవే
నొంపవే క్రూరులన్ వాసుదేవాదిరూపంబులన్ శుద్ధబద్ధుండ వై వైరిదారాంత
రంగంబుల న్నంతరంగంబులుంగాఁ గరంగింపవే పెంపు దీపింపవే కల్కిమూర్తిం
బ్రవర్తించి ని న్నెన్న నే నెవ్వఁడన్ నన్ను మాయావిపన్నున్ విషణ్ణుం బ్రపన్నుం
బ్రసన్నుండ వై ఖిన్నతం బాపి మన్నింపవే పన్నగాధీశతల్పా కృపాకల్పవందారు
కల్పా నమస్తే నమస్తే నమస్తే నమః. 1237

మ. కలలం బోలెడి పుత్త్రమిత్త్రవనితా § గారాదిసంయోగముల్
[2]జలవాంఛారతి నెండమావులకు నా § సల్ సేయుచందంబునం
దలఁతున్ సత్యము లంచు మూఢుఁడ వృథా § తత్త్వజ్ఞుఁడన్ నాకు నీ
విలసత్పాదయుగంబు సూపి కరుణన్ § వీక్షింపు లక్ష్మీపతీ. 1238

వ. అని మఱియును వినుతింప నక్రూరునికి యమునాజలంబులలోన తనమొదలి మేను సూపి చాలించి నటునికైవడిన్ దిరోహితుం డైన నక్రూరుండు నీరు వెడలి వెఱఁగుపడుచు వచ్చి రథారోహణంబు సేసిన హరి యి ట్లనియె. 1239

క. జలములు చేరువ నున్నవి, తలపోయఁగ నీవు పోయి § తడ వయ్యె నదీ
జలముల నభమున ధరణిం, గలుగనిచోద్యములు నీకుఁ § గానంబడెనే. 1240

వ. అనిన నతం డి ట్లనియె. 1241

1. శాఖాశరజ్జంతుసంఘాతలీలన్న సంఖ్యాతముల్ నిండియుండన్. 2. 'జలధారల్ సరి నెండ' వ్రా. ప్ర.

క. నీలోన లేనిచోద్యము, లేలోకములందుఁ జెప్ప § రీశ్వర నీటన్
నేలన్ నింగిని నున్నవె, నీలోఁ జోద్యంబు లెల్ల § నెగడు మహాత్మా. 1242

వ. అని పలికి సాయంకాలంబునకు నక్రూరుండు మధురానగరంబు సేర రథంబు గడపె నంత నటమున్న చని నందాదులు పురోపవనంబున విడిసి యుండ వారలం గూడికొని కృష్ణుం డక్రూరునిం జూచి నీవు రథంబు గొనుచు నగరంబునకుం జనుము మేము వెనుక వచ్చెద మనిన నతం డి ట్లనియె. 1243

క. నా యింటికి విచ్చేయుము, నీయంఘ్రిసరోజరేణు § నికరము సోఁకన్
నాయిల్లు పవిత్రం బగు, శ్రీయుత నీభటునిఁ బెద్ద § సేయం దగదే. 1244

వ. అని మఱియుం బ్రార్థించిన హరి యి ట్లనియె. 1245

శ్రీకృష్ణమూర్తి మథురానగరప్రవేశము సేయుట.

క. యదుకులవిద్వేషణుఁ డై, మదమున వర్తించుకంసు § మర్దించి భవ
త్సదనంబుఁ జూడ వచ్చెదఁ, బొద యీ యాస్యందనము గొనుచుఁ § బురమున కనఘా.

వ. అని పలికిన నక్రూరుండు పురంబునకుం జని రామకృష్ణులు వచ్చి రని కంసున కెఱింగించి తనగృహంబునకుం జనియె నంత నపరాహ్ణంబున బలభద్రగోపాల సహితుం డై కృష్ణుండు. 1247

మ. పరిఖల్ కోటలుఁ గొమ్మలుం బడగలుం § బ్రాసాదముల్ వీథులున్
హరులుం దేరులు వీరులున్ గజములున్ § హర్మ్యంబులున్ వాద్యముల్
తరుణుల్ ధాన్యములున్ ధనంబులు మహో § ద్యానంబులున్ దీర్ఘికల్
గర మాశ్చర్యరుచిం దనర్చుమథురం § గాంచెన్ విభుం డంతటన్. 1248

వ. కని యప్పురంబు ప్రవేశించి వచ్చుసమయంబున. 1249

ఉ. నందతపఃఫలంబు సుగు § ణంబులపుంజము గోపకామినీ
బృందమునోముపంట సిరి § వెంట దయాంబుధి యోగిబృందమున్
డెందములందుఁ గోరెడుక § డిందినిధానము సేరవచ్చె నో
సుందరులార రండు చని § చూతము కన్నులకోర్కి దీఱఁగన్. 1250

వ. అని మఱియు గోవిందసందర్శనకుతూహలంబులఁ బౌరసుందరులు పరస్పరాహూయమాన లై భుంజాన లై భోజనభాజనంబులు దలంగఁ ద్రోచియు శయాన లై లేచియు నభ్యంజమాన లై జలంబు లాడకయు గురుజనశిక్ష్యమాణ లై యోడకయు గృహకార్యప్రవర్తమాన లై పరిభ్రమింపకయు రమణరమమాణ లై రమింపకయు శిశుజనబిభ్రాణ లై డించియు నలంకుర్వాణ లై యన్యోన్య వస్త్రాభరణమాల్యానులేపనంబులు వీడ్వడ ధరించియు నరిగి. 1251

క. వీటఁ గలచేడె లెల్లను, హాటకమణిఘటితతుంగ § హర్మ్యాగ్రములం
గూటువలు గొనుచుఁ జూచిరి, పాటించి విశాలవక్షుఁ § బద్మదళాక్షున్. 1252

సీ. వీఁడ కే రక్కసి [1]విగతజీవఁగఁ జన్నుఁ, బాలు ద్రావినమేటి బాలకుండు
వీఁడ కే నందుని వెలఁదికి జగ మెల్ల, ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు
వీఁడ కే మందలో వెన్నలు దొంగిలి, దర్పించి మెక్కిన దాఁపరీఁడు
వీఁడ కే యెలయించి వ్రేతలమానంబు, సూఱలాడినలోక సుందరుండు
తే. వీఁడు లేకున్నపుర మట వీస్థలంబు, వీనిఁ బొందనిజన్మంబు విగతఫలము
వీనిఁ బలుకనివచనంబు విహగరుతము, వీనిఁ జూడనిచూడ్కులు వృథలువృథలు.

మ. చెలియా గోపిక లీకుమారతిలకుం జింతించుచుం బాడుచుం
గలయం బల్కుచు నంటుచున్ నగుచు నా కర్షించుచున్ హస్తగా
మలకక్రీడకుఁ దెచ్చి నిచ్చలును స మ్మానంబులం బొందఁగాఁ
దొలుజన్మంబుల నేమి నోఁచిరొ కదే దుర్గప్రదేశంబులన్. 1254

క. అని మఱియుఁ బౌరకాంతలు, మునుకొని హరిరూపు నేత్రములు వెంటను లోఁ
గొని తాల్చిరి హృదయములను, జనితప్రమదమున విరులు సల్లుచు నధిపా.

వ. మఱియును. 1256

క. నానావిధగంధములుఁ బ్రసూనఫలాదులును హరిత శుభలాజములుం
గానిక లిచ్చుచు విప్రులు, మానుగఁ బూజించి రాకు మారోత్తములన్. 1257

వ. ఆసమయంబున నగరద్వారంబున నుండి వచ్చువాని నొక్కరజకుం గని హరి
యి ట్లనియె. 1258

శ్రీకృష్ణుండు రజకునిఁ జంపి వాయకసుదాము లొసంగుపూజల నంగీకరించి మేలొసంగుట.

ఉ. విందుల మైన రేశ్వరుని వీటికి వచ్చితి మేము మాకు మా
మందలలోనఁ గట్టికొన మంచిపటంబులు లేవు నీముడిన్
సుందరధౌతచేలములు శోభిలు చున్నవి తెమ్ము నిన్ను మే
లందెదు నిమ్ము రాజు దెస నల్లుర మోరజకాన్వయాగ్రణీ. 1259

వ. అనిన రోషించి వాఁ డి ట్లనియె. 1260

శా. ఎట్టెట్రా మనుజేంద్రుచేలములు మీ కేఁ బాడియే మీరలుం
గట్టం బోలుదు రే పయోఘృతదధిగ్రాసంబులన్ మత్తులై
యి ట్లాడం జనెఁ గాక గొల్లలకు మీ కెబ్బంగి నో రాడెడిం
గట్టా ప్రాణముఁ గోలుపోయెదు సుమీ కంసోద్ధతిన్ బాలకా. 1261

క. మారాజుసొమ్ముఁ గైకొన, నేరాజులు వెఱతు రింత యెల్లిద మే నీ
కీరాజరాజగృహమున, నీరాజస మేల గొల్ల యోఁగుము తలఁగన్. 1262

వ. అనిన విని రోషించి. 1263

క. ఘోర కరాగ్రతలంబున, ధీరుఁడు కృష్ణుండు శిరము దెగిపడఁ బెట్టెం

---

1. 'విగతురాలుగ' వ్రా. ప్ర.

వారులగుండెలు వగులఁగ, వీరోద్రేకిఁ గదావి § వేకిం జాకిన్. 1264

వ. ఇట్లు భగవంతుండైన రజకునిం జూచి వానివారలు పటంబులు డించి వెఱచి పఱచిన రామకృష్ణులు వలసినవస్త్రంబులు ధరియించి కొన్ని గోపకుల కొసంగి చనుచుండ. 1265

క. అంతట నొకవాయకుఁ డా, కంతుక వసుదేవసుతులఁ § గని బహువర్ణా
త్యంతమృదుపటాభరణము, లెంతయు సంతసముతోడ § నిచ్చెఁ మెచ్చన్. 1266

శా. కారుణ్యంబున వానిఁ గైకొని యలం § కారంబు గావించి శృ
గారోదంచితదిగ్గజేంద్రకలభా § కారంబులం బొల్చి రా
శూరుల్ మాధవుఁడంత వాయకునికిన్ § శూరాత్మ మహాప్రీతుఁడై
సారూప్యంబును లక్ష్మియు న్నొసఁగె నై § శ్వర్యాదిసంధాయి యై. 1267

వ. అంత నారామకృష్ణులు సుదాముం డను మాలాకారుగృహంబునకుం జనిన నతండు గని లేచి గ్రక్కున మ్రొక్కి చక్కన యర్ఘ్యపాద్యాదికంబు లాచరించి సానుచరు లయినవారలకుఁ దాంబూలకుసుమగంధంబు లొసంగి యి ట్లనియె.

ఉ. పావన మయ్యె నాకులము § పండెఁ దపంబు గృహంబు లక్ష్మికిన్
సేవితమయ్యె నిష్టములు § సేకుఱె విశ్వనిదానమూర్తు లై
భూవలయంబు గావ నిటు § పుట్టినమీరలు రాకఁ జేసి నే
నేవిధ మాచరింతుఁ బను § లెయ్యవి బంట నెఱుంగఁ జెప్పరే. 1269

వ. అని పలికి. 1270

క. దామోదరరాముల కు,ద్దామయశోహాసితతుహిన § ధాములకు వధూ
కాములకుఁ దెచ్చి యిచ్చె సు,దాముఁడు ఘనసురభికుసుమ § దామము లధిపా.

క. వారును మాలికుఁ డిచ్చిన, భూరికుసుమధామములను § భూషితు లై నీ
కోరినవర మిచ్చెద మని, కారుణ్యము సేయ నతఁడు § గని యి ట్లనియెన్. 1272

క. నీపాదకమలసేవయు, నీపాదార్చకులతోడి § నెయ్యమును నితాం
తాపారభూతదయయును, దాపసమందార నాకు § దయసేయఁ గదే. 1273

వ. అని వేఁడికొనిన నిచ్చి మఱియు మాధవుఁ డమ్మాలికునకు బలాయుఃకాంతికీర్తి సంపద లొసంగి వానిగృహంబు వెడలి రాజవీథిం జని చని. 1274

క. ఆనలినాక్షుఁడు గాంచెను, నానాలేపములభాజ § నము సేకొనుచుం
బూని చనుదెంచుదానిని, నాననరుచినిచయవినమి § తాబ్జం గుబ్జన్. 1275

వ. కని యి ట్లనియె. 1276

క. ఎవ్వరిదానవు లేపము, లెవ్వరికిం గోరి కొనుచు § నేఁగెదు నీపే
రెవ్వతె మా కిమ్మన్నియు, నివ్వటిలెడు చక్క నగుచు § నీరజనేత్రా. 1277

వ. అనిన నయ్యబల యి ట్లనియె. 1278

ఉ. చక్కనివాఁడ వౌదు సర § సంబుల నొంపకు మెల్లవారికిం

జక్కఁదనంబు లెక్కఁడి వి । చారుశరీర త్రివక్ర యంద్రు నే
నిక్కము కంసుదాసిని వి । నిర్మలలేపనవిద్యదాన నీ
మిక్కిలి రాజు మెచ్చుఁ దగ । మీఁరు విలేపనముల్ ధరింపరే. 1279

క. అని పలికి యాకుమారుల, తనువులు నగవులును వీక్షి । తమ్ములు మాటల్
దనచిత్తముఁ గరఁగించిన, ననులేపము లిచ్చె వారి । కబల ప్రియముతోన్.

సీ. ఇవ్విధంబునఁ గుబ్జ । యిచ్చిన లేపంబు, లన్నియుఁ దాను దే । హమున నలఁది
కొని ప్రసన్నతనొందికుబ్జమువ్వంకల,యొడలు సక్కఁగ నొత్తి । యునుపదలఁచి
తత్పదంబులమీఁదఁ । దనపదంబులు ద్రొక్కి, హస్తాంగుళిద్వయ । మబలగవుద
క్రింద విప్పుగ నిడి । కృష్ణుఁడు మీఁదికి, నెత్తిన వక్రత । లెల్ల మాని

ఆ. చక్కనైనచిత్తజన్మబాణముక్రియఁ, గొమరు మిగిలి పెఱుఁదు । గుచయుగంబు
సొంపు సేయఁ దరుణి । సుందరమూర్తియై, కమలనయనుఁజూచి । కాంక్షతోడ.

క. వేంచేయుము నాయింటికిఁ, బంచశరాకార యనుచు । బైకొం గాక
ర్షించి హరిఁ దిగిచెఁ గామిని, పంచాశుగబాణజాలభగ్నహృదయ యై. 1282

క. కామిని తిగిచినఁ గృష్ణుఁడు, రాముని వీక్షించి నగుచు । రాజానన మ
త్కామితముఁ దీర్చి పిదపన్, నీమందిరమునకు వత్తు । నేఁ డలుగకుమీ. 1283

వ. అని వీడుకొలిపి కృష్ణుండు విపణిమార్గంబునం జని చని తాంబూలమాలికా గంధంబులును బహువిధంబు లయినకానికలును బౌరు లిచ్చినఁ బరిగ్రహించుచు ధనుశ్శాల కరిగి యందు. 1284

క. సురరాజువింటికైవడి, గురుతర మై భూరివీర । గుప్తం బయి దు
స్తర మైనవిల్లు పొడగని, నరులు వల దనంగ బట్టు । నగి వికసితుఁ డై. 1285

శా. బంధుల్ మేలన వామహస్తమునఁ జా । పం బెత్తి మౌర్వీలతా
సంధానం బొనరించి కొంచెపుఁ దెగన్ । శబ్దించుచున్ ధీరతా
సింధుం డాహరి దాని ఖండితముగాఁ । జేసెన్ జనుల్ చూడఁగా
గంధేభంబు రసాలదండము నొగిన్ । ఖండించుచందంబునన్. 1286

క. కోదండభంగనిర్గత, నాదము వీనులకు భీష । ణం బయి యాశా
రోదోంతరములు నిండుచు, ఛేదించెన్ భోజవిభుని । బింకము నధిపా. 1287

వ. అప్పుడు. 1288

ఉ. అద్దిర రాచవిల్ విఱిచె । నర్భకుఁ డెంతయు శంక లేక నేఁ
డుద్దవిడిన్ సహింపఁ దగ । దుగ్రతఁ బట్టుద మంచుఁ గ్రుద్ధు లై
గ్రద్ధన లేచి తద్ధనువు । కావలివా రరుదేర వారి న
య్యుద్ధముఁ గూడి పట్టి మడి । యించిరి కార్ముకఖండహస్తు లై. 1289

వ. ఇట్లు రామకృష్ణులు మధురాపురంబున విహరించి వెడలి విడిదలకుం జని రంత,

### సూర్యాస్తమయచంద్రోదయములవర్ణనము.

మ. గగనారణ్యచరాంధకారగజముం § గాలాహ్వయవ్యాధుఁ డ
చ్చుగఁ బట్టం గమకించి మచ్చిడుటకై § చూతాంకురశ్రేణిచే
నొగిఁ గల్పించినకందుకం బనఁగ సూ § ర్యుం డంత వీక్షింపఁగాఁ
దగె మందప్రభతోడఁ బశ్చిమమహా § ధాత్రీధరేంద్రంబునన్. 1291

క. తరణిం డగుశీతలకరు, మరగి వియల్లక్ష్మి దన్ను § మాని ముదుకఁడున్
ఖరకరుఁడు నని ద్రొబ్బిన,కరణిన్ రవి పశ్చిమాద్రి § కడఁ గ్రుంకె నృపా.

ఆ. కళలు గలుగుఁ గాక§కమల తోఁ డగుఁ గాక, శివునిమౌళిమీఁదఁ § జేరుఁ గాక
నన్యు నొల్లఁ దపసుఁ § డైన మత్పతి యని, సాధ్విభంగిఁ గమల§జాతి మొగిడె.

క. సుందరసాయంసంధ్యా, వందనవిప్రార్ఘ్యతోయ § వజ్రహతోద్య
న్మందేహాసురరక్త, స్యందము క్రియఁ గెంపుసొం పె § సఁగె నపరదిశన్. 1294

ఆ. భూమి నిండి మింటఁ § బూర్ణమై కర్కట, మకరమీనరాశి § మహితమైన
హరియశస్సుధాబ్ధి § యందులతుంపురు, లనఁగఁ జుక్క లొప్పె § నాకసమున.

క. ఎల్లదిశలు నిండినశ్రీ, వల్లభుగుణమణుల బ్రహ్మ § వాసించుటకై
చల్లినమృగమద మనఁగా, వెల్లివిరిసెఁ దమము గగన § వీథుల నెల్లన్. 1296

క. ఆచీఁకటి వెనుతగిలినఁ, బ్రాచీదిశనుండి గంతుఁ § బరువున రవి భ
ర్మాచలముమలఁకత్రోవను, వేచనియెం గాక నిలిచి § విఱుగక యున్నే. 1297

ఉ. మీకును వైరి యెప్పుడును § మిక్కిలి మాకును వైరి రాజు దో
షాకరుఁ డింక వచ్చు జల § జాతములార మదీయబాలురం
జేకొనుఁ డంచు బాలకులఁ § జీఁకటి దాఁచినభంగిఁ జిక్కె రా
రాక వసించెఁ దుమ్మెదలు § రాత్రి సరోరుహకుట్మలంబులన్. 1298

సీ. ప్రాచీదిశాంగనా § ఫాలతలంబున, దీపించుసిందూర § తిలక మనఁగ
దర్పించి విరహుల § ధైర్యవల్లులు ద్రెంప, దర్పకుం డెత్తిన § దాత్ర మనఁగ
నలిగి కాలకిరాతుఁ § డంధకారమృగంబు, ఖండింప మెఱయించు § ఖడ్గ మనఁగ
గగనతమాలవృ § క్షముతూర్పుకొమ్మను, లలిత మై మెఱయుప § ల్లవ మనంగఁ

ఆ. దొఁగలు సంతసిల్ల § దొంగలు భీతిల్లఁ, గడలి మిన్ను ముట్టి § కడలుకొనఁగఁ
బొడిచె శీతకరుఁడు § భూరిచకోరక, ప్రీతికరుఁడు జార § భీతికరుఁడు. 1299

క. దర్పితతారాధిపపరి, సర్పితకిరణౌఘమిళిత § సకలదిశంబై
యేర్పడి కమలభవాండము, గర్పూరపుఁగ్రోవిభంగిఁ గనుపట్టె నృపా. 1300

క. ఆరేయి గోపయుతులై, క్షీరాన్నము గుడిచి రామ § కృష్ణులు మదిఁ గం
సారంభ మెఱిఁగి యిష్టవిహారంబుల నప్రమత్తు § లై యుండి రటన్. 1301

క. తనపురికి రామకృష్ణులు, సనుదెంచి నిజానుచరులఁ § జంపుటయు మహా
ధనువుఁ గదిసి విఱుచుటయును, విని కంసుఁడు నిద్ర లేక § విహ్వలమతియై.

సీ. కర్ణరంధ్రములు చేఁ గప్పిన లోపలి, ప్రాణఘోషము వినఁ బడక డిందెఁ
దోయాదికములందుఁదోఁగిచూచుచునుండఁ,దలగానరాదయ్యెఁదనువుమీఁదఁ
గరశాఖనాసికా గ్రంబుపై నిడి చూడ, గ్రహతారకలు రెంటి గానఁబడియె
వెలుఁగున నిలుచుండి వీక్షింపఁగా మేని, నీడ సరంధ్రమై నేలఁ దోఁచె
ఆ. నడుగుజాడ దృష్ట మాట లేదయ్యెను, దరువు లెల్ల హేమ తరువు లగుచు
మెఱచు చుండెఁ గాల మృత్యువు డగ్గఱి, బుద్ధి యెల్లఁ గలఁగె భోజపతికి.
క. గరళముఁ దినుటయుఁ బ్రేతముఁ, బరిరంభించుటయు నగ్న భావుఁ డవుటయున్
శిరమునఁ దైలము వడుటయు, ఖరపతి నెక్కుటయు నతఁడు కలలోఁ గనియెన్.
వ. మఱియు రక్తకుసుమమాలికాధరుండై యొక్కండ నెక్కడనేనియుం జనుచున్న వాఁడ నని కల గాంచి మరణహేతుకభ్రాంతిం జింతాక్రాంతుండై నిద్రఁ జెందక వేగించు చున్న సమయంబున. 1305

సూర్యోదయవర్ణనము.

క. అరుణహరినఖరవిదళిత, గురుతిమిరేభేంద్రకుంభ కూటవినిర్ము
క్తరుధిరమౌక్తికములక్రియ, సురపతిదిశఁ గెంపుతోడఁ జుక్కలు మెఱసెన్.
సీ. పౌలోమి దనబాలు పాన్పుపైఁ గనుపట్టఁ, బన్నినపవడంపు బంతి యనఁగ
నాయురర్థములవ్య యంబు లొత్తిలి చాటు, కాలజాంఘికు చేతిఘంట యనఁగ
ఘనజంతుజీవిత కాలరాసుల విధి, కొలువ నెత్తిన హేమ కుంభ మనఁగఁ
బశ్చిమదిక్కాంత పరఁగఁ గై సేయుచో, ముందట నిడుకొన్న ముకుర మనఁగఁ
తే. గోకతాపోపశమదివ్య ఘుటిక యనఁగఁ
బద్మినీకాంతనోముల ఫల మనంగ
మూఁడుమూర్తులసారంపు ముద్ద యనఁగ
మిహిరమండల ముదయాద్రి మీఁద నొప్పె. 1307
క. వచ్చెం జల్లనిగాడ్పులు, విచ్చెం గమలములు దమము విరిసి బిలంబుల్
చొచ్చెం బద్మమరందము, మెచ్చెం దుమ్మెదలు గ్రోలి మిహిరుఁడు వొడమన్.
క. సంకాశితోదయాచల, పంకజసఖకిరణరాగ పరిపూర్ణంబై
పంకేరుహగర్భాండము, కుంకుమసలిలంపుఁగ్రోవి కొమరున మెఱసెన్. 1309
వ. తదనంతరంబ. 1310
సీ. పాషాణవల్మీక పంకాదిరహితంబు, మృదులకాంచననిభ మృణ్మయంబు
కమనీయకస్తూరి కాజలసిక్తంబు, బద్ధచందనదారు పరివృతంబు
మహనీయకుసుమదా మధ్వజతోరణ, మండితోన్నతమంచ మధ్యమంబు
బ్రాహ్మణక్షత్త్రాది పౌరకోలాహలం, బశ్రాంతతూర్యత్ర యాంచితంబు
ఆ. నిర్మలంబు సమము నిష్కంటకంబు నై, పుణ్యపురుషుమనముఁ బోలి కంస
సైన్యయుతంగ మగుచు సంతుష్టలోకాంత, రంగ మైనమల్లరంగ మొప్పె. 1311

క. ఆమల్లరంగపరిసర, భూమిస్థితమంచమందు § భోజేంద్రుఁడు మా
న్యామాత్యసంయుతుం డై, భూమీశులు గొలువ నుండెఁ § బొంకుచు నధిపా.

మ. సకలాంభోనిధిమేఖలావహనముం § జాలించి యేతెంచునా
గకులాగంబులభంగి నొప్పుచుఁ దగం § గై సేసి చాణూరము
ష్టికకూటుల్ శలతోసలుల్ గురువులై § సేవించుచున్ రంగధా
త్రికి నేతెంచిరి తూర్యఘోషముల ను § ద్రేకం బనేకంబుగన్. 1313

క. నందాదు లైనగోపకు, లందఱుఁ జని కానుకలు స § మర్పించి నృపున్
సందర్శించి తదనుమతిఁ, జెంది మహామంచముల వ § సించిరి వరుసన్. 1314

వ. అంత రామకృష్ణులు నలంకృతు లై మల్లదుందుభినినదంబు విని సందర్శనకుతూహలంబున. 1315

క. ఓడక రంగద్వారము, జాడం జని వారు గనిరి § సమదకువలయా
పీడంబున్ భిన్నపరా, క్రీడంబున్ బ్రమదకంట § కితచూడంబున్. 1316

వ. కని తత్కరిపాలకశ్రేష్ఠుం డైనయంబష్ఠునికి మేఘనాదగంభీరభాషణంబుల రిపుభీషణుం డగుహరి యి ట్లనియె. 1317

శ్రీకృష్ణుండు కువలయాపీడ మనుగజంబును వధించుట.

శా. ఓరీ కుంజరపాల మాదెసకు నీ § యుద్యన్మదేభేంద్రముం
బ్రేరేపం బనిలేదు త్రిప్పు మరలం § బ్రేరేచినన్ నిన్ను గం
భీరోగ్రాశనితుల్యముష్టిహతులన్ § భేదించి నేఁ డంతకుం
జేరం బుత్తు మహోత్తరద్విపముతో § సిద్ధంబు యుద్ధంబునన్. 1318

వ. అని పలికి. 1319

ఉ. మించుగఁ గొప్పుఁ జక్క నిడి § మొల్లన పచ్చనిచీరఁ గాసె బం
ధించి లలాటకుంతలత § తిన్ మరలించుచు సంగరక్రియా
చుంచుతఁ జేర్చి బాలకుఁడు § చూచుజనంబులు దన్ను బాపురే
యంచు నుతింప డగ్గఱియె § హస్తజితాగము గంధనాగమున్. 1320

క. అంజక బాలకుఁ డనియును, గొంజక దయ మాలి రాజ § కుంజర యంతం
గుంజరమును డీకొలిపెను, గుంజరపాలకుఁడు కోప § కుంజరుమీఁదన్. 1321

వ. మఱియు నయ్యనేకపం బనేకపాలకప్రేరితం బయి మహావాతసంఘాతసముద్ధూతం బగు విలయకాలకీలికీలిని బిట్టు మిట్టిపడి మృత్యుదేవతయెత్తునం గాలుపోలిక శమనునిగమనిక నెదిరి మదసలిలపరిమళలుబ్ధపరిభ్రమద్భ్రమరగాయకఝుంకృతు లహంకృతి సంపాదింపం గులకుంభినీధరగుహాకుంభగుంభనంబుగా ఘీంకరించి రోషభీషణశేషభోగిభోగభయంకరం బగుకరంబున శౌరిం జీరి చీరికిం గొనక పట్టిన నట్టిట్టు గెంటి విధుంతుదవదనగహ్వరంబువలన విడివడి యుడుకు తరణికరణి దర్పించి కుప్పించి పాదమధ్యంబునకు నసాధ్యుం డై దూఁటి దాఁటి

మాటుపడినం గ్రోధబంధురం బై సింధురంబు మహార్ణవమధ్యమంథాయమాన
మంథరమహీధరంబు కైవడి జుఱజుఱం దిరిగి కానక భయానకం బై గాలివెర
వునం గని పొంగి చెంగటం బ్రళయదండిదండప్రశస్తం బగుహస్తంబు వంచి
వంచించి చుట్టిపట్టి పడవ్రేయ గమకించినం జలింపక తెంపున హరి కరిపిఱింది
కుఱికి మహోరాహువాలవల్లి కాకర్షణోదీర్ణుం డగుసుపర్ణుతెఱంగున నెగిరి శుండా
లంబువాలంబు లీలం గేల నొడిసిపట్టి జళిపించి పంచవింశతిబాణాసనప్రమా
ణమూరంబు బీరంబునం ద్రిప్పివైవ నవ్వారణంబు దుర్నివారణం బై రణంబున
కోహటింపక సవ్యాపసవ్యపరిక్రమణంబుల నవక్రం బై కవిసిన నపసవ్యసవ్యక్ర
మంబులం దప్పించి రొప్పి [1]కుప్పించి యెదుర్కొనినం గర్కశుం డయి మేచకా
చలతుంగశృంగనిభం బగుకుంభికుంభంబుచక్కటి వ్రక్కలై చెక్కు లెగయ
దురంతకల్పాంతజీమూతప్రభూతనిర్ఘాతనిష్ఠురం బగుముష్టి సారించి [2]యూంచి
పొడిచినం దద్వికీర్ణపూర్ణరక్తసిక్తమౌక్తికంబులు వసుంధరకు సంధ్యారాగరక్త
తారకాచ్ఛన్నం బగుమిన్నుచెన్నులవరింప నిలువరింపక మ్రొగ్గి మోఁకరిలి మ్ర
గ్గక దిగ్గన నగ్గజంబు లేచి చూచి త్రోచి నడచి సంహారసమయసముద్రసంఘాత
సంభూతసముత్తుంగభంగసంఘటితం బగుకులాచలంబు క్రియఁ గ్రమ్మఱ నమ్మహో
భుజునిభుజాదండంబులవలన ఘట్టితం బై కట్టలుక మట్టి నెట్టుకొన ముమ్మరంబుగం
గొమ్ములం జిమ్మిన నమ్మేటి చేసూటి మెఱసి హస్తాహస్తిసంగరంబునఁ గరం
బొప్పి దప్పిం బడక నొప్పించిన నకుంఠితకాలకంఠకఠోరభల్లభగ్నంబగుపురంబు
పగిది జలధిం జటులఝంఝానిలవికలం బగుకలంబు కైవడి నమ్మదకలంబు బలంబు
దక్కి చిక్కి స్రుక్కుపడి లోభికరంబునుంబోలె దానసలిలధారావిరహితం బై
విరహితలంపునుంబోలె నిరంతరచిత్తజాతనిగ్రహం బై గ్రహణకాలంబునుం
బోలెఁ బరాధీనఖరకరం బై ఖరకరోదయంబునుంబోలె భిన్నపుష్కరం బై
పుష్కరవైరివిలసనంబునుంబోలె నభాసితపద్మకం బై యున్నసమయంబున.

శా. కాలం ద్రొక్కి సలీలుఁ డై నగవుతోఁ గంఠీరవేంద్రాకృతిం
గేలన్ భీషణదంతముల్ వెఱికి సంక్షీణంబుగా మొత్తి గో
పాలగ్రామణి వీరమాళిమణి యై ప్రాణంబులం బాపె నా
శైలేంద్రాభముఁ బ్రాణలోభము నుదంచత్సారగంధేభమున్. 1323

వ. మఱియు దంతిదంతతాడనంబుల దంతావళపాలకులన్ హరించి తత్ప్రదేశంబు
వాసి. 1324

మ. కరిదంతంబులు మూఁపులందు మెఱయన్ ఘర్మాంబువుల్ మోములన్
నెరయన్ గోపకు లంత నంత మలయన్ నిత్యాహవస్థేము లా
హరిరాముల్ చనుదెంచి కాంచిరి మహోగ్రాడంబరాపూరితా

1. కుప్పలుగ. 2. పూఁచి.

మరమర్త్యాదిజనాంతరంగము లస § న్మల్లావనీరంగమున్. 1325

సీ. మహితరౌద్రంబున § మల్లుర కశని యై, నరుల కద్భుతముగ § నాథుఁ డగుచు
శృంగారమునఁ బుర § స్త్రీలకుఁ గాముఁడై, నిజమృత్యువై కంసు § నికి భయముగ
మూఢులు బీభత్స § మునఁబొంద వికటుఁడై, తండ్రికి దయరాఁగఁ § దనయుఁ డగుచు
ఖలులకు విరసంబు § గా దండి యై గోప, కులకు హాస్యంబుగాఁ § గులజుఁ డగుచు

ఆ. బాంధవులకుఁ బ్రేమ § భాసిల్ల వేల్పై, శాంత మొనర యోగి § జనుల కెల్లఁ
బరమతత్త్వ మగుచు § భాసిల్లె బలునితో, మాధవుండు రంగ § మధ్యమందు.

వ. అప్పుడు. 1327

క. చచ్చినకుంభీంద్రంబును, వచ్చినబలమాధవులను § వరుసం గని తా
నొచ్చినచిత్తముతోడుతఁ, జెచ్చెరఁ గడు వెఱచె భోజ § సింహుం డధిపా. 1328

ఉ. ధీరుల వస్త్రమాల్యమణి § దీప్తవిభూషణధారులన్ నటా
కారుల సర్వలోకశుభ § కారుల మానవమానినీమనో
హారుల రంగభూతల వి § హారుల గోపకుమారులన్ మహా
వీరులఁ జూచి చూచి తని § విన్ దుదిముట్టక లోకు లందఱున్. 1329

ఉ. సన్నుతరామకృష్ణముఖ § చంద్రమయూఖసుధారసంబులం
గన్నులఁ ద్రావుచందమునఁ § గాంచుచు జిహ్వల నంటి చూచులీ
ల న్నుతి సేయుచుం గరము § లం బరిరంభము సేయుభంగి న
త్యున్నతిఁ జూపుచుం దగిలి § రొండొరుతోడ రహస్యభాషలన్ 1330

క. వసుదేవునివాసంబున, వసుధన్ రక్షింప వీరు § వైష్ణవతేజో
ల్లసనమునఁ బుట్టినా రఁట, పసిబిడ్డ లనంగఁ జనదు § పరదేవతలన్. 1331

సీ. చంపె రక్కసిఁ బట్టి § చక్రవాకునిఁ గూల్చెఁ, బడఁద్రొబ్బె మద్దుల § బకునిఁ జీరె
నఘదైత్యుఁ బొరిగొనె § నడరివత్సకుఁద్రుంచె, గిరియెత్తి దేవేంద్రుఁ § గ్రిందు పఱిచెఁ
గాళియు మర్దించె § గహనానలముఁ ద్రావెఁ, గేశి నంతకపురిఁ § గేవ కనిచె
మయపుత్త్రుఁ బరిమార్చె § మఱియును దానవ, భటుల హరించి గోపకులఁ గాచె

తే. గోపకాంతలమనముల § గోర్కిఁ దీర్చె, నీసరోరుహలోచనుం § డీశుభాంగుఁ
డీ మహామహుఁ డీ దిగ్గ § జేంద్రనిభుఁడు, మనుజమాత్రుఁడె తలపోయ § మాధవుండు.

శ్రీకృష్ణబలరాములు చాణూరముష్టికులను వధించుట.

వ. అని పలుకుచుఁ బౌరజనులు చూచుచుండ రామకృష్ణులకుఁ జాణూరుం డి ట్లనియె.

మ. వనమార్గంబున గోపబాలకులతో § వత్సంబులన్ మేపుచున్
బెనఁగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీ § పృథ్వీజనుల్ సెప్ప మా
మనుజేంద్రుం డిట మిమ్ముఁ జీరఁబనిచెన్ § మల్లాహవక్రీడకుం
జనదే కొంత పరాక్రమింప మనకున్ § సభ్యుల్ విలోకింపఁగన్. 1334

మ. జవసత్త్వంబులు మేలె సాము గలదే § సత్త్రాణమే మేను భూ

ప్రవరుం బోసన మిమ్మనంగ వలెనే § పాలీ లభీష్టంబు లే
పవివో [1]కాక కృతాంతదండకమవో § ఫాలాక్షునేత్రాగ్నివో
నవనీతంబులముద్ద గాదు మెసఁగన్ § నా ముష్టి గోపార్భకా. 1335

క. జనములు నేర్చినవిద్యలు, జననాథునికొఱకుఁ గాదె § జననాథుఁడు నీ
జనములు మెచ్చఁగ యుద్ధం, బున మనముం గొంత ప్రొద్దు § పుత్తమె కృష్ణా.

వ. అనిన విని హరి యిట్లనియె. 1337

ఉ. సాములు లేవు పిన్నలము § సత్త్వము గల్దనరాదు మల్లసం
గ్రామవిశారదుల్ కులిశ § కర్కశదేహులు మీరు మీకడ
న్నేము చరించు టెట్లు ధర § ణీపతి వేడ్కలు సేయువారముం
గాము వినోదముల్ సలుపఁ § గా దనవచ్చునె యొక్కమాటికిన్. 1338

క. నీతోడుత నేఁ బెనఁగెద, బ్రీతిన్ ముష్టికునితోడఁ § బెనఁగెడి బలుఁ డు
గ్రాతతమల్లాహవమున, భూతలనాథునికి మెచ్చుఁ § బుట్టింతు సభన్. 1339

వ. అనిన విని రోషించి చాణూరుం డిట్లనియె. 1340

శా. నాతోఁ బోరఁగ నెంతవాఁడ విసిరో § నాపాటియే నీవు వి
ఖ్యాతుండం గులజుండ సద్గుణుఁడ స § త్కార్యస్వభావుండ నీ
కేతాదృగ్విభవంబు లెల్లఁ గలవే § యీవీటఁ బోరాడుటల్
ప్రేతల్ చూడఁగఁ గుప్పిగంతు లిడుటే § వీక్షింపు గోపార్భకా. 1341

శా. స్థాణున్ మెచ్చఁడు బ్రహ్మఁ గైకొనఁడు వి § ష్వక్సేను నవ్వున్ జగ
త్ప్రాణున్ ర మ్మనఁ డీడు గాఁ డని మహా § బాహాబలప్రౌఢి న
క్షీణుం డాజికి నెల్లి నేఁ డనఁడు వై § చిత్రిన్ వినోదించు న
చ్చాణూరుం డొకగోపబాలు[2]పనికిన్ § శక్తుండు గా కుండునే. 1342

క. ప్రల్లద మేటికి గోపక, బల్లిదుఁడను లోకమందుఁ § బ్రఖ్యాతుఁడ నా
చల్లడముక్రిందఁ దూఱని, మల్లురు లే రెందు ధరణి § మండలమందున్. 1343

సీ. చలమున నను డాసి § జలరాశిఁ జొరరాదు, నిగిడి గోత్రముదండ § నిలువరాదు
కేడించి కుంభిని § క్రిందికిఁ బోరాదు, మనుజసింహుఁడ నని § మలయ రాదు
చేరినఁ బడవైతుఁ § జెయి సాఁపగా రాదు, బెరసి నాముందటఁ § బెరుఁగరాదు
భూనాథహింసకుఁ § బోరాదు నను మీఱి, శోధింతుఁ గానలఁ § జొరఁగరాదు

ఆ. ప్రబలమూర్తి ననుచు § భాసిల్లఁగారాదు, ధరఁ బ్రబుద్ధుఁడ నని § తఱుమరాదు
కల్కితనము చూపి § గర్వింపఁగారాదు, తరము గాదు కృష్ణ § తలఁగుతలఁగు.

వ. అది గాక నీవు శ్రీహరి నంటేని. 1345

✓సీ. మహిమతో నుండంగ § మథురాపురముగాని, పొలుపారు వైకుంఠ § పురముగాదు
గర్వంబుతో నుండఁ § గంసునిసభ గాని, సంసారరహితుల § సభయుఁ గాదు

---

1. నీవు. 2. పనికిం.

ప్రకటించి వినఁగ నా § బాహునాదము గాని, నారదువీణాస్వ § నంబు గాదు
చదురు లాడఁగ మల్ల § జనవిగ్రహముగాని, [1]రమతోడి ప్రణయవి § గ్రహముగాదు

తే. వెలసి తిరుగంగ వేదాంత § వీథి గాదు, ఊఁఱగిపోవంగ మునిమనో § మూలగాదు
సాఁగి నడవంగ భక్తుల § జాడ గాదు, శౌరి నామ్రోల నీ వెందుఁ § జనియెదింక.

వ. అని పలికి. 1347

సీ. రోషాగ్నిధూమప్ర § రోహంబులైవడి, శిరమున సన్నపు § సిక వెలుంగ
నాశామదేభేంద్ర § హస్తసన్నిభములై, బాహుదండంబులు § భయదములుగ
లయసమయాంతకో § ల్లసితదంష్ట్రిలభంగిఁ, జాఁగినకోఱమీ § సములు మెఱయ
నల్లని తెగ గల § నడగొండచాడ్పున, నాభీల నీల దే § హంబు మెఱయఁ

ఆ. జరణహతుల ధరణి § సంచలింపఁగ సభో, మండలంబు నిండ § మల్లసఱచి
శౌరిదెసకు నడచెఁ § జాణూరమల్లుండు, పౌరలోకహృదయ § భల్లుఁ డగుచు.

వ. ఇట్లగ్గలం బగునగ్గలిక డగ్గఱిన మల్లునిం గని మెల్లన మొల్లం బగుబీరంబు వెల్లి
గొన వల్లవవల్లభుం డుల్లసిల్లి బాహునాదంబున రోదోంతరాళంబు పూరించి
మించి కవిసి యిట్లిద్దఱు నుద్దవిడి నున్నతవిషమంబు లగుఠాణ లిడి కరి కరియు
ను హరి హరియును గిరి గిరియునుం దాఁకువీఁకం దలపడి యితరేతరహేతిహింసి
తంబు లగుదవానలంబుల తెఱంగునఁ బరస్పరదీర్ఘనిర్ఘాతఘట్టితంబు లగుమహాభ్రం
బులవిభ్రమంబున నన్యోన్యతుంగతరంగతాడితంబు లగుకల్పాంతకాలసముద్రం
బులరౌద్రంబున నొండొరులముష్టిఘట్టనంబుల ఘట్టితశరీరులై దద్దరిలక (డగ్గఱి)
గ్రద్దన (నయ్యిద్దఱుం) దిరుగునెడ హరి సొచ్చి పేర్చి యార్చి జెట్టిం బట్టి పడఁ
దిగిచి పాదంబుల [2]జాడించి సముల్లాసంబున [3]నెసకంబునకు వచ్చిన మెచ్చి
(నొచ్చి) యచ్చపలుండు మీఱి మోర సారించి తెరలక పోరలం ద్రొబ్బిన
నబ్బలానుజుం డుబ్బి గొబ్బున మేను వర్ధిల్ల నర్ధాంగకంబున నుండి జానువుల నొ
త్తుచు నురవడిం గరవడంబుననున్న నా దుర్నయుండును బాల మేలు మేలని లీలం
గాలు సొర నిచ్చి త్రోచినం జూచి యేచి ఖేచరు లగ్గించి యుగ్గడింప నగ్గోపకుమా
రుండు పాటవంబుగను [4]రాటవంబునకుం జని వెన్నెక్కి నిక్కిన నక్కంసభటుండు
[5]మదజలరేఖాబంధురం బగుగంధసింధురంబుచందంబునఁ బదంబును బదంబునం
గరంబును గరంబునం గ్రహించి (సహించి) (వహించి) నైపుణంబున లోపలం
దిరిగి యట్టిట్టు తప్పించిన (దిట్టతనంబునం) దిటవు దప్పక యప్పద్మలోచనుండు
[6]కేడించి యేచి సమతలంబున వైచి ప్రచండంబగు వాని పిచండంబు లాగించి కాలఁ
ధిక్కరించి డొక్కరంబు గొనిన నయ్యభ్యాసి సభ్యులు సన్నుతింపం గ్రమ్మఱించి
జడ్డనం గా లడ్డగించి రక్షించుకొనిన నారక్షోవైరి వానికటిచేలంబు పట్టి యెత్తి

---

1. రమణతో_రమణహా_ప్రణయ. 2. జండించి. 3. సానకంబునకు. 4. రాటంబునకుం.
5. మదగజరేఖ బంధురం బగుపదంబు పదంబునఁ బాపి కరంబు. 6. కిణింగించి సమ.

రొత్తి నడుమ రాగె యిడి సందు వెట్టి నవ్విప నవ్విరోధి కాలు కాలిలో నిడి
వేధించి నిరోధించిన నిరోధంబుఁ బాసి [1]తిరిగి వసుదేవపుట్టి పట్టిసంబు గొని దట్టిం
చిన నుబ్బరికచేసి చాణూరుండు హరికరంబు వట్టి హుమ్మని నెమ్మొగంబునం గా
లిడి మీఁదైనం గేళిబాలకుండు కాలిం గాల నివారించి మీఁదై [2]నెగడి యుండ
నీక దుర్వారబలంబున విదలించి లేచి గృహీతపరిపంథిచరణుం డై విపక్షుని
వక్షంబు వజ్రివజ్రసన్నిభం బగుపిడికిటం బొడిచిన వాఁడు వాఁడి సెడక విజృం
భించి యంభోరాశిమధ్యంబున దిరుగు శైలంబుపోలిక నేల జిఱజిఱం దిరిగి తన్నిన
వెన్నుండు కుప్పించి యుప్పరం బెగసి మీఁద నుఱికిన నతండు కృష్ణపాదసంధిపరి
క్షిప్తపాదుం డై యెగయించి వైచి సముత్థితుం డయ్యె నయ్యెడ. 1349

క. బలభద్రుఁడు ముష్టికుఁడును, బలములు మెఱయంగఁ జేసి ‡ బాహాబాహిం
బ్రళయాగ్నులక్రియఁ బోరిరి, వెలయఁగ బహువిధము లయిన ‡ విన్నాణములన్.

వ. ఇవ్విధంబున. 1351

క. వల్లవులు పెనఁగి రున్నత, గల్లులతో భిన్నదిగిభ ‡ కరవల్లులతో
మల్లులతో రిపుమానస, భల్లులతో భీతగోప ‡ పల్లులతోడన్. 1352

వ. ఆ సమయంబునఁ బౌరకాంతలు మూఁకలుగట్టి వెచ్చనూర్చుచు ముచ్చటలకుం
జొచ్చి తమలో ని ట్లనిరి. 1353

ఉ. మంచికొమారులం గుసుమ ‡ మంజుశరీరులఁ దెచ్చి చెల్లరే
యంచితవజ్రసారులు మ ‡ హాద్రికఠోరులు నైనమల్లురం
గ్రించులఁ బెట్టి రాజు పెనఁ ‡ గించుచుఁ జూచుచు నున్నవాఁడు మే
లించుక లేదు మాను మనఁ ‡ డిట్టిదురాత్ముని కున్న వింటిమే. 1354

క. చూచెదరు గాని సభికులు, నీ చిన్నికుమారకులకు ‡ నీ మల్లురకున్
ఓచెల్ల యీడు గా దని, సూచింపరు పతికిఁ దమకు ‡ శోకము గాదే. 1355

సీ. వేణునాళముల మై ‡ వెలసిన మాధవుం, డధరామృతము లిచ్చి ‡ యాదరించుఁ
బింఛదామముల మై ‡ పెరిఁగిన వెన్నుఁడు, మస్తకంబునఁ దాల్చి ‡ మైత్రి నెఱపుఁ
బీతాంబరముల మై ‡ బెరసిన గోవిందుఁ, డంసభాగమునఁ బా ‡ యక ధరించు
వైజయంతికల మై ‡ వాలినఁ గమలాక్షుఁ, డతికుతూహలమున ‡ నఱుత నునుచుఁ
తే. దనరుబృందావనంబునఁ ‡ దరుల మైనఁ, గృష్ణుఁ డానందమునఁ జేరి ‡ క్రీడసల్పు
నెట్టినోములనయిన ము ‡ న్నిట్టివిధము, లేల కామైతి మోయమ్మ ‡ యింక నెట్లు.

ఉ. పాపపుబ్రహ్మ గోపికల ‡ పల్లెలలోన సృజింపరాదె ము
న్నీపురిలోపలన్ మనల ‡ నేల సృజించె న నైన నిచ్చలుం
జేపడుఁ గాదె యీసుభగుఁ ‡ జెందెడిభాగ్యము సంతసంబు నీ

1. తిరిగిన. 2. నెగడి యెగ్గడి నుండియుండక.

గోపకుమారుఁ బొంద మును గోపకుమారిక లేమి నోఁచిరో. 1357

క. గోపాలకృష్ణుతోడను, గోపాలనవేళలందుఁ గూడి తిరుగునా
గోబాలు రెంతధన్యులో, గోపాలుర కైన నిట్టి గురురుచి కలదే. 1358

క. శ్రమజలకణసిక్తం బై, కమలదళేక్షణునివదన కమలము మెఱసెన్
హిమజలకణసిక్తం బై, కమనీయం బగుచు నున్న కమలముభంగిన్. 1359

ఆ. సభకుఁ బోవఁ జనదు సభవారిదోషంబు, నెఱిఁగి యూరకున్న నెఱుఁగకున్న
నెఱిఁగి యుండి మైన నిట్టట్టు పలికినఁ, బ్రాజ్ఞుఁ డైనఁ బొందుఁ బాపచయము.

వ. అని పెక్కండ్రు పెక్కువిధంబులం బలుకుచుండఁ దద్బాహుయుద్ధంబున. 1361

క. ధృతిచెడి లోఁబడె మల్లుం, డతులితభవజలధితరికి హాతరిపుపురికిన్
జితకరికిన్ ధృతగిరికిన్, తతహారిరవభరితశిఖరి దరికిన్ హారికిన్. 1362

క. హరికిని లోఁబడి బెగడక, హరియురము మహోగ్రముష్టినిహతుఁడు పొడువన్
హరి కుసుమమాలికాహత, కరిభంగి బరాక్రమించెఁ [1]గలహోద్ధతుఁ డై. 1363

క. శౌరి నెఱిఁ జొచ్చి కరములు, క్రూరగతిన్ బట్టి త్రిప్పి కుంభిని వైచెన్
శూరుం గలహాగభీరున్, వీరుం జాణూరు ఘోరు వితతాకారున్. 1364

క. శోణితము నోర నొలుకఁగఁ, జాణూరుం డట్లు కృష్ణ సంభ్రామణసం
క్షీణుం డై క్షోణిం బడి, ప్రాణంబులు విడిచెఁ గంసు ప్రాణము గలఁగన్. 1365

క. బలభద్రుండును లోకులు, బలభద్రుం డనఁగఁ బెనఁగి బటుబాహుగతిన్
బలభేది మెచ్చఁ ద్రిప్పెను, బలవన్ముష్టికునిఁ గంసు బలములు బెగడన్. 1366

ఆ. త్రిప్పి నేల వైవ దిగ్గన రక్తంబు, వదనగహ్వరమున వఱదవాఱ
ముష్టికుండు ఘోర ముష్టిసత్త్వము సెడి, కూలె గాలిఁ దరువు గూలినట్లు.

వ మఱియును. 1368

క. పాటవమున బలుపిడికిట, నూటిం బడఁ బొడిచె బలుఁడు [2]శోభితఘనబా
హాటోపనృపతికీటుం, గూటున్ వాచాటు నధిక ఘోరలలాటున్. 1369

వ. అంత నద్దనుజాంతకుండు చరణప్రహారణంబుల భిన్నమస్తకులం జేసి తోసలశలుల నంతకాంతికంబున కనిచిన. 1370

క. వల్లవబాలకు లని మన, మల్లవరులు పెనఁగి నేఁడు మడిసిరి వీరల్
బల్లిదులు తలఁడు తలఁ డని, చెల్లాచెద రైరి పాఱి చిక్కనమల్లుర్. 1371

ఉ. మల్లురఁ జంపి గోపకస మాజములో మృగరాజురేఖ శో
భిల్లఁగఁ బాదపద్మములఁ బెల్లుగ నందెలు మ్రోయ వచ్చునా
వల్లవరాజనందనుల వారక చూచి మహీసురాదు ల
ల్లల్లన సంస్తుతించిరి ప్రి యంబుగఁ గంసుఁడు దక్క నందఱున్. 1372

1. గలుషోద్ధతుఁ డై. 2. శోభితబాహాస్ఫోటనతనృపకిరీటుం.



౬౯౩, శ్రీకృష్ణుండు కంసుని వధించుట.

శ్రీకృష్ణుండు కంసుని వధించుట.

వ. అంత సభాజనంబులకలకలంబు నివారించి మంత్రులం జూచి కంసుం డి ట్లనియె.

ఉ. వల్లవబాలురన్ నగరి వాకిటికిన్ వెడలంగ ద్రొబ్బుఁ డీ
గొల్లల ముట్టికోల్ గొనుఁడు క్రూరుని నందునిఁ గట్టుఁ డుర్వికిం
దెల్లము గాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుఁడు తండ్రి గాఁడు వీఁ
డెల్లవిధంబులం బరుల కిష్టుఁడు గావకుఁ డుగ్రసేనునిన్. 1374

వ. అని పలుకుసమయంబున. 1375

శా. జంఘాలత్వముతో నగోపరిచర త్సారంగహింసేచ్ఛ ను
ల్లంఘింపన్ గమకించుసింహముక్రియన్ లక్షించి పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరి కంసప్రాణహింసార్థి యై
లంఘించెం దమకంబుమీఁదికి రణోల్లాసంబు భాసిల్లఁగన్. 1376

క. తమకమున కెగురుయదుస, త్తమగణ్యునిఁ జూచి ఖడ్గధరుఁ డై యెదిరెం
దమకమివారలు వీరో, త్తమగణవిభుఁ డనఁగఁ గంసధరణీపతియున్. 1377

శా. పక్షీంద్రుం డురగంబుఁ బట్టువిధ మొప్పం గేశబంధంబులో
కక్షోభంబుగఁ బట్టి మౌళిమణు లా కల్పాంతవేళాపత
న్నక్షత్రంబులభంగి రాల [1]రణసంరంభంబు డిందించి రం
గక్షోణిం బడ ద్రొబ్బెఁ గృష్ణుఁడు వెసం గంసున్ నృపోత్తంసునిన్. 1378

శా. మంచాగ్రంబున నుండి రంగధరణీమధ్యంబునం గూలి యే
సంచారంబును లేక చిక్కి జను లాశ్చర్యంబునం బొందఁగా
బంచత్వంబును బొంది యున్నవిమతుం బద్మాక్షుఁ డీడ్చెన్ వడిన్
బంచాస్యంబు గజంబు నీడ్చుపగిదిన్ బాహాబలోల్లాసి యై. 1379

క. రోషప్రమోదనిద్రా, భాషాశనపానగతులఁ బాయక చక్రిన్
[2]దోషగతిఁ జూచి యైన వి, [3]శేషగతిం గంసుఁ డతనిఁ జెందె నరేంద్రా. 1380

వ. ఆ సమయంబున. 1381

క. గోపాలుఁ డొక్కఁ డద్దిర, భూపాలకుఁ జంపె వీనిఁ బొదువుం డేత
ద్రూపాలస్యము లే లని, తాపాలఘురోషు లగుచు దర్పోద్ధతు లై. 1382

శా. న్యగ్రోధుండును గహ్వుఁడున్ మొదలుగా నానాయుధానీకసా
మగ్రిం గంసునిసోదరుల్ గవియుడున్ మాద్యద్గజేంద్రాభుఁ డై
యుగ్రుం డై పరిఘాయుధోల్లసితుఁ డై యొండొండ చెండాడి కా
లాగ్రక్షోణికిఁ బుచ్చె రాముఁడు గదీ యస్థేముఁ డై వారలన్. 1383

వ. అయ్యవసరంబున. 1384

క. చేతులఁ దాళము లొత్తుచుఁ, జేతోమోదంబుతోడ సిగముడి వీడం

1. రణసన్నాహంబు రెట్టింప. 2. దోషరతిఁ. 3. శేషరుచిం.

బాతర లాడుచు మింటను, గీతము నారదుఁడు వాడెఁ గృష్ణా యనుచున్.

క. వారిజభవరుద్రాదులు, భూరికుసుమవృష్టిఁ గురిసి పొగడిరి కృష్ణున్
భేరులు మ్రోసెను నిర్జర,నారులు దివి నాడి రధికనటనముల నృపా. 1386

వ. అంతం గంసాదులకాంతలు భర్తృమరణదుఃఖాక్రాంత లై కరంబుల శిరంబులు మోఁదుకొనుచు నశ్రుసలిలధారాపరిషిక్తవదన లై సదనంబులు వెలువడి వచ్చి వీరశయ్యానిద్రితు లైనవిభులం గౌఁగిలించుకొని సుస్వరంబుల విలపించి రందుఁ గంసభార్య లి ట్లనిరి. 1387

సీ. గోపాలసింహంబు గోపించి వెల్వడి, నిను గజేంద్రముభంగి నేఁడు గూల్చె
యాదవేంద్రానిల మాభీలజవమున, నిను మహీజముమాడ్కి నేల వ్రాల్చె
వాసుదేవాంభోధివారి యుద్వేల మై, నిను దీవికైవడి నేఁడు ముంచె
దేవకీసుతవజ్రి దేవత లలరంగ, నినుఁ గొండక్రియ నేఁడు నిహతుఁ జేసె

తే. హా మనోనాథ హా వీర హా మహాత్మ
హా మహారాజ నీ విట్లు హతుఁడ వైన
మనుచు నున్నార మక్కట మమ్ముఁ బోలు
కఠినహృదయులు జగతిపైఁ గలరె యెందు. 1388

క. భూతముల కెగ్గు సేసిన, భూతంబులు నీకు నెగ్గు పుట్టించె వృథా
భూత మగుమనికి యెల్లను, భూతద్రోహికిని శుభము పొంద దధీశా. 1389

క. గోపాలకృష్ణుతోడను, భూపాలక మున్ను తొడరి పొలిసినవారిన్
నీపాల బుధులు సెప్పరె, కోపాలస్యములు విడిచి కొలువం దగదే. 1390

వ. అని విలపించుచున్నరాజవల్లభల నూరార్చి జగద్వల్లభుం డైనహరి కంసాదులకుం బరలోకసంస్కారంబులు సేయం బనిచి దేవకీవసుదేవులసంకలియలు విడిపించి బలభద్రసహితుం డై వారలకుం బ్రణామంబులు సేసిన. 1391

మ. కని లోకేశులు గాని వీరు కొడుకుల్ గా రంచుఁ జిత్తంబులన్
జనయిత్రీజనకుల్ విచారపరు లై శంకింపఁ గృష్ణుండు దా
జనసమ్మోహిని యైనమాయఁ దదభిజ్ఞానంబు వారించి యి
ట్లనియెన్ సాగ్రజుఁ డై మహావినతుఁ డై యానందసంధాయి యై. 1392

శ్రీకృష్ణుఁడు దేవకీవసుదేవులచెఱ మాన్పి యుగ్రసేనునికిఁ బట్టంబు గట్టుట.

సీ. మమ్ముఁ గంటిరి గాని మా బాల్యపౌగండ, కైశోరవయసులఁ గదిసి మీర
లెత్తుచు దించుచు నెలమి మన్నించుచు, నుండుసౌభాగ్యంబు నొంద రైతి
రాకాంక్ష గలిగియు నది దైవయోగంబు, తల్లిదండ్రులయొద్దఁ దనయు లుండి
యేయవసరమున నెబ్భంగి లాలితు, లగుచు వర్ధిల్లుదు రట్టిమహిమ

తే. మాకు నిన్నాళ్లు లే దయ్యె మఱియు వినుఁడు
నిఖిలపురుషార్థహేతు వై నెగడు చున్న

మేని కెవ్వార లాఢ్యులు ♦ మీఱ కారె
యాఋణము దీర్ప నూతేండ్ల ♦ కైనఁ జనము. 1393

క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు, తల్లికిఁ దండ్రికిని దేహ ♦ ధనముల వృత్తుల్
చెల్లింపఁ డట్టికష్టుఁడు, ప్రల్లదుఁ డామీఁద నాత్మ ♦ పలలాశి యగున్. 1394

క. జననీజనకుల వృద్ధులఁ, దనయుల గురువిప్రసాధు ♦ దారాదుల నే
జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక, వనరును జీవన్మృతుండు ♦ వాఁడు ధరిత్రిన్.

వ. అదియునుం గాక. 1396

శా. కారాశాలల మానిమిత్తము మిముం ♦ గంసుండు గారింపఁగా
వారింపంగ సమర్థతల్ గలిగియున్ ♦ వారింపఁగా రాక ని
ష్కారుణ్యాత్ముల మైనక్రూరుల మహా ♦ కౌటిల్యసంచారులన్
సారాతిక్షములార మమ్ముఁ గొఱఁతల్ ♦ సైరించి రక్షింపరే. 1397

వ. అని యిట్లు మాయామనుష్యుం డైనహరి పలికినపలుకులకు మోహితు లై వారల నంకపీఠంబుల నిడుకొని కౌఁగిలించుకొని (వారివదనంబులు) కన్నీటం దడుపుచుఁ బ్రేమపాశబద్ధు లై దేవకీవసుదేవు లూరకుండి రంత వాసుదేవుండు మాతామహుం డైన యుగ్రసేనుం జూచి. 1398

చ. అనఘ యయాతిశాపమున ♦ యాదవవీరులకున్ నరేశ్వరా
సనమున నుండ రాదు నృప ♦ సత్తమ రాజవు గమ్ము భూమి కే
నినుఁ గొలువంగ నిర్జరులు ♦ నీ కరిఁ బెట్టుదు రన్యరాజులం
బనిగొను టెంత రమ్ము జన ♦ పాలనశీలివి గమ్ము వేడ్కతోన్. 1399

వ. అని పలికి. 1400

క. మన్నించి రాజుఁ జేసెను, వెన్నుఁడు సత్యావధాను ♦ విశ్రుతదానున్
సన్నుతమానున్ గదన, చ్ఛిన్నాహితసేను నుగ్ర ♦ సేనున్ దీనున్. 1401

వ. తదనంతరంబ తొల్లి కంసభీతు లై విదేశంబులం గృశియించు చున్నయదువృష్ణిభోజమరుదశార్హకుకురాంధకప్రముఖు లగుసకలజ్ఞాతిసంబంధులను రావించి చిత్తంబు లలర విత్తంబు లిచ్చి వారివారినివాసంబుల నుండ నియోగించె నివ్విధంబున. 1402

క. మధుసూదనసత్కరుణా, మధురాలోకనవిము క్త ♦ మానసభయు లై
మధురవచనములఁ దారును, మధురానగరంబు ప్రజలు ♦ మనిరి నరేంద్రా. 1403

వ. అంత నొక్కనాఁడు సంకర్షణసహితుం డై నందునిం జేరి గోవిందుం డి ట్లనియె.

శా. తండ్రిం జూడము తల్లిఁ జూడము యశో ♦ దాదేవియున్ నీవు మా
తండ్రిం దల్లియు నంచు నుండుదుము స ♦ ద్ధర్మంబులం దొల్లి యే
తండ్రుల్ బిడ్డల నిట్లు పెంచిరి భవ ♦ త్స్నైజన్యభావంబులం
దండ్రీ యింతటివార మైతిమి గదా ♦ తత్తద్వయోలీలలన్. 1405

ఉ. ఇక్కడ నున్న బాంధవుల । కెల్లను సౌఖ్యము సేసి వత్తు మే
మక్కడికిన్ మదీయులకు । నందఱకున్ వినిపింపు మయ్య నే
మెక్కడ నున్న మాకు మది । నెన్నఁడుఁ బాయవు మీ వ్రజంబులో
మక్కువతోడ మీరు కృప । మా కొనరించు క్రియావిశేషముల్. 1406

వ. అని పలికి వస్త్రభూషణాదు లొసంగి సాదరంబునం గౌఁగిలించుకొని గోవిందుం డనిచిన నందుండు ప్రణయవిహ్వలుం డై బాష్పజలపూరితలోచనుం డగుచు వల్లవులుం దానును వ్రేపల్లెకుఁ జనియె నంత. 1407

క. గర్గాదిభూసురోత్తమ, వర్గముచే నుపనయనము । వసుదేవుఁడు స
న్మార్గంబునఁ జేయించెను, నిర్గర్వచరిత్రులకును । నిజపుత్త్రులకున్. 1408

క. ద్విజరాజత్వము నొందిరి, ద్విజరాజముఖాంబుజోప । దిష్టవ్రతు లై
ద్విజరాజత్వము నొందిరి, ద్విజరాజాదికజనంబు । దీవింపంగన్. 1409

వ. ఉపనయనానంతరంబున వసుదేవుండు బ్రాహ్మణులకు సదక్షిణంబు గా ననేక గోహిరణ్యాదిదానంబు లొసంగి తొల్లి రామకృష్ణులజన్మసమయంబులందు నిజమనోదత్తలైనగోవుల నుచ్చరించి యిచ్చి కామితార్థంబుల నర్థులకుం బెట్టె నిట్లు బ్రహ్మచారు లై. 1410

శా. ఉర్విన్ మానవు లెవ్వరైన గురువా । క్యోద్యుక్తు లై కాని త
త్పూర్వార్యారంభము సేయఁ బోల దనుచున్ । బోధించుచందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువు లై । సంపూర్ణు లై యుండియుం
గుర్వంగీకరణంబు సేయఁ జని రా । గోవిందుఁడున్ రాముఁడున్. 1411

వ. చని మహావైభవరాశి యైనకాశిం జేరి తత్తీరంబున నవంతీపురనివాసియు సకలవిద్యావిలాసియు నైనసాందీపని యనుబుధవర్యుసిం గని యథోచితంబుగ దర్శించి శుద్ధభావవర్తనంబుల భక్తి సేయు చుండ వారలవలన సంతుష్టుం డై. 1412

శా. వేదశ్రేణియు సంగకంబులు ధను । ర్వేదంబుఁ దంత్రంబు మ
న్వాదివ్యాహృతధర్మశాస్త్రములు ను । ద్యన్న్యాయముం దర్కవి
ద్యాదక్షత్వము రాజనీతియును ష । ట్ప్రక్రియం జెప్పె నా
భూదేవాగ్రణి రామకృష్ణులకు సం । భూతప్రమోదంబునన్. 1413

క. అఱువదినాలుగువిద్యలు, నఱువదినాలుగుదినంబు । లం జెన వారల్
నెఱవాదు లైనకతమున, నెఱి [1]నొక్కొకనాఁటివినికి । నేర్చి రిలేశా. 1414

క. గురువులకు నెల్ల గురు లై, గురులఘుభావములు లేక । కోమ రొందుజగ
ద్గురులు త్రిలోకహితార్థము, గురుశిష్యన్యాయలీలఁ గొలిచిరి వేడ్కన్. 1415

వ. ఇట్లు కృతకృత్యు లైనశిష్యులం జూచి వారలమాహాత్మ్యంబునకు వెఱఁగుపడి సభార్యుం డైనసాందీపని యి ట్లనియె. 1416

1. నొక్కొకమాటువినికి.

శా. అంభోరాశిం బ్రభాసతీర్థమున ము § న్నస్మత్తనూసంభవుం
డంభోగాహము సేయుచుఁ దిమిఁగిలం § డయ్యెం గృపాంభోనిధుల్
శుంభద్వీర్యులు మీరు మీగురునకుం § జోద్యంబుగా శిష్యతా
గాంభీర్యంబునఁ బుత్త్రదక్షిణ యిడం § గర్తవ్య మూహింపరే. 1417

క. శిష్యులు బలాఢ్యులైన వి, శేష్యస్థితి నొంది గురువు § జీవించును ని
ర్ధామ్యగుణబలగరిష్ఠులు, శిష్యుల రై గురునికోర్కె § సేయం దగదే. 1418

వ. అనిన విని రామకృష్ణులు గురువర్థంబుగా దుర్వారరథారూఢు లై రయంబునం
జని రౌద్రంబున సముద్రంబుఁ జేరి యి ట్లనిరి. 1419

క. సాగర సుబుద్ధితోడను, మాగురుపుత్త్రకునిఁ దెమ్ము § మా ఱాడిన నీ
వాగడ మవుదువు దుస్సహ, వేగరణాభీలనిశిత § విశిఖాగ్నులకున్. 1420

వ. అనిన వారలకు జలరాశి యి ట్లనియె. 1421

ఉ. వంచన యింత లేదు యదు § వల్లభులార ప్రభాసతీర్థమం
దంచితమూర్తి విప్రసుతుఁ § డార్యుఁడు తోయము లాడు చుండ ను
త్సంచలితోర్మి యొక్కటి ప్ర § చండగతిం గొనిపోయెఁ బోవఁగాఁ
బంచజనుండు మ్రింగె నతి § భాసురశీలుని విప్రబాలునిన్. 1422

వ. అని వానివసియించుచో టెఱింగించిన. 1423

శా. శంఖారావముతోడఁ బంచజనుఁడుం § శంకించి చిత్తంబులో
సంఖిన్నుండుగ వార్ధిఁ జొచ్చి దహన § జ్వాలాభహేమోజ్జ్వల
త్పుంఖాస్త్రంబునఁ గూల్చి వానిజఠరం § బుం వ్రచ్చి గోవిందుఁ డ
ప్రేంఖచ్చిత్తుఁడు బాలుఁ గానక గురు § ప్రేమోదితోద్యోగుఁ డై. 1424

క. దానవునిదేహజం బగు, మానితశంఖంబు గొనుచు § మసలక బలుఁడుం
దో నేతేరఁగ రథి యై, దానవరిపుఁ డరిగె దండ § ధరుపురికి నృపా. 1425

వ. చని సంయమనీనామనగరంబుఁ జేరి తద్ద్వారంబునఁ బ్రళయకాలమేఘగంభీర
నినదభీషణం బగుశంఖంబు పూరించిన విని వెఱఁగుపడి. 1426

శా. అస్మద్బాహుబలంబు గైకొనక శం § ఖారావముం మానసా
పస్మారంబుగ నెవ్వఁ డొక్కొ నగర § ప్రాంతంబునం జేసె మ
ద్విస్మేరావహరోషపావకునిచే § విధ్వస్తుఁ డై వాఁడు దా
భస్మం బై చెడు నంచు నంతకుఁడు కో § పప్రజ్వలన్మూర్తి యై. 1427

వ. వచ్చి రామకృష్ణులం గని వారు లీలామనుష్యు లయినవిష్ణుమూర్తు లని యెఱింగి
భక్తితోడ శుశ్రూష సేసి సర్వభూతమయుం డగుకృష్ణునకు నమస్కరించి యేమి
సేయుదు నాన తి మ్మనిన నమ్మహాత్ముం డి ట్లనియె. 1428

క. చెప్పెద మాగురునందనుఁ, దప్పు గలుగఁ జూచి నీవు § దండనమునకుం
దెప్పించినాఁడ వాతని, నొప్పింపుము మాకు వలయు § నుత్తమచరితా. 1429

క. అనిన విని వీఁడె వీనిం, గొనిపొం డని భక్తితోడ గురునందను ని
చ్చినఁ గృష్ణుఁడు వీడ్కొలిపెను, ఘనదుర్జనదమను మహిమగమనుఁ శమనున్.

వ. ఇట్లు జము నడిగి తెచ్చి రామకృష్ణులు సాందీపనికిం బుత్త్రుని సమర్పించి యింక నేమి సేయ వలయు నానతిం డనిన నతం డిట్లనియె. 1431

క. గురునకుఁ గోరినదక్షిణఁ, గరుణన్ ము న్నిష్వఁ డిచ్చె ఘనులార భవ
ద్గురునకుఁ గోరినదక్షిణఁ, దిరముగ నిచ్చితిరి మీరు దీపితయశులై. 1432

క. కాలునివీటికిఁ జని మృత, బాలకుఁ దే నొరులవశమె భవదీయకృపన్
మేలు దొరకొనియె మాకు వి,శాల మగుం గాత మీయశము లోకములన్.

వ. మహాత్ములారా యేను గృతార్థుండ నైతి నని దీవించిన సాందీపని వీడ్కొని కృతకృత్యులై రామకృష్ణులు రథారోహణంబు సేసి మధురకుం జనుదెంచి పాంచజన్యంబు పూరించినం గని నష్టధనంబులు గనినవారిభంగిం బ్రజలు ప్రమోదించి రంత నొక్కనాఁ డేకాంతంబున. 1434

శ్రీకృష్ణుండు గోపకాంతలచెంతకు నుద్ధవునిఁ బంపుట.

శా. నాపైఁ జిత్తము లెప్పుడున్ నిలుపుచున్ నా రాకఁ గాంక్షించుచున్
నాపే రాత్మల నావహించుచు వగన్ నానాప్రకారంబులన్
గోపాలాంగన లెంతజాలిఁ బడిరో కోపించిరో దూఱిరో
వ్రేపల్లెన్ [1]నిజధర్మగేహములలో విభ్రాంతచైతన్యలై. 1435

వ. అని చింతించి. 1436

క. సిద్ధవిచారు గభీరున్, వృద్ధవచోవర్ణనీయు వృష్ణిప్రవరున్
బుద్ధినిధి నమరగురుసము, నుద్ధవునిం జూచి కృష్ణుఁ డొయ్యన పలికెన్. 1437

శా. రమ్మా యుద్ధవ గోపకామినులు నా రాకల్ నిరీక్షించుచున్
సమ్మోహంబున నన్నియున్ మఱచి యే చందంబునం గుందిరో
తమ్మున్ నమ్మినవారి డిగ్గవిడువన్ ధర్మంబు గా దండ్రు వే
పొమ్మా ప్రాణము లేక్రియన్ నిలిపిరో ప్రోద్యద్వియోగాగ్నులన్. 1438

క. లౌకిక మొల్లక నన్నే, లోకించు ప్రపన్నులకును లోఁబడి కరుణా
లోకనములఁ బోషింతును, నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్. 1439

క. సందేహము మానుం డర,విందాననలార మిమ్ము విడువను వత్తున్
బృందావనమున కని హరి, సందేశము పంపె ననుచు సంకేతమునన్. 1440

వ. అని మందహాససుందరవదనారవిందుండై కరంబు కరంబున నవలంబించి సరసవచనంబు లాడుచు వీడుకొలిపిన నుద్ధవుండును రథారూఢుండై సూర్యాస్తమయసమయంబునకు నందవ్రజంబు చేరి వనంబులనుండి వచ్చుగోవులచరణరేణువులం బ్రచ్ఛన్నరథుండై చొచ్చి నందుమందిరంబు ప్రవేశించిన. 1441

1. నిజసద్మగేహములలో.

శా. ఆపుణ్యాత్మునిఁ గౌఁగిలించుకొని సం § దాభీరుఁ డానంది యై
మా పాలింటికిఁ గృష్ణుఁ డీతఁ డనుచున్ § మన్నించి పూజించి వాం
ఛాపూర్ణంబుగ మంజులాన్న మిడి మా § ర్గాయాసముం బాపి స
ల్లాపోత్సాహముతోడ ని ట్లనియె సం § లక్షించి మోదంబునన్. 1442

క. నామిత్త్రుఁడు వసుదేవుఁడు, సేమంబున నున్నవాఁడె § చెలువుగఁ బుత్త్రుల్
సేమంబున సేవింప మ, హామత్తుం డైనకంసుఁ § డడఁగినపిదపన్. 1443

శా. అన్నా భద్రమె తల్లిదండ్రుల మమున్ § హర్షించి చింతించునే
తన్నుం బాసినగోపగోపికల మి § త్త్రవ్రాతమున్ గోగణం
బు న్నిత్యంబు దలంచునే వననదీ § భూముల్ ప్రసంగించునే
వెన్నుం డెన్నఁడు వచ్చునయ్య యిట మా § వ్రేపల్లెకు న్నుద్ధవా. 1444

క. అంకిలి కలుగక మా కక, లంకేందునిపగిదిఁ గాంతి § లలితం బగుత
త్పంకజనయనుని నెమ్మొగ, మింక విలోకింపఁ గలదె § యీజన్మమునన్. 1445

క. అని హరి మున్నొనరించిన, పను లెల్లను జెప్పి చెప్పి § బాష్పాకులలో
చనుఁ డై డగ్గుత్తికతో, వినయంబున నుండె గోప § వీరుం డంతన్. 1446

క. పెనిమిటి బిడ్డనిగుణములు, వినుతింప యశోద ప్రేమ § విహ్వలమతి యై
చను మొనలఁ బాలు గురియఁగఁ, గనుఁగొనలను జలములొలుకఁ § గా బెగ్గిలియెన్.

వ. ఇట్లు గోవిందసందర్శనాభావవిహ్వలు లైనయశోదానందులకు నుద్ధవుం డి
ట్లనియె. 1448

క. జననీజనకుల మిమ్ముం, గనుఁగొన శీఘ్రంబె వచ్చుఁ § గని భద్రంబుల్
వనజాక్షుం డొనరించును, మనమున వగపకుఁడు ధైర్య § మండనులారా. 1449

మ. బలుఁడుం గృష్ణుఁడు మర్త్యులే వసుమతీ § భారంబు వారింప వా
రలరూపంబులఁ బుట్టినాఁడు హరి ని § ర్వాణప్రభుం డెవ్వఁ డు
జ్జ్వలుఁ డై ప్రాణవియోగకాలమునఁ ద § త్సర్వేశుఁ జింతించు వాఁ
డలఘుశ్రేయముఁ బొందు బ్రహ్మమయుఁ డై § యర్కాభుఁ డై నిత్యుఁ డై.

సీ. అట్టినారాయణుం § డఖిలాత్మభూతుండు, కారణమానవా § కారుఁ డైనఁ
జిత్తంబు లతనిపైఁ § జేర్చి సేవించితి, రతికృతార్థుల రైతి § రనవరతము
శోభిల్లు నింధన § జ్యోతిచండంబున, నఖిలభూతములందు § నతఁ డతనికి
జననీజనకదార § సఖిపుత్త్రబాంధవ, శత్రుప్రియాప్రియ § జనులు లేరు

ఆ. జన్మకర్మములును § జన్మంబులును లేవు, శిష్టరక్షణంబు § సేయవలసి
గుణవిరహితుఁ డయ్యు § గుణి యయి సర్వర, క్షణవినాశకేళి § సలుపుచుండు.

వ. అని మఱియుఁ బెక్కువిధంబుల హరిప్రభావంబు లుపన్యసించుచు నారేయి గడపి మఱునాఁడు దధిమథనశబ్దంబు లాకర్ణించుచు లేచి కృతానుష్ఠానుం డై యుద్ధవుం డొక్కరహస్యప్రదేశంబున నున్నసమయంబున, 1452

శా. రాజీవాక్షుఁడు సుందరాస్యుఁడు మహో । రస్కుండు పీతాంబరుం
డాజానుస్థితబాహుఁ డంబురుహమా । లాలంకృతుం డుల్లస
ద్రాజత్కుండలుఁ డొక్కవీరుఁ డిచటన్ । రాజిల్లు చున్నాఁడు మా
రాజీవాక్షునిభంగి నంచుఁ గని రా । రాజాన్వయున్ గోపికల్. 1453

వ. కని లజ్జాసహితహాసవిలోకనంబులు ముఖంబులసం జెలువొసంగ నిట్లనిరి. 1454

భ్రమరగీతలు.

చ. ఎఱుఁగుదు మేము నిన్ను వన । జేక్షణమిత్త్రుఁడ వీవు కూరిమిన్
మెఱయుచుఁ దల్లిదండ్రులకు । మే లెఱిఁగింపఁ బ్రియుండు వంపఁగా
వఱలెడుభక్తి వచ్చితివి । వారల నైన మనంబులోపలన్
మఱవఁడు మేలు శౌరి మఱి । మాన్యులు రాజున కెవ్వరిచ్చటన్. 1455

క. మునివరు లైనను బాంధుల, ఘనసఖ్యము విడువలేరు । కాక విడువరే
పనిమిత్తసఖ్య మాఁకటి, పని దీఱిన నళులు విరులఁ । [1]బాయునొ లేదో. 1456

చ. అని యిటు గోపికల్ వలుక । నం దొకగోపిక కృష్ణపాదచిం
తనమునఁ జొక్కి చేరువను । దైవవశంబునఁ గాంచె నుజ్జ్వల
త్సునిశితసద్వివేకముఁ బ్ర । సూనమరందమదాతిరేకమున్
ఘనమృదునాదసంచలిత । కాముకలోకముఁ జంచరీకమున్. 1457

వ. కని హరి తన్నుం బ్రార్థింపఁ బుత్తెంచినదూత యని కల్పించుకొని యుద్ధవునికి నన్యాపదేశంబై యెఱుకపడ నయ్యాలికిం దొయ్యలి యిట్లనియె. 1458

మ. భ్రమరా దుర్జనమిత్త్ర ముట్టకుము మా । పాదాబ్జముల్ నాగర
ప్రమదాళీకుచకుంకుమాంకితలస । త్ప్రాణేశదామప్రసూ
నమరందారుణితాననుండ వగుటన్ । నాథుండు మన్నించుఁగా
క మము న్నేఁపుచుఁ బౌరకాంతల [2]శుభా । గారంబులన్ నిత్యమున్. 1459

మ. ఒకపువ్వందలి తేనె ద్రావి మధుపా । యుత్సాహి వై నీవు వే
ఱొకటిం బొందెడుభంగి మన్మథరపీ । యూషంబునం దేల్చి మా
యకలంకోజ్జ్వలయౌవనంబు గొని య । న్యాసక్తుఁ డయ్యెన్ విభుం
డకటా యాతని కెట్లు దక్కె సిరి మి । థ్యాకీర్తి నమ్మెం జుమీ. 1460

శా. భృంగా కృష్ణుఁడు మంచివాఁ డనుచు సం । ప్రీతిం బ్రశంసించె దీ
సంగీతంబున నేము సొక్కుదుమె త । చ్చారిత్రముల్ వింతలే
యంగీకారము గావు మాకుఁ బురకాం । తాగ్రప్రదేశంబులన్
సంగీతం బొనరింపు వారి కుదురో । జన్ నీకు నిష్టార్థముల్. 1461

మ. సమదాళీశ్వర చూకు ముజ్జ్వలితహా । సభ్రూవిజృంభంబులన్
రమణీయుం డగుశౌరిచేఁ గరఁగరే । రామల్ త్రిలోకంబులం

1. బాయకయున్నే. 2. సభాగారంబులం.

ప్రమదారత్నము లక్ష్మి యాతనిపదా § బ్జాతంబు సేవింప ని
క్కము నే మెవ్వార మాకృపాజలధికిం § గారుణ్యముం జేయఁగన్. 1462

శా. రోలంబేశ్వర నీకు దౌత్యము మహా § రూఢంబు నీనేరుపుల్
సాలున్ మచ్చరణాబ్జముల్ విడువు మ § స్మన్నాథపుత్త్రాదులన్
లీలం బాసి పరంబు డించి తనకున్ § లీనత్వముం బొందుమ
మ్మేలా పాసె విభుండు ధార్మికులు ము § న్నీచందముల్ మెత్తురే. 1463

శా. వాలిం జంపెను వేఁటకానిపగిదిన్ § వంచించి దైత్యానుజన్
లోలం బట్టి విరూపఁ జేసెను బలిన్ § లోభంబుతోఁ గట్టి యా
త్రైలోక్యంబు మొఱంగి పుచ్చుకొనియెన్ § ధర్మజ్ఞుఁడే మాధవుం
డేలా షట్పద యెగ్గు మావలన నీ § కెగ్గింపఁగా నేటికిన్. 1464

ఉ. పన్నుగ మింటిపై కెగసి § పాఱువిహంగము లైన వీనులం
ద న్నొకమాటు విన్న గృహ § దారసుతాదులఁ బాసి విత్తసం
పన్నత డించి సంసరణ § పద్ధతిఁ బాపెడువాఁడు నిత్యకాం
క్ష న్నెఱి నున్నమా బ్రతుకు § సైఁచునె యేల మధువ్రతోత్తమా. 1465

మ. కమనీయం బగు వేఁటకానిపదు రా § కర్ణించి నిక్కంబుగాఁ
దమచిత్తంబులఁ జేర్చి చేరి హరిణుల్ § తద్బాణనిర్భిన్న లై
యమితోగ్రవ్యథ నొందుభంగి హరిమా § యాలాపముల్ నమ్మి దుః
ఖములం జెందితి మంగజాస్త్రజనితో § గ్రశ్రాంతి నిందిందిరా. 1466

ఉ. బంధుల బిడ్డలన్ మగల § భ్రాతలఁ దల్లులఁ దండ్రులన్ మనో
జాంధతఁజేసి డించి [1]శర § ణందినమమ్ము వియోగదుర్దశా
సింధువులోనఁ ద్రోచి యిటు § చేరక పోవుట పాడి గాదు పు
ష్పంధయ యీయధీశునకుఁ § బాదములం బడి యొత్తి చెప్పవే. 1467

సీ. కాంచనరత్నసం § ఘటితసౌధంబులే, మాకుటీరంబులు § మాధవునకు
వివిధనరేంద్రసే § వితరాజధానియే, మాపల్లె యదువంశ § మండనునకు
సురభిపాదపలతా § శోభితారామమే, మాయరణ్యము సింహ § మధ్యమునకుఁ
గమనీయలక్షణ § గజతురంగంబులే, మాధేనువులు కంస § మర్దనునకు

తే. రూపవిభ్రమనైపుణ § రూఢ లైన
మగువలమె మేము మన్మథ § మన్మథునకు
నేల చింతించు మముఁ గృష్ణుఁ § డేల తలఁచుఁ
బృథివి నధిపులు నూతన § ప్రియులు గారె. 1468

వ. అని మఱియు ని ట్లనేకవిధంబులఁ గృష్ణసందర్శనలాలన లయి పలుకుచున్నగోపి
కలవచనంబులు విని యుద్ధవుండు మధురాలాపంబుల నూరార్చుచు ని ట్లనియె.

---

1. 'తను నందిన' వ్రా. ప్ర.

మ. జపదానవ్రతహోమసంయమతప § స్స్వాధ్యాయముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నేవిభున్ మనములన్ § నిల్పంగలే రట్టిస
ద్విపులాకారునిపై మహామహిముపై § విశ్వేశుపై మీ కజ
స్రపటుధ్యానము లిట్లు నిల్చెనె భవ § చ్చారిత్రముల్ చిత్రముల్. 1470

క. నను మీకడకుం గృష్ణుఁడు, పని పంపెడువేళఁ బిలిచి § పలికినపలుకుల్
వినుఁ డన్నియు వివరించెద, వనజేక్షణలార మీరు § వగవకుఁ డింకన్. 1471

వ. అని హరివచనంబులు గా నిట్లనియె. 1472

సీ. ఎల్లకార్యములకు § నేను బ్రధానకారణము గావున మీకు § రామలార
కలుగదు మద్వియోగము చరాచరరూపములలో మహాభూత § ములు వసించు
కరణి నుండుదు సర్వ § గతుఁడనై నే మనఃప్రాణబుద్ధిగుణేంద్రి § యాశ్రయుండ
నాత్మయం దాత్మచే § నాత్మఁ బుట్టింతు రక్షింతును ద్రుంతు హృ § షీకభూత

తే. గుణగణాకార మాత్మకుఁ § గొమరు మిగులు
నిబిడమాయానుభవమున § నిత్యశుద్ధ
మాత్మవిజ్ఞానమయము నై § యమరు గుణముఁ
బ్రకృతికార్యమనోవృత్తిఁ § బట్టి పొందు. 1473

చ. కలఁ గని లేచి మున్ను గలఁ § గన్నసమస్తవిధంబుఁ గల్లగాఁ
దలఁచినభంగి మానసప § దార్థముచే నిఖిలేంద్రియార్థముల్
బలమునఁ గట్టి తజ్జ్ఞుఁడు ప్ర § పంచము లేదనుఁ దన్మనంబుఁ దా
రలయక కట్టుదుర్ బుధుల § కవ్వల నొండొకభేద మున్నదే. 1474

ఆ. సాంఖ్యయోగనిగమ § సత్యతపోదమములు మనోనిరోధ § మును గడపల
గాఁగ నుండు జలధి § కడపలగాఁ గలనదులభంగి నళిన § నయనలార. 1475

మ. చెలువల్ దవ్వుల నున్నవల్లభులపైఁ § జిత్తంబులం గూర్తు రు
త్కలికం జేరువవారికంటె నదియుం § గా కెప్పుడున్ నన్ను మీ
రలు చింతించుచు నుండఁ గోరి యిటు దూ § రస్థత్వముం బొందితిం
దలఁకం బోలదు నన్నుఁ గూడెదరు ని § త్యధ్యానపారీణలై. 1476

వ. అని మీకుం జెప్పు మని కృష్ణుండు సెప్పె ననవుడు నుద్ధవునికిం గోపికలు సంతసించి యి ట్లనిరి. 1477

ఉ. ఇమ్ముల నున్నవాఁడె హరి § యిక్కడి కెన్నఁడు వచ్చు వచ్చి మా
యుమ్మలికంబు వాపునె ప్రి § యుం డిట వచ్చెద నన్న నైఁతురే
యమ్మధురాపురీరమణు § లడ్డము వత్తురు గాక చెల్లరే
మమ్ము విధాత నిర్దయుఁడు § మన్మథవేదనపాలు సేసెనే. 1478

చ. మఱచునొకో మదిం దలఁచి § మాధవుఁ డాయమునాతటంబునం

దఱుచుగ దివ్యసౌరభల § తాగ్రుహసీమల నేము [1]డాఁగఁగా
మఱువుల నుండి నీడలకు § మమ్మెలయించి కలంచి దేహముల్
మఱచినఁ దేర్చి నూల్కొలిపి § మన్మథలీలలఁ దేల్చుచందముల్. 1479

శా. నీతో నర్మగృహంబులం బలుకునే § నే మెల్ల వంశోల్లస
ద్గీతభ్రాంతల మై కళిందతనయా § తీరంబునం జేరినం
జేతోజాతసుఖంబులం దనిపి మా § చిత్తస్థితుల్ చూడ లీ
లాతంత్రజ్ఞత దాఁగి మెల్లన మదా § లాపంబు లాలించుటల్. 1480

క. ముచ్చటవేళలఁ జెప్పునె, యచ్చుగ మును నేము నోము § నప్పుడు జలముల్
సొచ్చినమాచేలంబులు, మ్రుచ్చిలి యిచ్చినవిధంబు § మూలం బెల్లన్. 1481

శా. ఏకాంతంబున నీదుపై నొరగి తా § నే మేని భాషించుచో
మాకాంతుండు వచించునే రవిసుతా § మధ్యప్రదేశంబునన్
రాకాచంద్రమయూఖముల్ మెఱయఁగా § రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిం § గ్రీడించువిన్నాణముల్. 1482

సీ. తనుఁ బాసి యొక్కింత§తడ వైన నిటమీఁద, నేలపై మేనులు § నిలువ వనుము
నేలపై మేనులు § నిలువక యటమున్న, ధైర్యంబు లొక్కటఁ § దలఁగు ననుము
ధైర్యంబు లొక్కటఁ § దలఁగినపిమ్మటఁ, జిత్తంబు లిక్కడఁ § జిక్క వనుము
చిత్తంబు లిక్కడఁ § జిక్కక వచ్చినఁ, బ్రాణంబు లుండక § పాయు ననుము

తే. ప్రాణములువోవమఱివచ్చి § ప్రాణవిభుఁడు, ప్రాణిరక్షకుఁడగుతన్ను§బ్రాణులెల్లఁ
జేరి మూరంగ మఱియేమి § సేయువాఁడు, వేగ విన్నప మొనరింపు§వే మహాత్మ.

క. తగులరె మగలను మగువలు, దగులదె తను మున్ను కమల § దగవు విడిచియుం
దగిలినమగువల విడుచుట, దగుఁ దగ దని తగవు వలుకఁ § దగుదువు హరికిన్.

సీ. విభుఁడు మాప్రేపల్లె§వీథుల నేతేరఁ, జూతుమే యొకనాఁడు § చూపు లలరఁ
బ్రభుఁడు మాతో నర్మ § భాషలు భాషింప, విందుమే యొకనాఁడు § వీను లలరఁ
దనువులు పులకింప § దయితుండు డాసినఁ, గలుగునే యొకనాఁడు § కౌగిలింపఁ
బ్రాణేశ మమ్మేల § పాసితి వని దూఱ, దొరకునే యొకనాఁడు § తొట్రుపడఁగ

తే. వచ్చునేహరిమేమున్న§వనముఁజూడఁ, దలఁచునేభర్తమాయింటి§తగులు తెఱఁగుఁ
దెచ్చునేవిధి మన్నాథుఁ§దిట్టువడక, యెఱుఁగఁబలుకు మహాత్మ నీ § కెఱుఁగవచ్చు.

వ. అని దుఃఖార్ణవమగ్నం బయినగోపకులంబు నుద్ధరింపుము రమానాథ యని గోపి
కలు వగచి తదనంతరంబ మఱియు నుద్ధవనిగదితం బయినకృష్ణసందేశంబు
వలన విరహవేదనలు విడిచి యుద్ధవునిం బూజించి రిట్లు కృష్ణలీలావర్ణనలు
సేయుచు వ్రేపల్లె నుద్ధవుండు గొన్ని నెల లుండి నందాదుల వీడ్కొని మరలి
రథారూఢుం డై చని చని. 1486

1. రాఁగ నామఱుఁగుల.

క. సారమతిఁ బ్రణుతి సేయుచు, నారయ నుద్ధవుఁడు గాంచె ♦ నఘసంహారిన్
హారిన్ మధురానగరవి,హారిన్ రిపుజనమదాప ♦ హారిన్ శౌరిన్. 1487

వ. కని యథోచితంబుగా సంభాషించుచుఁ దనచేత నందాదులు వుత్తెంచినకానుకలు బలకృష్ణులకు నుగ్రసేనునికి వేఱువేఱ యిచ్చె నని చెప్పి శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 1488

కృష్ణుం డుద్ధవునితోఁ జేరకొని కుబ్జాగృహంబునకు నరుగుట.

మ. తను ము న్నంగజకేళిఁ గోరినలతా ♦ తన్విన్ రతిక్రీడలం
దనుపం గోరి జనార్దనుం డరిగె ర ♦ త్నస్వర్ణమాల్యానులే
పనభూషాంబరధూపదీపపరిదీ ♦ ప్తం బై మనోజప్రదీ
పన మై యున్నతదీయగేహమునకుం ♦ బంచేషుపంచేషుఁ డై. 1489

వ. ఇట్లరిగి తద్గేహమధ్యంబున. 1490

ఆ. కాముశరమువోలెఁ ♦ గమలారికళవోలె, మెలఁగి యాడ నేర్చు ♦ మెఱుపువోలె
నిఖిలభువనమోహి♦నీదేవతయుఁబోలెఁ, జెలువు మెఱసియున్న ♦ చెలువఁగనియె.

మ. హరి యేతెంచిన లేచి సంభ్రమముతో ♦ నాళీసమూహంబుచే
సిరి యొప్పన్ విహితోపచారములు తాఁ ♦ జేయించి సౌవర్ణసుం
దరతల్పస్థితుఁ జేసి యుద్ధవుని ను ♦ ద్యత్ప్రీతిఁ బూజించి భా
సురపీఠంబున నుండ నుంచు మది నా ♦ త్మస్యంబు శోభిల్లఁగన్. 1492

క. ఆళీనివహనివేదిత, మాలామృగనాభిపంక ♦ మణిమయభూషా
చేలాలంకృత యగుచును, హేలావతి గోరె వనరు ♦ హేక్షణుఁ గవయన్.1493

క. లీలావతీకృతోల్లస, దేలాకర్పూరమిళిత ♦ హితమధురమహా
హాలారసపానమద, శ్రీలాలిత యగుచు నబల ♦ చేరెం గృష్ణున్. 1494

మ. సరసాలోకనవృష్టిపైఁ గురియుచున్ ♦ సమ్యగ్వచోవైఖరిం
గరఁగం జేసి సువర్ణకంకణసమ ♦ గ్రం బైనసైరంధ్రి కేల్
కరపద్మంబునఁ బట్టి తల్పమున కా ♦ కర్షించి గంభీరతం
బరిరంభాదుల నాన వుచ్చి మరు సం ♦ భావించుచున్ వేడుకన్. 1495

ఉ. జాతియుఁ గాలముం గళయు ♦ సత్త్వము దేశము భావచేష్టలున్
ధాతువుఁ బ్రాయమున్ గుణము ♦ దద్దశయున్ హృదయంబుఁ జూడ్కియుం
బ్రీతివిశేషముం దెలిసి ♦ పెక్కువిధంబులఁ దొయ్యలిన్ మనో
జాతసుఖంబులం దనిపె ♦ శౌరి వధూహృదయాపహారి యై. 1496

క. కరపద్మంబుల మాధవుఁ, గర మొప్పం గౌఁగిలించి ♦ కామానలముం
గరభోరువు వర్జించెను, గరమరు దని తోడిశీత ♦ కరముఖు లలరన్. 1497

మ. సనకాదుల్ తలపోసి కాననివిభున్ ♦ సర్వప్రభున్ దుర్లభున్
మును దా నిచ్చిన యంగరాగసుకృతా ♦ మోదంబునం గూడియున్

ఘననిర్వాణవిభూతి యి మ్మనక యా § కంజాక్షీ ర్యేఁ బాయఁ జా
ల ననుం గొన్నిదినంబు లంగభవలీ § లం దేల్పవే నావుడున్. 1498

ఆ. వనిత గోరుకొనిన § వర మిచ్చి మన్నించి, యుద్ధవుండుఁ దాను § నువిదయిల్లు
వెడలె శౌరి తియ్య§విలుకాఁడు సురభితోఁ, దీఁగెయిల్లువెడలు§తెఱఁగుమెఱయ.

క. ఏవేదంబులఁ గానని, దేవోత్తముఁ గాంచి ముక్తి § తెరు వడుగక రా
జీవేక్షణ రతి యడిగెను, భావింపఁ దదీయకర్మ § ఫల మెట్టిదియో. 1500

క. కారుణ్యంబునఁ గృష్ణుఁడు, తారుణ్యము మెఱసి మదన § తంత్రంబుల లీ
లారణ్యవీథిఁ దేల్చెను, సైరంధ్రిన్ విభవవిజిత § శక్రపురంధ్రిన్. 1501

వ. తదనంతరంబ కృష్ణుం డుద్ధవరామసహితుం డై హస్తినాపురంబునకు నక్రూరునిం బనుపం దలంచి తద్గృహంబునకుం జనిన నతండు వారలం గని లేచి రామకృష్ణులకు నమస్కరించి యుద్ధవుం గౌఁగిలించుకొని వారి నందఱ యథావిధిం బూజించి హరిపాదంబులు తనతొడలమీఁద నిడుకొని యి ట్లనియె. 1502

క. అనుచరులుఁ దానుఁ గంసుఁడు, సనియెన్ నీచేత జముని § సదనంబునకున్
ఘనులార మీబలంబున, నొనరఁగ యాదవులవంశ § ముద్ధృత మయ్యెన్. 1503

వ. మహాత్ములారా మీరు విశ్వాదిపురుషులరు విశ్వకారణులరు విశ్వమయుల రగుట మీకుం గార్యకారణంబులు లే వవధరింపుము పరమేశ్వరా నీవు రజోగుణంబున నఖిలంబును సృజియించి కారణరూపంబునఁ దదనుప్రవిష్టుండ వై కృత దృష్టకార్యరూపప్రపంచాకారంబున దీపించు చుందువు కార్యరూపచరాచర దేహంబులకుం గారణంబు లైనభూప్రముఖంబు లనుగతంబు లై కార్యరూప దేహంబులు నై ప్రకాశించుచందంబున నొక్కండవు కారణరహితుండవు నాత్మతంత్రుండవు నై యుండియు విశ్వాకారంబునఁ బెక్కగుదువు సృష్టిస్థితిలయంబులం జేయు చుండియు విజ్ఞానమూర్తి వగుటం బరిభ్రాంతుం డైనజీవునిభంగి గుణకర్మబద్ధుండవు గావు. కావున సిద్ధంబు తన్నిమిత్తంబున బంధహేతువును సిద్ధింపదు. 1504

సీ. పరఁగ జీవుని నైన § బంధమోక్షము లంట, వంటునే పరతత్త్వ § మైననిన్ను
నంటునె యీశ దే § హాద్యుపాధులు నని,ర్వచనీయములు గాన § వరుస నీకు
జన్మంబు జన్మసం § శ్రయఖేదమును లేవు, కావున బంధమో § క్షములు లేవు
గణుతింప ని న్నులూ§ఖలబద్ధుఁ డనుటయు, నహిముక్తుఁ డనుటయు§నస్మదీయ

ఆ. బాలబుద్ధి గాదె § పాషండముఖరమా,ర్గములచేత నీజ § గద్ధితార్థ
మైనవేదమార్గ § మడఁగి పో వచ్చిన, నవతరించి నిలుపు § దంబుజాక్ష. 1505

క. ఆనీవు ధరణిభారము, మానిచి రక్కసుల నెల్ల § మర్దించుటకై
యానకదుందుభియింటను, మానుగ జన్మించితివి స § మంచితకీర్తిన్. 1506

మ. త్రిజగత్పావనపాదతోయములచే § దీపించి వేదామర

ద్విజముఖ్యాకృతి వైననీవు కరుణన్ § విచ్చేయుటం జేసి మా
నిజగేహంబులు ధన్యతం దనరెడిన్ § ని న్నార్యు లర్చింపఁగా
నజితత్వంబులు వారి కిత్తు వనుకం § పాయత్తచిత్తుండ వై. 1507

శా. ఏపుణ్యాతిశయప్రభావమున నో § యీజన్మమం దిక్కడన్
నీపాదంబులు గంటి ని న్నెఱిఁగితిన్ § నీవుం గృపాళుండ వై
నాపై నర్మిలిఁ జేసి మాన్పఁ దగవే § నానాధనాగారకాం
తాపుత్త్రాదులతోడిబంధనము భ § క్తవ్రాతచింతామణీ. 1508

వ. అని పలికిన నగుచు నక్రూరునికి మాటలవలన సంసారబంధం బగుమోహంబుఁ గీలుకొలుపుచు హరి యి ట్లనియె. 1509

కృష్ణుం డక్రూరుని హస్తినాపురంబునకుఁ బంపుట.

క. బంధుండవు సద్యోహిత,సంధుండవు వావిఁ జూడ § జనకుఁడవు కృపా
సింధుండ వెల్లగుణముల, నంధుఁడవు గావు ప్రోవ § నర్హుఁడ వెందున్. 1510

చ. కొలుతురు మర్త్యు లిష్టములు § గోరి శిలామయదేవసంఘముల్
జలమయతీర్థసంఘమును § సంతతము న్నటు వారు గొల్వఁగా
వల దన రాదు గాక భగ § వత్పదభక్తుల రైనమీక్రియన్
సొలయక దేవతీర్థములు § చూచినయంత నె కోర్కు లిచ్చునే. 1511

వ. మహాత్మా పరమభాగవతుండ వైననీవు మా కభీష్టంబు లొనరింప నర్హుండవు వినుము పాండురాజు పరలోకగతుం డైనఁ గుంతీసహితు లైనపాండవులు ధృతరాష్ట్రశాసనంబున నేతెంచి కరిపురంబున నున్నవా రఁట నిజపుత్త్రమోహితుం డగునయ్యంధనృపతి వారియందు సమత్వంబునం జరింపం డటు గావున. 1512

క. వారలు బంధులు గావున, వారలకును మే లొనర్చి § వా రలరంగా
వారింప వలయు దుస్థితి, వారిజరిపువంశ పొమ్ము § వారిం జూడన్. 1513

వ. అని పలికి సంకర్షణోద్ధవసహితుండై హరి నిజగృహంబునకుం జనుటయు నక్రూరుండు కౌరవరాజధాని యగుకరిపురి కరిగి యందు ధృతరాష్ట్రభీష్మవిదురబాహ్లీకభారద్వాజగౌతమదుర్యోధనకర్ణాశ్వత్థామాదులం గుంతీసహితు లైనపాండవులం దక్కినబంధువులనుం గని యథోచితసత్కారంబుల నంది తద్వర్తనంబు లెఱింగికొనుచుఁ గొన్నిదినంబు లుండ నొక్కనాఁడు విదురుండు విన నేకతంబున నక్రూరునికిం గుంతి యి ట్లనియె. 1514

శా. అన్నా తల్లులుఁ దండ్రులున్ భగినులు § న్నల్లుండ్రు మద్భ్రాతలున్
నిన్నుం బా మ్మనువేళ నే మనిరి మా § నెవ్వాల్ విచారింతురే
యున్నారా సుఖయుక్తు లై మృగి వృక § వ్యాఘ్రంబులో నున్నరే
ఖ న్నే నిక్కడ నున్నదానఁ గుమనః § కౌరవ్యమధ్యంబునన్. 1515

మ. కలఁపించెన్ ఫణికోటిచే లతికలం § గట్టించి గంగానదిన్

నెఱిఁ ద్రోపించె విషాన్వితాన్న మొసఁగెన్ ‡ నిద్రారతిం జెంది యే
మఱి యుండం బొడిపించె నాయుధములన్ ‡ మత్పుత్త్రులం దేమియుం
గొఱ గాఁ డీధృతరాష్ట్రసూనుఁడు మహా ‡ క్రూరుండు కార్యంబులన్. 1516

మ. బలుఁడుం గృష్ణుఁడు నెన్నఁడైనఁ దమలో ‡ భాషించి మేనత్తబి
డ్డలకున్ మేలు తలంతురే వగపులన్ ‡ డయ్యెంగఁ బొ లయ్యెనే
జలజాతాక్షుఁడు భక్తవత్సలుఁ డిలా ‡ చక్రంబు భాగించి యి
మ్ముల నిప్పించునె నాకుమారకులకున్ ‡ ముఖ్యప్రకారంబునన్. 1517

వ. అని పలికి కృష్ణునిఁ జిత్తంబున నిల్పి నమస్కరించి సంకీర్తనంబు సేసి సర్వాత్మక సర్వపాలక (పుండరీకాక్ష) శరణాగత నైననన్ను రక్షింపు మని వగచు చున్నకుంతికి నక్రూరుండు విదురసమేతుండై ప్రియవచనంబుల దుఃఖోపశమనంబు సేసి వీడ్కొని బంధుమిత్త్రమధ్యంబున సుఖోపవిష్టుండై యున్నధృతరాష్ట్రున కిట్లనియె.

ఉ. నీయనుజుండు పాండుధర ‡ ణీవిభుఁ డీల్గిన నీవు భూమి ధ
ర్మాయతబుద్ధి నేలుచుఁ బ్ర ‡ జావళిఁ గాచుచు గౌరవంబుతోఁ
బాయక లోకులందు సమ ‡ భావన చేసితివేనిఁ గీర్తియున్
శ్రేయముఁ గల్గు వే ఱొకటి ‡ సేసిన దుర్గతి గల్గు భూవరా. 1519

సీ. అవనీశ పాండవు ‡ లందు నీనందను, లందు సమానుండ ‡ వగుట బుద్ధి
యెవ్వనితో యోగ ‡ మిం దెవ్వనికి నిత్య, మంగనాగారపు ‡ త్త్రాదికముల
వలన నయ్యెడిదేమి ‡ వసుమతి నొకజంతు, వుదయింప నొకజంతు ‡ వుక్కడంగు
నొకఁడుపుణ్యముఁజెంద ‡ నొకఁడుపాపమునొందు, మీనజీవనభూత ‡ మిళితజలము

ఆ. తత్తనూజు లెట్లు ‡ ద్రావుదు రట్లు మూ,ఢాత్మువిత్త మెల్ల ‡ నపహరింతు
రహితులైనకొడుకు ‡ లటమీఁద మని యైనఁ, జచ్చియైనఁ దండ్రి ‡ జాడఁ జనరు.

క. కావున మూఢాత్ముఁడ వై, నీ వార్జించినధనంబు ‡ నీ పుత్త్రులు దు
ర్భావులు పుచ్చుకొనంగా, భూవర నిందితుఁడ వగుదు ‡ భూనాకములన్. 1521

శా. నిందం బొందకు మయ్య యీతనువు దా ‡ నిద్రాకళాదృష్ట మహా
సందోహంబువిధంబు నిల్వదు సుమీ ‡ జాత్యంధతం బొందియున్
మందప్రజ్ఞత లేక చేసెదవు స ‡ మ్యగ్జ్ఞానచక్షుండ వై
సందేహింపక యిమ్ము పాండవులకున్ ‡ సర్వంసహాభాగమున్. 1522

వ. అనిన ధృతరాష్ట్రుం డి ట్లనియె. 1523

సీ. నీమాట మంచిది ‡ నిశ్చయ మగు నైన, నస్థిరం బైన నా ‡ యంతరంగ
మందు నిల్వదు సుడా ‡ మాచలస్ఫటికశి, లాతలోద్యతతటి ‡ ల్లతికభంగి
నమృతంబు నొందియు ‡ నానందితుఁడు గాని, నరుమాడ్కి నేనునా ‡ నంద మొంద
నీశ్వరాజ్ఞాపథ ‡ మెవ్వఁడు దప్పింప, నోపు విజ్ఞాని యై ‡ యుండి యైన

ఆ. విశ్వ మెల్లఁ జేసి ‡ విభజించి గుణముల, నెవ్వఁ డనుసరించె ‡ నెవ్వఁ డవని,

